శివరావు, దిగవల్లి, 1898-

దక్షిణాఫ్రికా

బెజవాడ, 1928.

Record no. 35

Śivarāvu, Digavalli, 1898-

Dakṣiṇāphrikā

Bejavāḍa, 1928.

Record no. 35

## Bibliographic Record Target

రంగాచార్యుఁడు, కిళాంబి
పురాతన సాంఘిక పరిస్థితులు / కిళాంబి రంగాచార్యుఁడు. - 1. కూర్పు. - రాజమండ్రి : అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడు, 1929.
v, 165 p. ;21 cm.
Record no. 35

Raṅgācāryum̐ḍu, Kiḷāmbi
Purātana sāṅghika paristhitulu / Kiḷāmbi Raṅgācāryum̐ḍu. - 1. kūrpu. - Rājamaṇḍri : Addēpalli Lakṣmaṇasvāminâyuḍu, 1929.
v, 165 p. ;21 cm.
Record no. 35

# పురాతన సాంఘిక పరిస్థితులు

కిళాంబి రంగాచార్యుడు

మొదటికూర్పు 1000 ప్రతులు

రాజమండ్రి

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారిచే
సరస్వతీ పవర్ ప్రెస్సునందు
ముద్రితము.

# పీఠిక.

వృత్తి, మతము, జాతి, వేదశాఖాదిభేదములవలన నిరువది కోట్ల జనసంఖ్య కల హిందువుల సంఘము రమారమి మూఁడువేల యుపశాఖలలోనికి విభజింపఁబడియున్నది. ఈరీతిగ మరి యేదేశములోను మానవసంఘము విభజింపఁబడునటులఁ గాన్పించదు. భోజనము, వివాహము, స్పృశ్యత మున్నగు విషయములలో భిన్నభిన్నములును, అనుల్లంఘనీయులును నగు ఆచారనియమములు కలిగి యీ యుపశాఖ లున్నవి. ఏకాలము నుండి నిట్టి 'వర్ణము' లనంబడునవి వాని విశిష్టచిహ్నములలో దేశమున నుండినవో, ఏయే కారణముల వలన నియ్యవి ప్రజలలో సంభవించినవో తెలిసికొనఁ బ్రయత్నించుచు విద్వాంసులు, పూర్వగ్రంథములను పరీక్షించి భిన్నభిన్నాభిప్రాయములు కలవారై వారివారి యభిప్రాయములను బ్రకటించుచు పుస్తకములను వ్రాసియున్నారు. ఎంత తరిచిచూచినను వర్ణోద్భవ కారణంబులుమాత్రము తెలిసినటులఁ గాన్పించదు. ఎప్పటినుండి ప్రజాసంఘములలో నీ విభాగము లుద్భవించినవో కూడ చెప్పుటకు వీలులేకున్నది.

భిన్నవర్ణములవారలలో వివాహములం గావింపుకొనకుండుటయు, వర్ణములంబట్టి ప్రజలలో నాధిక్యతాల్పత్వంబులు నిర్ణయించుటయు, స్పృశ్యతాస్పృశ్యతాది నియమములు వర్ణలింగములలో ముఖ్యములుగఁ బాటింపఁబడుచున్నవి. ఇట్టివి వర్ణవిభాగములు లేని మానవసంఘములలోను గాన్పించుచున్నవి. 'దక్షిణ సముద్రద్వీపము'లలో 'మరియము' అను పేరుగల జనసంఘములలో రాజులే మృతిలేని

యాత్మగలవారలుగఁ బాటింపఁబడుచు, రా జెవ్వఁడైనను సామాన్యపు కుటుంబకన్యకను వివాహమాడిన నట్టి వధియింపఁబడుచుండెడి వాఁడు 'టాహిటి' అను ప్రదేశములో నుత్తమ వంశస్థురాలగు కన్య తనకంటె నధమస్థుఁడగు నరుని వివాహ మాడిన, అట్టి వివాహము వలన నుద్భవించెడి సంతానము వధియింపఁబడుచుండెడిది. క్రీ॥ శ॥ పదియేడవశతాబ్దములో స్వీడను దేశములో నసమానకుల వివాహములు ఖండింపఁబడి యట్టి వివాహములం గావించుకొనుచుండెడివారు శిక్షింపఁబడుచుండెడివారు. జర్మనీదేశపు వివాహధర్మప్రకారము సామంతప్రభు వెవ్వఁడైనను సామాన్య కులకన్యను వివాహమాడిన నట్టి స్త్రీకి భర్తయొక్క కులగౌరవము సిద్ధింపకపోవుటయె కాక యామెయొక్క సంతానము సక్రమైనదాయమున కనర్హులగుచున్నారు.

బ్రాహ్మణవర్ణమునకు వర్ణములలోఁ గల యాధిక్యము, ఇతర దేశములలో పురోధసుల కుండెడిది. పూర్వమున పెర్షియా దేశములోను, ఐగుప్తదేశములోను పురోధసులు అత్యున్నతపదవి నలంకరించుచుండెడివారు. ఐరోపాఖండములో పోపునకు సాంసారికవిషయములలోఁగూడ సర్వోత్కృష్టస్థానము నశించువరకును పురోధసులె ప్రజలలో నత్యధికమగుస్థానమునందుండి యీ విషయములో బ్రాహ్మణుల కెంతమాత్రమును తీసిపోవకుండెడివారు.

శాఖలలో నాధిక్యతాంతరముల నిర్ణయించుట కష్టసాధ్యమైన కార్యము. ఐన నీ దిగువ నుదాహరింపఁబడిన నియమము లట్టి విషయముల న్నిర్ణయించుటలో కొంతవర కుపయోగకరమైయుండును.

1. ఒక శాఖవా రింకొక శాఖవారియొద్ద భోజనము చేయ లేకయుండియు రెండవ శాఖవారు మొదటి శాఖవారియొద్ద భోజనముఁ జేయుచుండిన, మొదటిశాఖవారె రెండవ శాఖవారికంటె నధికులు.



2. బ్రాహ్మణు లొక శాఖవారిలో నెక్కువ సంబంధము కలిగియుండిన నా శాఖవా రంతకంటె బ్రాహ్మణులలో తక్కువ సంబంధముఁ గల శాఖవారలకంటె నధికులు. అనగ :

i. బ్రాహ్మణు లొకశాఖవా రిచ్చిన యుదకమును త్రాగఁ గలిగిన యా శాఖవారు నీచశాఖకుఁ జెందినటులఁ బరిగణింపఁ పడరు.

ii. తైలపక్వమైన భక్ష్యముల బ్రాహ్మణు లంగీకరింపఁగలిగిన శాఖవారు మొదటి విభాగమునందలి శాఖవారికంటె నధికులు.

iii ఉదకపక్వమైన భక్ష్యములను బ్రాహ్మణు లంగీకరించ గలిగినశాఖవా రుత్తమశాఖస్థులుగఁ బరిగణింపఁబడుదురు.

3. శాఖాధిక్యనిర్ణయ మీరీతిగను జరుగుచున్నది.

i కుండలను తాకినంతమాత్రమున మైలపరుపఁగలిగిన శాఖలవారు.

ii లోహనిర్మితపాత్రలనుసైతము తాకుటచే మైలపరుపఁ గలశాఖలవారు.

iii దేవాలయాంగణమును బ్రవేశించుటకు వీలులేనిశాఖల వారు.

iv గ్రామములఁ బ్రవేశింపలేనివారు.

వర్ణవిభాగములు ప్రజలకు హానిగలుగఁజేయు స్వభావముఁ గల వనియెకాక ప్రజలను క్రూరులుగనొనర్చి వారి ధర్మాధర్మవిచక్షణత్వమునకు హానిఁ గలుగఁజేయుచున్నవనిన వీనుల యభిప్రాయము. మన పూర్వులుమాత్రము, వర్ణవిభాగములు లేనిదె ప్రజాసంఘము నశించుననియు, వర్ణవిభాగములను బాటింపకపోయిన ప్రజ లధార్మికు లగుదురనియు దృఢముగ నమ్ముచుండెడివారని నిశ్చయము.

సర్వస్యాస్యతుసర్గస్య గుప్త్యర్థం సమహాద్యుతిః।
ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్॥

మ॥ 1వ అ॥ 87వ శ్లో॥

నరుఁడు తనజీవితములోఁ బాటింపవలసిన ధర్మము జన్మవలన నిర్ణయింపఁబడుచున్నదని మనపూర్వులు నమ్ముచుండెడివారు. వాని వాని కర్మమువలన ప్రతినరుని జీవితము గలుగుచు నడుచుచున్నదని పూర్వుల దృఢనమ్మకము.

హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే।
యద్యస్యసోదధాత్సర్గే తత్తస్య స్వయమావిశేత్॥
యధర్తు లింగాన్యృతవః స్వయమేవర్తుపర్యయే।
స్వానిస్వాన్యభిపద్యంతే తథాకర్మాణి దేహినః॥

మ 1వ అ 28–29 శ్లో॥

కర్మసిద్ధాంతము, సత్త్వరజస్తమోగుణములు, పునర్జన్మసిద్ధాంతము, వర్ణసిద్ధాంతమందైన వైపరీత్యకాలిన్యాదుల తొలగించినవి.

కాలమునననుసరించి ప్రజల యాచారాదినియమములు మారుచుండ వర్ణలింగములును మార్పుఁజెందుచునే యున్నవని మన్వాది ధర్మశాస్త్రగ్రంథములంబట్టి స్పష్టమగుచున్నది. ఈమార్పులు సంఘమున కుపయుక్తములా యనువిషయము నిర్ణయించుట సులభసాధ్యముకాదు. ఈజరుగుచున్న మార్పులు సంఘమునకు హానిఁగలుగఁజేయుచున్నవనిమాత్రము పూర్వాచారపరాయణుల దృఢమైన నమ్మకము. కాలానుసారముగ తమతమ సంఘములందు సంఘస్థులు మార్పులను జేయకుండిన సంఘములు నశించునని సంఘసంస్కర్తలు నమ్ముచుఁ దమకు నుచితమగుమార్పుల సంఘములోఁ జేయుటకుఁ బాటుపడుచున్నారు. ఇట్టి భిన్నాభిప్రాయము లెప్పటికిని యుండవలసి



నవె. ఏది యెటులున్నను హైందవసంఘముపైని వర్ణవిభాగములకుఁ గల ప్రాబల్య మింతింత యని చెప్పనేరము.

పూర్వమున నెంతవర కిప్పుడు మనము చూచుచున్న విశిష్ట లింగములం గలిగి వర్ణము లుండెడివో నిర్ణయించుటలో ధర్మశాస్త్రాది గ్రంథములును, జాతకకథలు మున్నగు గ్రంథములు నత్యంతోపయోగకరములై యున్నవి. విద్వాంసు లీగ్రంథములం బరీక్షించి కొంతవరకు వర్ణచారిత్రమును వ్రాయఁ బ్రయత్నించిరి. ఈవర్ణసంబంధములైన విషయముల నన్నిటిని యొకసిద్ధాంతములో నిమిడ్చుటకు మాత్రము వీలు గాన్పించదు. మూడువేలకంటె నెక్కుడగు యుపశాఖలుండి శాఖశాఖకును భిన్నభిన్నములగు నాచారములుండిన నీవిషయ మెట్టి చిక్కులలో నిండియుండునో యూహింపఁగలము.

ఈవిషయము యొక్కవిశేషత్వమును గుర్తెరింగియున్నాఁడను. నూతనవర్ణసిద్ధాంతమునుగాని వర్ణచారిత్రమునుకాని ప్రకటించుట నా ప్రయత్నముకాదు. పూర్వగ్రంథముల—మన్వాదిధర్మశాస్త్రములు, జాతకాదిగ్రంథములు—యందు చెప్పఁబడిన కొన్ని వర్ణసంబంధములైన విషయములను నిచ్చో గూర్చి వ్రాసితిని.

విజయనగరము
1–10–1929

పండిత విధేయుఁడు
కి॥ రంగాచార్యుఁడు



శ్రీః

# పురాతన సాంఘిక పరిస్థితులు

౧

ఇరువదియైదు శతాబ్దములకుఁ బూర్వము భరతఖండంబున నుండిన సంఘపరిస్థితుల జ్ఞానంబు బ్రాహ్మణుల సంస్కృతవాఙ్మయము వలననే గలుగునను నమ్మకము విద్వాంసులలో నంతరించినది. బ్రాహ్మణ సంస్కృతవాఙ్మయము మనకొసంగు పూర్వభారతదేశీయ ప్రబోధకచరితంబుల జ్ఞానం బేకదేశీయమైయున్నదనుటలో వింత యేమియును లేదు. ఏలయన; ధర్మశాస్త్ర పురాణాదిగ్రంథములు బ్రాహ్మణసిద్ధాంతానుసారములై యుండి బ్రాహ్మణుల యుద్దేశములనే యాశయములనే ప్రకటించుచుండును. వైదికకర్మానుష్ఠానపరాయణులై బ్రాహ్మణ గ్రంథకర్తలు తమ కర్మలకును సిద్ధాంతములకును ననువగు విషయములను బరిగ్రహించుచుఁ దదితరవిషయములను సరకు గొనకయేయుండిరి. జనసామాన్యమునకు ధర్మనీతివిషయములం గూర్చి బోధములుం గావించు ధర్మశాస్త్రంబులును బురాణములును వైధిక పుస్తకములవలెఁ గాక పూర్వదేశచరిత్రముం గూర్చి సమంబగు జ్ఞానంబు నొసంగుటకుఁ దగియుండవలసినవే కాని యయ్యవి యసంఖ్యాక బ్రాహ్మణసిద్ధాంతపూరితంబులగుటచే జనజీవిత పరిస్థితుల యథార్థ వృత్తాంతంబు నొసంగనేరకున్నవి. ఈకారణంబులచే బ్రాహ్మణేత రోద్గమస్థానంబులనుండి వెలువడిన విషయములు బ్రాహ్మణవాఙ్మయ నిరూపిత విషయములతో విరోధించుచున్నవి. పురాతనబౌద్ధ, జైన, యవన విద్వాంసులచే వ్రాయఁబడిన విషయములు బ్రాహ్మణసిద్ధాంతములతో సరిపోవకుంటుటచే నట్టి బ్రాహ్మణేతరుల వ్రాఁతలను ద్రోసివుచ్చవలయుననూ నుద్దేశ మసందర్భ

మనియు, సత్యానాశన కారణంబనియు మనము దృఢముగఁ జెప్పవచ్చును. అందుచే మనము పూర్వపరిస్థితులను వర్ణించుటలో బౌద్ధ జైన మతగ్రంథములను నిరాకరింపక స్వీకరించుచు బ్రాహ్మణ సిద్ధాంతములం బరీక్షించుచుఁ బురాతన సంఘచరిత్రను బ్రకాశింపఁ బ్రయత్నించితము.

బ్రాహ్మణసిద్ధాంతముల యేకపక్షీయత్వము వర్ణముల విషయములో స్పష్టమగుచున్నది. పూర్వమునుండియు నన్ని దేశములలోను బ్రజలు వివిధ వర్గములుగ విభజింపఁబడినట్లు స్పష్టము. ఐరేనియనులలో నుండినట్టియు నతి పురాతనమగు వేదకాలములో సహితము గనుపించునట్టియు వర్గభేదముల నీ బ్రాహ్మణులు పరిగ్రహించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాదివర్గములను నంతకంటె విశేషముగ దస్యువర్గమును దత్సంబంధములైన సిద్ధాంతములను గల్పించిరి. ఇట్టి వర్గములను మూలముగఁ జేకొని ధర్మశాస్త్రకర్తలు భిన్న భిన్న జాతులలో నతి పూర్వకాలమునసుండి యుండిన ధర్మ విధి వివాహ భోజనాది విషయకములైన యాచారములను వర్ణధర్మములుగ నిరూపించుచు వర్ణసిద్ధాంతముల స్థాపించిరి. బ్రాహ్మణసిద్ధాంతమున మానవసంఘము వివిధ వృత్తి ధర్మములుగల చతుర్వర్ణములుగ విభజింపఁబడినది. వర్ణములలో బ్రాహ్మణులకు నాధిక్య మీయఁబడినది. (1) యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహంబులు వారికి

శ్లో॥ (1) అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా।
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణా నామకల్పయత్।
ప్రజానాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవచ।
విషయేష్వప్రసక్తించ క్షత్రియస్య సమాసతః॥
పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయనమేవచ।
వణిక్పథం కుసీదంచ వైశ్యస్యకృషి మేవచ॥
ఏకమేవతు శూద్రస్య ప్రభుః కర్మసమాదిశత్।
ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా॥

(మను 1 అ॥ 88, 89, 90, 91)



వృత్తిధర్మంబులుగ విధియింపఁబడినవి. క్షత్రియులకుఁ బరిపాలనము వృత్తిగను యజనాధ్యయనదానంబులు ధర్మములుగను విధియింపఁబడినవి. వైశ్యులకుఁ బశుపాల్యము, కర్షణము, వాణిజ్యము, వృత్తులుగను యజనాధ్యయనదానంబులు విధులుగను నియమింపఁబడినవి. శూద్రులకు ద్విజన్ముల సేవయే ధర్మముగ నిరూపింపఁబడినది. ధర్మశాస్త్రకర్తలు తమ సిద్ధాంతములకును బరిసరస్థవృత్తములకును గల విరోధములను గోప్యముగ నుంచలేకపోయిరి. దేశౌన్నత్యము వృద్ధి చెందుచుండఁ దమచే విధియింపఁబడిన వృత్తులకును వివిధజాతుల వారనుసరించుచుండిన వృత్తులకును విరోధము ప్రబలియుండుటచే బ్రాహ్మణసిద్ధాంతములు సత్యహీనములైకనబడుచుండె. తమ సిద్ధాంతములకు విరుద్ధములగు వృత్తముల సమర్థించు టెట్లు?

శ్లో॥ "బ్రాహ్మణః క్షత్రియోవైశ్య స్త్రయోవర్ణాద్విజాతయః।
చతుర్థ ఏకజాతిస్తు శూద్రోనాస్తితు పంచమః॥"

(మను॥ 10 అ॥ 4)

అను మనువచనముం ద్రోసిపుచ్చి నూతనవర్ణములం గల్పించు టెట్లు? సిద్ధాంతములకును వృత్తములకును గల వైషమ్యమును బోఁగొట్టకపోయినఁ దమ సిద్ధాంతములకును దమ యాధిక్యమునకును గూడ హానివాటిల్లు. ఇట్టి చిక్కునుండి తప్పించుకొనుటకై సంకర జాతులను బ్రాహ్మణసిద్ధాంతసంరక్షకులు గల్పించిరి.

మనుధర్మశాస్త్రములో నీరీతిగ ననులోమ ప్రతిలోమజాతుల వారలు వర్ణింపఁబడుచున్నారు.

శ్లో॥ బ్రాహ్మణాద్వైశ్యకన్యాయామంబష్ఠోనామజాయతే।
నిషాదశ్శూద్రకన్యాయాం యఃపారశవఉచ్యతే॥

క్షత్రియాచ్ఛూద్రకన్యాయాం క్రూరాచారవిహారవాన్।
క్షత్రశూద్రవపుర్జంతుః ఉగ్రోనామప్రజాయతే॥

విప్రస్యత్రిషువర్ణేషు నృపతేర్వర్ణయోర్ద్వయోః।
వైశ్యస్యవర్ణే చైకస్మిన్ షడేతేపశదాస్స్మృతాః॥

క్షత్రియాద్విప్రకన్యాయాం సూతోభవతిజాతితః।
వైశ్యాన్మాగధవైదేహౌ రాజవిప్రాంగనాసుతౌ॥

శూద్రాదాయోగవఃక్షత్తా చండాలశ్చాధమోనృణాం।
వైశ్యరాజన్యవిప్రాసు జాయంతే వర్ణసంకరాః॥

శ్లో॥ ఏకాంతరేత్వానులోమ్యాదంబష్ఠోగ్రౌయథాస్మృతౌ।
క్షత్తృవైదేహకౌతద్వత్ప్రాతిలోమ్యేపిజన్మని॥

పుత్రాయేనంతరస్త్రీజాః క్రమేణోక్తా ద్విజన్మనామ్।
తాననంతరనామ్నస్తు మాతృదోషాత్ప్రచక్షతే॥

బ్రాహ్మణాదుగ్రకన్యాయా మావృతోనామజాయతే।
అభీరోంబష్ఠకన్యాయా మాయోగవ్యాంతుధిగ్వణః॥

ఆయోగవశ్చక్షత్తాచ చండాలశ్చాధమోనృణామ్।
ప్రాతిలోమ్యేనజాయంతే శూద్రాదపశదాస్త్రయః॥

వైశ్యాన్మాగధవైదేహౌ క్షత్రియాత్సూతఏవతు।
ప్రతీపమేతే జాయంతే పరేప్యపశదాస్త్రయః॥

జాతోనిషాదాచ్ఛూద్రాయాం జాత్యాభవతిపుల్కసః।
శూద్రాజ్జాతో నిషాద్యాంతు సవైకుక్కుటకస్స్మృతః॥

క్షత్తుర్జాతస్తథోగ్రాయాం శ్వపాకఇతికీర్త్యతే।
వైదేహకేనత్వంబష్ఠ్యాముత్పన్నో వేణఉచ్యతే॥

(మను॥ 10 అ॥ 6_56)



అనులోమజాతుల వారల పట్టిక యీ క్రిందఁ బొందుపఱుపఁబడుచున్నది.

| జనకుఁడు | జనని | సంతానము |
|---|---|---|
| 1 బ్రాహ్మణుఁడు | వైశ్యస్త్రీ | అంబష్ఠులు |
| 2 ,, | శూద్రస్త్రీ | నిషాదులు / పారశవులు |
| 3 క్షత్రియుఁడు | శూద్రస్త్రీ | ఉగ్రులు |
| 4 ,, | బ్రాహ్మణస్త్రీ | సూతులు |
| 5 వైశ్యుఁడు | బ్రాహ్మణస్త్రీ | వైదేహులు |
| 6 ,, | క్షత్రియస్త్రీ | మాగధులు |
| 7 శూద్రుఁడు | బ్రాహ్మణస్త్రీ | చండాలుఁడు |
| 8 ,, | క్షత్రియస్త్రీ | క్షత్తలు |
| 9 ,, | వైశ్యస్త్రీ | ఆయోగవులు |
| 10 బ్రాహ్మణుఁడు | ఉగ్రకన్య | ఆవృతులు |
| 11 ,, | అంబష్ఠకన్య | ఆభీరులు |
| 12 ,, | ఆయోగవకన్య | ధిగ్వణులు |
| 13 విషాదుఁడు | శూద్రస్త్రీ | పుల్కసులు |
| 14 శూద్రుఁడు | నిషాదకన్య | కుక్కుటకులు |
| 15 క్షత్త | ఉగ్రకన్య | శ్వపాకులు |
| 16 వైదేహుఁడు | అంబష్ఠకన్య | వేణులు |

మను ధర్మశాస్త్రంబునఁ బదియవ యధ్యాయంబున వ్రాత్యులు పేర్కొనఁబడుచున్నారు.

శ్లో॥ ద్విజాతయస్సవర్ణాసు జనయంత్యవ్రతాంస్తుయాన్।
తాన్ సావిత్రీ పరిభ్రష్టాన్ వ్రాత్యానితివినిర్దిశేత్॥

(మను. 10 అ. 20)

ఉపనయనాది సంస్కారహీనులైన ద్విజులు వ్రాత్యులగుచున్నారని పై మనువచనముం బట్టి స్పష్టమగుచున్నది.

శ్లో॥ వ్రాత్యాత్తు జాయతే విప్రాత్పాపాత్మా భూర్జకంటకః।
అవంత్యవాటధానాచ పుష్పధశ్శైఖ ఏవచ॥
వైశ్యాత్తుజాయతే వ్రాత్యాత్సుధన్వాచార్య ఏవచ।
కారుషశ్చ విజన్మాచ మైత్రస్సాత్వత ఏవచ॥

(10 అ. 21_23)

| జనకుఁడు | జనని | సంతానము. |
|---|---|---|
| 1 వ్రాత్యబ్రాహ్మణుఁడు | సవర్ణజాతి కన్య | భూర్జకంటకుఁడు, అవంతుఁడు, అవాటుఁడు, ధానుఁడు, పుష్పధుఁడు, శైఖుఁడు. |
| 2 వ్రాత్యక్షత్రియుఁడు | సవర్ణజాతి స్త్రీ | ఝల్లుఁడు, మల్లుఁడు, నిచ్ఛివుఁడు, నటుఁడు, కరణుఁడు, ఖసుఁడు, ద్రవిడుఁడు. |
| 3 వ్రాత్యవైశ్యుఁడు | సవర్ణజాతి స్త్రీ | సుధన్వాచార్యుఁడు, కారుషుఁడు, విజన్ముఁడు, మైత్రుఁడు, సాత్వతుఁడు. |

ఈ సంకరవర్ణవ్రాత్యసిద్ధాంతములు నిజస్థితి నిరూపణముంగావింపనేరవని చూడఁగనే స్పష్టమగుచున్నది. మాగధ, వైదేహ, నిచ్ఛివనామంబులు నివాసదేశంబులవలనఁ దత్తద్దేశవాసులకుఁ గలిగెనని తెలియనగును. సూత, వేణ, నట, కైవర్తాదినామంబులు



వృత్తుల ననుసరించి గలుఁగుచుండెడివని స్పష్టము. ఆర్యబ్రాహ్మణులచే నిరసింపఁబడియుఁ బరనిరపేక్షస్వసంపూర్ణములగు జనసంఘంబులను బ్రాహ్మణసిద్ధాంతకర్తలకుఁ దమసిద్ధాంతములనుండి దొలఁగించుటకుఁ గుదురదయ్యెను. అట్టివారలను జాతుర్వర్ణ్యములలో నిముడ్చుటకు వీలులేకుండెను. ఇట్టికష్టములనుండి తప్పించుకొనుటకై బ్రాహ్మణసిద్ధాంతకర్త లనులోమ ప్రతిలోమజాతి సిద్ధాంతములను గల్పించిరి.

శాస్త్రీయసిద్ధాంతములకును యథార్థస్థితులకును నుండిన వైషమ్యమును ధర్మశాస్త్రకర్తలు పోఁగొట్టఁ బ్రయత్నించుట వేఱొక విషయమునుండియు స్పష్టమగుచున్నది. వివిధజాతులకు విధియింపఁబడిన వృత్తుల నాయాజాతివారలు శాస్త్రవిరోధము లేకుండ నవలంబించుట యసంభవము. ఉత్తమవర్ణజులు శాస్త్రవిహితవృత్తులచే జీవనోపాధిని సంపాదింపనేరకుండినఁ దమకంటె హీనజాతులవారికి నియమింపఁబడిన వృత్తులచే జీవింపవచ్చునని ధర్మకర్త లనుగ్రహించిరి. అట్లు బ్రాహ్మణుఁ డధ్యయనాదులవలన జీవనమునకుం దగిన ధనము నార్జింపలేకపోయిన క్షత్రియవృత్తి నవలంబింపవచ్చుననియు నటుల క్షత్రియులు రాజన్యవృత్తిచే నాత్మపోషణము జేయలేకయుండిన వైశ్యవృత్తులైన పాశుపాల్యకర్షణాదుల ననుసరింపవచ్చుననియు మను వంగీకరించుచువచ్చెను.

శ్లో॥ వేదాభ్యాసో బ్రాహ్మణస్య క్షత్రియస్య చరక్షణమ్।
వార్తాకర్మైవ వైశ్యస్య విశిష్టాని స్వకర్మసు॥
అజీవంస్తు యథోక్తేన బ్రాహ్మణ స్స్వేనకర్మణా।
జీవేత్ క్షత్రియధర్మేణ సహ్యస్య ప్రత్యనంతరః॥
ఉభాభ్యామప్యజీవంస్తుకథంస్యాదితిచేద్భవేత్।
కృషిగోరక్షమాస్థాయ జీవేద్వైశ్యస్యజీవికామ్॥

(10॥ అ॥ 180, 181, 182)

శ్రాద్ధసమయములందు భోక్తలుగ నుండుట కనర్హులైన బ్రాహ్మణులను మనువు నిరూపించెను. ఆ పరిగణనముంబట్టి బ్రాహ్మణులు పైని జెప్పంబడిన యాపద్ధర్మానుసారములైన క్షత్రియవైశ్య వృత్తులనేగాక వివిధములగు ననేకవృత్తుల నవలంబించుచుండెడివారని స్పష్టమగుచున్నది. బ్రాహ్మణులలోఁ గితవులు, చికిత్సకులు, మాంసవిక్రయులు, పశుపాలుగు, వార్ధుషులు, కుశీలవులు, వందిమాగధులు, తైలకులు, రసవిక్రయులు, హస్తిగోశ్వోష్ట్రదమకులు, దైవజ్ఞులు, శ్వక్రీడులు, శ్యేనజీవులు, కృష్యజీవులు, యుద్ధాచార్యులు, పక్షిపోషకులు, వాస్తువిద్యోపజీవులు, జౌరభ్రికులు, దూతలు, ప్రేతనిర్యాటకులు, ధనుర్బాణకారులు పితృకర్మలలో భోక్తలుగ నుండుట కనర్హులని చెప్పంబడినది. (మను॥ ౩ అ, 151 మున్నగునవి) ఇప్పటికిని భృతిభుజులుగను, నీరుమోయువారలుగను, రక్షకభటులుగను, బాచకులుగను, బగటివేషములవారుగను, నటులుగను నుండి జీవనోపాధిని సంపాదించుకొనుచు జీవించుచున్న బ్రాహ్మణులను మనము గనుచున్నారము. హిందూదేశమున బ్రాహ్మణులలోన నల్పసంఖ్యాకులగువారలు వివిధంబులగు నిట్టి శాస్త్రగర్హితవృత్తుల నవలంబించుచు జీవించుచున్నారని సంఘస్థితులను దెలిసినవారికి స్పష్టము. బ్రాహ్మణసిద్ధాంతములు సంఘపరిస్థితులను యథార్థముగ నిరూపింపకపోయినను సంఘములపైఁ బ్రబలంబగుశక్తిని గనఁబఱచినవని దృఢముగ మనము చెప్పవచ్చును. బ్రాహ్మణప్రబోధము దేశమునఁ బ్రబలుచుండినకొలఁదిని బ్రాహ్మణులు కోరిన యాకృతిని సంఘము విశేషముగఁ బొందుచుండెను. మొదట వివిధవర్ణములవారి ప్రాతికూల్యముండినను దుదకు బ్రాహ్మణులు వర్ణస్థులలో నౌత్కృష్ట్యముంబొంది క్రమక్రమముగ సంఘమును గొంతవఱకు స్వసిద్ధాంతానుసారముగ నుండునటుల మార్పు నొందించిరని మనము నిశ్చయింపవచ్చును.



ఆర్యుల ప్రబోధము వ్యాపించిన యుత్తరహిందూస్థానమునందంతటను బ్రాహ్మణుల యౌత్కృష్ట్య మంగీకరింపఁబడినదా యను విషయమును మన మిచటఁ జర్చింపవలసియున్నది. బ్రాహ్మణసిద్ధాంతములకు మూలస్థానములైన కురు, మత్స్య, పాంచాలశూరసేన దేశముల ప్రదేశము బ్రహ్మర్షి దేశముగ మనువుచేఁ బేర్కొనబడినది.

శ్లో॥ కురుక్షేత్రంచ మత్స్యాశ్చపాంచాలాశ్శూరసేనకాః।
ఏషబ్రహ్మర్షి దేశోవై బ్రహ్మావర్తాదనంతరః॥

(2 అ-18)

ఈ ప్రదేశమున కుత్తరమున హిమాలయ ప్రాంతమునుండి ప్రయాగమీఁదుగ నమరకంటకోర్ధ్వ భూమివఱకు వ్రాయఁబడు రేఖాపర్యంతముండు దేశము మధ్యదేశముగఁ బూర్వమున వ్యవహరింపఁబడుచుండెడిది.

శ్లో॥ హిమవద్వింధ్యయోర్మధ్యం యత్ప్రాగ్వినశనాదపి।
ప్రత్యగేవప్రయాగాచ్చమధ్యదేశః ప్రకీర్తితః॥

(మను 42 అ-11)

ఈ రేఖ కుత్తరమునఁ గాశీ, కోసల, విదేహ, మగధదేశంబులుండెడివి. ఈ దేశములు బ్రహ్మర్షిప్రదేశంబున నుండినటులఁ బరిగణింపఁబడి యుండలేదు. ధర్మశాస్త్రాదులం బట్టి చూచిన మగధ, విదేహదేశస్థు లార్యప్రబోధమును బశ్చిమదేశస్థులకంటెఁ జాలవెనుకను బొందినట్లు విద్వాంసులు చెప్పుచున్నారు. మాగధ, వైదేహనామంబులు చాతుర్వర్ణ్యంబుల వారికేగాక సంకర జాతివారల కుపయోగింపఁబడుటచే నార్యప్రబోధ నిధులమని చింతించు పశ్చిమదేశస్థులగు నార్యులాదిమ మగధ విదేహదేశస్థులను నీచులనుగఁ జూచుచుండెడివారని స్పష్టమగుచున్నది. పాళీవాఙ్మయమున సగౌరవముగఁ దఱ

చుఁ జెప్పఁబడు లిచ్ఛవులును, మల్లులును, గుశీనరపావ పరిపాలకులును క్షత్త్రియ వ్రాత్యులుగ మనువుచేఁ జేర్కొనఁబడియున్నారు. అట్టివార లార్యసంఘంబులకుఁ జెందనియాదిమ జాతివారలలో రాజన్యులేమో యని విద్వాంసు లూహించుచున్నారు.

సంఘపరిస్థితులు జాతిమత దేశభేదముల ననుసరించి భిన్నభిన్నములుగ నుండుటచే బ్రాహ్మణసిద్ధాంతములకు మూలస్థానములైన పశ్చిమదేశముల పరిస్థితులకును బౌద్ధమతమునకు ముఖ్యస్థానములైన ప్రాగ్దేశముల పరిస్థితులకును నధికమగు భేదముండెనని మనము దృఢముగఁ జెప్పవచ్చును. కాన బ్రాహ్మణుల వాఙ్మయమున వర్ణింపఁబడిన సంఘస్థితులను ద్రోసిపుచ్చుట యసమంజసము. అటులనే బౌద్ధవాఙ్మయమున నిరూపింపఁబడిన సంఘస్థితులను విశ్వసించి బ్రాహ్మణవాఙ్మయనిరూపిత విషయముల నిరాకరించుటయు యుక్తముకాదు. బ్రాహ్మణులు సిద్ధాంతవిరుద్ధముగ నుండిన వృత్తముల నిరాకరించి స్వమతానుసారములైన విషయములను విపులముగఁ బ్రకటించిరి. ఆ రీతిగనే బౌద్ధులును బ్రాహ్మణుల సిద్ధాంతములను ద్వేషించుచు బ్రాహ్మణసిద్ధాంతాదులను ఖండించుచుండిరి. కాన మనమొక్క వాఙ్మయమునే పూర్తిగ విశ్వసించి రెండవదానిని నిరాకరించుట యుక్తము కాదు. బ్రాహ్మణులయొక్క గాని బౌద్ధులయొక్క గాని ధర్మశాస్త్రాది గ్రంథములను సంఘపరిస్థితులతో సంబంధించియుండు విషయములకై యత్యంతసావధానముతోఁ బరిశీలింపవలయును.

పైన జెప్పఁబడిన విషయములలో జాతక కథలకును వైదిక ధర్మశాస్త్రాది గ్రంథములకును మిగుల భేదమున్నది. జాతకకథలలోఁ జెప్పఁబడు బ్రాహ్మణసిద్ధాంత ఖండనములను మనము పూర్తిగ విశ్వసింపలేక పోయినను జన జీవితసంబంధములగు విషయములు ప్రాసంగిక రీతిని వర్ణింపఁబడుటచే నయ్యవి విశ్వసనీయములని మనము వానిఁ



బరిగ్రహింపవచ్చును. నిజవర్ణాత్కృష్ట్య ప్రకాశకంబులగు బ్రాహ్మణుల యేకదేశీయ సిద్ధాంతములకంటె జాతకకథలు మనకుఁ బూర్వకాలికసాంఘిక పరిస్థితులం గూర్చి సత్యంబగు జ్ఞానంబు నొసంగుచున్నవని విద్వాంసులు చెప్పుచున్నారు. తదితర పుస్తకములం గన్పడని దేశాచారములును జాత్యాచారములును జాతకకథలయందు సందర్భానుసారముగఁ జేర్కొనఁబడియుండుటచే నట్టివిషయముల జ్ఞానంబు నీకథలఁ జదువువారలకుఁ గలుగును. కథాచమత్కృతివలననే గాక పురాతనసాంఘిక జ్ఞానలాభము గలుగఁజేయుటవలనఁ గూడ జాతకకథాపఠనంబు విద్వాంసుల కత్యంతోపకారియై యుండును.

## ౨

### జాతులు - బ్రాహ్మణులు

భారతవర్షమున వర్ణములుగను, జాతులుగను, మానవసంఘము విభజింపఁబడినటులఁ బ్రపంచమున మఱియేదేశమునను విభజింపఁబడుట గాన్పింపదు. జాత్యుద్భవంబునకుఁ గారణమెద్దియో యాదిని నీజాతులెటులుండినవో పూర్వకాలమున నీజాతు లేయేవిశిష్ట చిహ్నములచేఁ బరిగణింపఁబడుచుండెడివో యను ప్రశ్నలకు సాధ్యమైనంతవఱకు బౌద్ధపాళీ గ్రంథములం బట్టియు బ్రాహ్మణుల సంస్కృత గ్రంథములం బట్టియు సమాధానముల నీయఁ బ్రయత్నింతము.

బ్రాహ్మణసిద్ధాంతమందు నిరూపింపఁబడిన వర్ణములకును నిప్పుడు దేశములం దుండు వర్ణములకును బ్రబలభేదంబు గాన్పించుచున్నది. వర్ణసంబంధములైన ప్రాచీన నవీనాభిప్రాయంబులలో నొకదానితో నొకటి సరిపోవకున్నది. వీని రెంటిని సమకూర్చి వర్ణము

లకు సప్రమాణంబగు పరిచ్ఛేదంబు గావింతమన్న నయ్యది సాధ్యంబు కాదు. వర్ణనిర్దేశంబు సముముగఁ గావించుట కీకాలంబున మనకుఁ గాన్పించు వర్ణలింగముల నిరాకరింపక వానిని లెస్సగ గుర్తెఱింగి యవ్యక్తవిషయ బోధలయం దట్టి వాని నుపయోగపఱుపవలెను.

భరతఖండంబున జనసంఘంబులు భిన్నభిన్న చిహ్నాయుక్తంబులై వివిధవర్ణములను జెందియున్నటులఁ జెప్పఁబడుచున్నది. అట్టి బ్రాహ్మణాది వివిధనామములతోఁ బరఁగు ప్రతిసంఘమును దఱచుగ నాత్మాంతర్వర్తియై యన్యాధీనంబై సంప్రదాయయుక్తంబై యుండు. అట్టి సంఘమున కొక ప్రముఖుండును నొక కులసభయు నుండును. జన్మమువలననే మనుజుం డేదియో యొక వర్ణమునకుఁ జెందినవాఁడుగఁ బరిగణింపఁబడును గాని యెన్నికవలన మనుజుండు వర్ణస్థుండు కానేరఁడు. ఒక్క వర్ణమునకుఁ జెందువా రొక్క స్వకులక్రమాగత వృత్తినే యవలంబించుచుందురు. అట్టి వర్ణస్థులు వివాహభోజనశుద్ధి సంబంధములైన విషయములలోఁ భిన్నములైన యాచారముల ననుసరించుచుందురు. సంఘస్థులపై సంఘమున కుండు నధికారము బహిష్కారరూపమునఁ గనఁబఱుపఁబడుచుండును. వర్ణాచార విరుద్ధముగ వర్ణస్థుఁ డెవ్వఁడైన నాచరించిన నట్టివాఁడు వర్ణమునుండి బహిష్కరింపఁబడును. వివాహ స్పర్శాస్పర్శతాది విషయకములైన యాచారములచేతనే వర్ణములకు విశిష్ట చిహ్నము లొసంగఁబడుచున్నవి. ఒక్కవర్ణమునుండి బహిష్కృతుండైనవాఁడు వర్ణహీనుండై యుండును గాని యత్యధమజాతికిం జెందినటులను బరిగణింపఁబడఁడు.

ఇట్టి వర్ణ పరిచ్ఛేదమును బరిగ్రహించి పురాతనకాలములో వర్ణపరిస్థితు లెటులనుండినవో విచారింతము.

రిస్లీ దొరవారు "హిందూ దేశపు జనులు" అనునామము గల తమ పుస్తకములో వర్ణము నిటుల నభివర్ణించియున్నారు. వర్ణ



మన నొక్కనామముచేఁ బరఁగు కులముల సమూహము, లేక కుల సమూహముల సంఘము. ఈకులములన్నియు దైవాంశసంభూతుఁడైన పురుషుని గాని యట్టి యంశములేని పురాణపురుషు నొక్కరునిఁ గాని మూలపురుషునిగఁ బ్రకటించుచుండు. మఱియు నట్టివా రొక్క వృత్తినే యవలంబించుచున్నటులఁ జెప్పుకొనుచుందురు. ప్రతివర్ణమునకు నేదియో యొక వృత్తి నియమింపఁబడియుండు. అట్టి వర్ణంబునకుఁ జెందియుండు జనులు తమ సంఘంబునకుఁ జెందిన వారలతోడనే వివాహసంబంధములను గల్పించుకొందురు గాని తదితరవర్ణస్థులతో నట్టి సంబంధముం జేయరు. వివాహవిషయములలో నిం కొక్క విశేషము. ఒక్కవర్ణమునే చెందిన భిన్నశాఖలవా రొండొరులతో వివాహసంబంధములం జేయరు. ఆంధ్రదేశంబున బ్రాహ్మణులలో నియోగులు, ప్రథమశాఖ నియోగులు, వేఁగినాట్లు, వెలనాట్లు, కాసరనాట్లు, మురికినాట్లు, ఆరామద్రావిడులు, తెలగాణ్యులు మున్నగు ననేకోపశాఖలవారలున్నారు. ఈశాఖలవారలలో నే శాఖవారైనను దదితరశాఖలవారితో వివాహములం జేయరు.

వర్ణము లేరీతి నుద్భవించుచున్నవో మనమిచ్చటఁ జర్చింతము. ఈ విషయములలోఁ గొంతవఱకుఁ బాశ్చాత్యవిద్వాంసులు వ్రాసిన యుద్గ్రంథముల మన మనుసరింపవలెను. మానవసంఘవిషయక జ్ఞానమును బాశ్చాత్యవిద్వాంసులు ప్రకృతిశాస్త్రంబుల సరణి బహునియమయుక్తంబుగ నొనర్చి శాస్త్రంబుగఁ జేసిరి. ఏతచ్ఛాస్త్రరచనార్థము పశుప్రాయులై జీవించు నధమజాతుల వారల యాచారముల సహిత మతిశ్రద్ధతోడను గడునైపుణ్యముతోడను బరీక్షించి విశిష్టప్రబోధనమునకు విఖ్యాతిచెందిన యార్యుల యాచారములలో దురవగాహములై యుండిన యాచారములను సువ్యక్తంబుగఁ బాశ్చాత్యవిద్వాంసు

లోనర్చిరి. ఈ సంబంధములో నొకపదముం గూర్చి యిచట స్పష్టముగ వ్రాయవలసియున్నది. వర్ణమన నెట్టిదియో యిదివఱకు వ్రాసితిమి. వర్గమనఁ దఱచుగ నొక్కవృత్తినే యవలంబింపకుండు కుటుంబముల సమూహము సాధారణముగ నీ వర్గములు దైవాంశసంభూతులగు పురాణపురుషులను గాని యేదియో కొన్ని జంతువులను గాని తమ యుద్భవమునకుఁ గారణంబులుగఁ బరిగణించును. మఱియుఁ గొన్నిచోటులఁ గొన్నికుటుంబములు భిన్నవర్గముతో వారికింగల్గు ప్రబలవిరోధంబుచే నైక్యముతో వసించుచు నేకవర్గస్థులగుదురు. తఱచుగ నొక్కవర్గ మొక్కభాషనే మాటాడుచు నొక్క దేశంబుననే వసించుచుండు. వర్గస్థులు వర్ణస్థులవలెఁ గాక తదితరవర్గముల వారలతో వివాహములం జేసికొనవచ్చును.

వర్గము లిప్పటికిని మన దేశములో వర్ణములుగ మాఱుచున్నవని విద్వాంసు లూహించుచున్నారు. "ఈ మార్పియే యవస్థల ననుసరించి జరుగునో దెలియరాకున్నది. వర్గముచే నతినూతనముగ నవలంబింపఁబడిన యాచారముల కాదినుండియు నా వర్గముచే ననుసరింపఁబడు చుండెడివను నుపధియే మూలకారణము. ఇపుడు జరుగుచున్న మానవశాస్త్ర నిరూపణము (Ethnographic Survey) ఏ వివరణమువలన బహుసంఖ్యాకనరులం గలిగినసంఘము స్వేచ్ఛావృత్తిని నిరాకరించి యౌన్నత్యసంప్రాప్తిచేఁ గల్గునిర్బంధములకు లోనగుచున్నదో తెలిసికొనుటకుఁ బ్రయత్నించుచున్నదని" రిస్లీ దొరవారు వ్రాయుచు నే రీతులుగఁ గొన్నివర్గములు వర్ణములుగ మాఱుచున్నవో తమ పుస్తకములోఁ దెలియఁబఱచిరి. అవి యెవ్వియనిన:—

(1) ఆదిమవాసుల వర్గములోఁ బ్రముఖు లేమార్గముననో శ్రీమంతులగు భూపాలురై ప్రజలచే నుత్తమవర్ణజులుగఁ బరిగణింపఁబడునటుల నిర్వహింతురు. తఱచుగ నట్టివారలు రాజపుత్రులమని



ప్రకటించుచు మొదట బ్రాహ్మణపురోహితు నొక్కని సంపాదింతురు. ఆ బ్రాహ్మణపురోహితుఁడును బురాణపురుషు నొక్కని వారికి వంశకర్తగఁ గల్పించి తద్వర్గనివాసస్థానమైన ప్రదేశముతో సంబంధించిన లోకోత్తరకర్మ నొక్కదానిని వారిపూర్వులుచేసినటుల నభివర్ణించుచు విచిత్రకల్పితకథ నొకదానిని నిర్మించి యట్టివారు రాజపుత్రులలోఁ జేరిన యొకశాఖవారని చెప్పుచు నాశాఖ కొకయపూర్వనామ మొసంగును. నూతనదశలో వారలు తమపుత్రికలవివాహములో నిడుమలం బడుదురు. ఏలయన? వారలు తమ పూర్వవర్గస్థులకు బాలికలనిచ్చి వివాహముఁ గావించుట కొప్పుకొనరు. ఉత్తమరాజపుత్ర వంశస్థులిట్టి కృత్రిమరాజపుత్రుల కన్యలను వివాహమాడుట కంగీకరింపరు. ఒకటి రెండు పురుషాంతరములైన పిదప నీ కృత్రిమరాజపుత్రు లుత్తమకులసంభూతులగు రాజపుత్రులతో వైవాహిక సంబంధములను జేయలేకపోయినను దమకంటెఁ బూర్వము మార్పును బొందిన తమకంటె నధికులుగఁ బరిగణింపఁబడుచున్న బ్రాహ్మణకృతకృత్రిమ రాజపుత్రులతో వివాహసంబంధములను జేసికొనుచుఁ గృతార్థులగుదురు.

(2) ఆదిమవాసు లనేకు లొకప్పుడేదియో యొక మతసిద్ధాంతము నవలంబించి తమ వర్గనామంబును బోఁగొట్టుకొని వైష్ణవ లింగాయత రామాయతాది నామంబులచే వ్యవహరింపఁబడుదురు. జాతికి మిశ్రమము కలుగునా కలుగదా యనునది యాయాజాతుల వైవాహికనియమముల ననుసరించియుండు. అట్టి నూతన మతావలంబకులగు నాదిమవాసులు తమ ప్రాథమిక జాతి సంబంధములను దఱచుగఁ బోఁగొట్టుకొందురు.

(3) ఆదిమవాస వర్గమొకటి యొకప్పుడు నూతననామాంకిత వర్ణమువారమని చెప్పుకొనుచు హైందవ సంఘమున బ్రవేశించును.

ఈనూతన వర్ణము శాస్త్రీయవర్ణములతో సంబంధమేమియు లేకయే యుండును.

ఒకప్పుడాదిమవాస వర్గమొకటి క్రమముగ హైందవసంఘము లోనికిఁ బ్రవేశంబుఁ గావించు. ఇందుల కుదాహరణముగ రిస్లీ దొరవారు వంగదేశమున నుండు భూమిజులను గనుపఱచుచున్నారు. ఈజాతివారలు తమ భాషను విసర్జించి వంగభాషనే మాతృభాషగఁ గొన్ని సంవత్సరముల క్రిందటఁ బరిగ్రహించిరి. వారు హైందవ దేవతారాధనమును గావించుచుందురు. కులదేవతాపూజను వార లలో స్త్రీలు మాత్రమే చేయుచుందురు.

### పాశ్చాత్య విద్వాంసుల వర్ణసిద్ధాంతములు

మొదట సర్ డెంజిల్ ఇబ్బెట్సనుగారి సిద్ధాంతమును నిరూపింతము. ఆయన పంజాబుదేశములోఁ గానుపించు వర్ణవిషయకము లగు స్థితుల నిరూపించుచు నీక్రిందిరీతిగ వ్రాసెను. "ఈక్రింది కారణములచే నాసిద్ధాంతము సత్యంబైనచోఁ బంజాబుదేశమునందలి వర్ణ వివరణంబయినక్రమంబు స్థిరపడుచున్నది. ఆక్రమం బెట్టిదనిన :—

(1) ఆదిమసంఘంబు లన్నిటియందును సదృశములగు వర్ణభేదము లుండుటయు,

(2) సర్వసంఘస్థిత మధ్యమ వర్గీయులచే నవలంబింపఁబడు పరంపరాగతవృత్తుల యాధారముపై నిశ్రేణీ నిర్మాణమును,

(3) ఇతర దేశములలోఁ గానరాని పురోహితవృత్తికత్యున్నత పదవి నొసంగుటయు,

(4) వృత్తులు కులక్రమాగతములై యుండవలయునని ధర్మ విధివలె శాసించుచుఁ బురోహితుల కుచ్చపదారోహణంబు గావించుటయు,



(5) ఆర్యుల బ్రహ్మాండోత్పత్త్యాది విషయకములగు సిద్ధాంతములచే వృత్తులు కులక్రమాగతంబులై యుండవలెనను నియమమును దమ సిద్ధాంతములనుండి యుద్భవించుచున్నటులఁ గొన్ని వివాహ భోజనవృత్తి విషయకములగు నియమములఁ గల్పించి వృత్తులు కుల క్రమాగతములై యుండవలెనను నియమమును స్థిరపరచుటయు."

పై కారణములకుం దోడుగ మనుజులకు స్వభావసిద్ధములై సాంసారికైహిక నిర్బంధజములైన కష్టములఁ దగ్గించు నాభిజాత్యాభిమానముండిన వర్ణము భారతఖండంబున నిట్టి సుప్రసిద్ధస్వనియమానుల్లంఘనీయత్వమును జెందుటలో నేమియును వింతలేదు.

విఖ్యాతుఁడగు 'సెనా' అను పాశ్చాత్యవిద్వాంసుఁ డీసిద్ధాంతమును ముఖ్యముగా రెండువిషయములను విమర్శించెను. మొదటివిమర్శనం బెట్టిదనిన:—బ్రాహ్మణులకు సంఘముపై సిద్ధాంతసిద్ధమైన యధికశక్తి యుండెడిదా యని యాతఁడు మొదట శంకించికొనెను. మనుజుల మనములపై నట్టివిశేషశక్తిని గనుపఱచి బ్రాహ్మణసంఘము కేవలకృత్రిమంబును స్వాపేక్ష్యంబునునగు ధర్మశాస్త్రంబును నవీనముగఁ గల్పించి యుండనోపునా యని వితర్కించెను.

రెండవ విమర్శనం బెద్దియనిన:—ఇబ్బెట్సనుగారి యుద్దేశములప్రకారము వృత్తి వర్ణోత్పత్తికి ముఖ్యకారణమైన యెడల వర్ణములలోవి భిన్నవృత్తు లుండఁగూడదనియును, మొదట భిన్నవస్తువుల సమకూర్పఁగలిగినశక్తి తుదివఱకును విచ్ఛేదము లేకుండఁగనే యుండఁగలిగి యుండనోపుననియును దృఢముగఁ జెప్పెను.

### నెస్ఫీల్డు దొరవారి సిద్ధాంతము

ఈ విద్వాంసుఁడు మూఁడువేల సంవత్సరముల నుండియు నార్యులకును, నాదిమవాసులకును నేవియో గొన్నిభాగములలోఁ దప్పఁ

దక్కిన చోటుల జాతి (blood) భేదము లంతరించినవనియు, నాదిమ వానులలో నీ యార్యులు గలిసిపోయినారనియును, నూహించుచు ముఖ్యముగ సంయుక్తరాష్ట్రములలోని జనులను, హిందూదేశప్రజను లను వృత్తి ననుసరించియుండు వర్ణములనుగ విభజించెను. ఆప్రాంతములలోనున్న నూటయిరువది యొక్క జాతులవారల నీ దిగువ నుదాహరింపఁబడిన వర్గములుగ విభజించెను.

I వర్ణరహితములగు వర్గములు.

II భూమితో సంబంధించిన వర్ణవిభాగములు.

(అ) కిరాతులతో లేక వ్యాధులతో సములు.

(ఆ) చేపలఁబట్టి జీవించువారితో లేక జాలికులతో సములు.

(ఇ) పశుపాలురు, ఆజావికులు మున్నగువారలతో సములు.

(ఈ) కృషీవలులు

(ఉ) భూస్వాములు, యోధులు

III (అ) లోహముల యుపయోగముం దెలియక పూర్వముండు వారితో సములైనవారు.

(ఆ) లోహోపయోగములం దెలిసినవారితో సములు.

IV వాణిజ్యాదులం జేయు వర్ణములవారు

V భృతిభుక్కుల వర్ణములు లేక సేవకవృత్తిఁ జేయువారి వర్ణములు.

VI పురోధసుల వర్ణములు

VII మతవిషయక వర్గములు.

ఇట్టి విభాగములకు, వర్ణములు వృత్తుల నవలంబించియే యేర్పడుచున్నవను సిద్ధాంతము మూలమైయున్నది. ఇట్టిసిద్ధాంతము యథార్థస్థితులతో సరిపోవుచున్నటులఁ గాన్పింపదు. ఈ సిద్ధాంతము నిజ



మైన దైనయెడల నొక్క ప్రదేశముననుండు తంతువాయులందఱు నొక్క జాతిని జెందవలసియున్నది. ఈరీతిగనే కృషీవలులందఱు నొక్క జాతినే చెందవలసియున్నది. అటులనుండక వేఱుగ నుండుట మనము గనుచున్నారము. ఆంధ్రదేశమున దేవాంగులు, సాలీలు, మున్నగువారలు తంతువాయులయ్యు భిన్నభిన్నవర్ణములను జెందియున్నారు. కృషీవలులలోఁ గాపులు, తెలగాలు, గొల్లలు, వెలమలు, నగరాలు, రెడ్లు, భూమంచి రెడ్లు, కమ్మలు, పెరికీలు మున్నగు ననేకభిన్నవర్ణముల వార లున్నారని యందఱకును దెలిసిన విషయమే.

### సెనాదొరవారి సిద్ధాంతము

సెనాదొరవారు, బహు పురాతనంబులగు నార్యుల విధానములు యథాక్రమముగఁ బొందిన స్థితియె వర్ణంబనియును, నిట్టి స్థితి యార్యులు భరతఖండమునఁ గనుఁగొనిన పరిస్థితులతో సరిపోవునట్లు జీవించుటకై గావించిన ప్రబల ప్రయత్నములే మూలకారణంబుగఁ గలదనియును నుడువుచు భారతీయులయొక్క సంఘపరిస్థితులకును బహు పురాతన యవనరోమక సంఘ పరిస్థితులకును సాదృశ్యంబుఁ గనఁబఱచిరి. రోమకదేశంబులో నుండిన జెన్సు (Gens) క్యూరియ (Curia) యవనదేశంబునం దుండిన ఫ్రేట్రియా (Patria) ప్యూలీ (Puly) భరతఖండమునం దుండిన వర్ణమును నీ పండితుఁడు సదృశములైనవని వ్రాయుచున్నాఁడు. బహుపురాతనంబులగు యవనాది సంఘ పరిస్థితుల చరిత్రలను పరిశీలించి యీవిద్వాంసుఁ డార్యశాఖలవారల కందఱకును సమానములగు నాచారములును సంప్రదాయములును వర్ణోత్పత్తికి మూలకారణములై యుండ వర్ణం బుద్భవించెనని వ్రాయుచున్నాఁడు. ఏథెన్సునం దుండిన జీనాసు (Genos) రోమకదేశమం దుండిన జెన్సు (Gens)

భరతదేశమం దుండిన గోత్రంబులోఁ జాలవఱకు సరిపోవుచున్నవని వ్రాయుచున్నాఁడు. "ప్లూటార్కు" అను చరిత్రకారుని ననుసరించి రోమనులలోఁ గన్యలు పితృగోత్రజుల వివాహమాడు నాచారము లేదనియు, సమానవర్గములం దట్టి వివాహములను జనులు చేయకయే యుండెడివారనియు, బహు పూర్వకాలమున నార్యుల వివాహోద్యాచారములు వీనితో సమములై యుండెడివనియు వ్రాసెను. వివాహ విషయములలోనె గాక భోజన విషయములలోఁ గూడ యవన రోమక భారతీయాచారములు సమానములై యుండెనని వ్రాయుచు నుత్తమ జాతివార లధమ జాతివారితో భోజనము చేయఁగూడ దను నిషేధము భారతీయులలోనే గాక యవనరోమకాదులలోఁ గూడ నుండెనని గనఁబఱచెను. విశాలం బగు దేశంబున జనులు వ్యాపించి యుండుట బహు వర్గవిభాగములకుఁ దోడ్పడుననియును నాదిమ వాసులతోడి సంపర్కము జాత్యభిమానమును వృద్ధి నొందించు ననియును జెప్పుచు శౌచాదివిషయక నియమములచే నార్యు లధ్యయన పరిపాలనాది కర్మల ననార్యసంఘముల వారలకు నిషేధించి యట్టి వారల నీచకర్మలయందే నియోగించుటయును, ప్రతి మనుజుఁడును దన కర్మానుసారముగ జన్మమును బొందుసను సిద్ధాంతము ననుసరించుటయుఁ, జెదిరియుండిన సంఘములను గూడఁదీసి యొక్క సంఘముగఁ జేయఁదగిన ప్రభుత్వమేదియు లేక యుండుటయును, దేశమున వర్ణవిభాగ సంస్థాపనమునకు ముఖ్యములగు కారణములని యీవిద్వాంసుఁ డూహించుచున్నాఁడు.

### రిస్లీ దొరవారి సిద్ధాంతము

"వస్తూత్పత్తి యొక్క ఆది కారణములం గూర్చి విచారము నిరర్థకంబు. బహు పూర్వకాలములోనికి నుత్పత్తి కారణముల



నన్వేషించుచు మనము చనిన నొకచోట నజ్ఞానకుడ్యంబు మన యన్వేషణము నవరోధించును. కాన వర్ణమువంటి విషమ విషయములో ననేకాతిసూక్ష్మప్రవృత్తు లంతర్గతంబులై యుండుటచే నందొకటి రెండు భావంబులను సువ్యక్తంబులుగ నొసర్చి యయ్యవి యెటుల వర్తమాన పరిస్థితులం గలుగఁజేసినవో యను విషయమును గనఁబఱచుట మాత్రము వీలై యుండును. ఈరీతి ననుసరించినచో వర్ణోత్పత్తి సంవర్ధనమునకు ముఖ్యముగ సహాయభూతములైన రెండంశములను మనము గనుచున్నారము. అందు మొదటిది ముఖ్యాధారముగఁ బరిగణింపఁదగు భూతార్థము. రెండవది యద్దానిపైఁ గట్టఁబడిన కల్పనావిధానము. మొదటిది సార్వదేశకంబైనది. రెండవది భరతఖండంబును మాత్రమే విశేషముగఁ జెందియున్నది. ప్రపంచంబున నెచటనైన నొక దేశపు జను లింకొక దేశముపై దాడివెడలి యా దేశమును జయించి నపు డట్టి జేతలు జయింపఁబడిన వారల కన్యలను భార్యలుగనో, దాసీజనముగనో పరిగ్రహించుచుఁ దమ కన్యలను మాత్రము తమలోఁ దామె వివాహము చేసికొనుచు నుందురు. కాని జయింపఁబడిన వారలకుఁ దమ కన్యల నిచ్చి వివాహములం జేయరు. జేతలును జయింపఁబడిన వారలును నొక్క జాతివారలై వర్ణభేదమేమియు లేక యుండినచో దమలోఁ దాము మాత్రమే వివాహముఁ జేసికొను నాచార మంతరించి వారందఱు నేకమగుదురు. జాతివర్ణాదులలోఁ బ్రబలభేదంబులుండి నపుడు జయించిన వారి వర్ణము స్వజాతీయులచే సంవర్ధింపఁబడుచుండ నట్టి వారి చరిత్రము మీఁదఁ జెప్పినటులఁ గాక భిన్నమై యింకొకరీతి ననుసరించియుండు. హిమాలయములోఁ గొంతవఱకును, కాంగ్రకను మలలోను, నుండు డోగ్రాలును, నేపాళదేశమున నుండు ఖాసులును, నాయా దేశములం జయించుచుండిన రాజపుత్రులకును నా దేశములో

వసించుచుండు మంగోలియను జాతి స్త్రీలకును బుట్టినవారని విద్వాంసు లూహించుచున్నారు. భిన్నభాషల మాట్లాడువారు కాని, భిన్న దేవతల నర్చించు వారలు గాని, భిన్నాహారములం దినువారలుగాని, భిన్నాచారముల ననుసరించు వారలుగాని, భిన్నవృత్తుల నవలంబించు వారలుగాని, యొక్క వృత్తినే భిన్నభిన్న రీతులుగ నవలంబించు వారలుగాని భిన్నజాతులను జెందియున్నారనియును నక్కారణమున వైవాహికసంబంధములు తమలోఁ దాము చేయఁదగిన వారలు కారనియును నమ్మట కల్పనావిధానమునకు మూలమైయున్నది. ఈనమ్మకముయొక్క యుత్పత్తి మాత్రము దెలియదు. అనేక విధములగు నుపధులు ప్రపంచమున నెల్లెడల సంఘాభివృద్ధికి సహాయభూతములై యుండెననియును, వికారముం బొందుట జీవజంతువులకు సహజమనియును, నట్టి వికారములలో సహాయభూతములైన వికారములు బలపడి వృద్ధిఁ బొందుననియును, నియ్యవియే యుపధులయుత్పత్తికిఁ గారణములనియును రిస్లీ దొరవారు వ్రాయుచున్నారు.

పైని వ్రాయఁబడిన వర్ణలింగములం బరిగ్రహించి పూర్వపు గ్రంథములయందు వర్ణములలో నిట్టి యాచారము లెంతవఱకుఁ గాన్పించుచున్నవో పరీక్షింతము. భోజనవివాహస్పృశ్యతాది విషయములలో వర్ణములయొక్క భిన్నభిన్నములగు నాచారములంగూర్చి మనకెట్టి జ్ఞానమును జాతకకథలు మున్నగునవి యిచ్చుచున్నవో యీక్రింద నిరూపింపఁబడిన వానివలన స్పష్టమగును.

పాళీవాఙ్మయమునుండి వర్ణసంబంధములైన సూత్రాదుల నుదాహరించుచున్నాము. ఈయుదాహరణలలో బ్రాహ్మణపర్ణసిద్ధాంతములు గానిపించును: బ్రాహ్మణసిద్ధాంతమును బౌద్ధభిక్షువులు గుర్తెఱిగియే యుండిరని దీనిచే స్పష్టమగును.



### అంబద్ధసుత్తము

అంబద్ధుండను బ్రాహ్మణయువకుం డొక్కఁడు గోతమబుద్ధుని ప్రదర్శించి బ్రాహ్మణసేవ గావింపవలెనని చెప్పెను. బుద్ధుండాసాభిమానియగు బ్రాహ్మణయువకుని గర్వపరిహారము గావింపఁబూనెను. ఒక క్షత్రియునకు దాసియందుద్భవించిన పుత్రుండు ఋషియై క్షత్రియకన్య నొకతెను వివాహమాడి సంతానవంతుఁడై యా యువకుని గోత్రమైన కృష్ణాయన గోత్రమునకు మూలపురుషుం డయ్యెనని చెప్పుచు నాయువకుని నిట్లు ప్రశ్నించెను.

గోతమబుద్ధుఁడు—బ్రాహ్మణ స్త్రీ యందు క్షత్రియున కుద్భవించినవానిని బ్రాహ్మణు లాసనపానీయంబు లొసంగి సత్కరింతురా?

అంబద్ధుఁడు—అట్లు సేయుదురు.

గో—అట్టివానిఁ దమభోజనపాత్రల యందుఁ దిననిత్తురా?

అం—తిననిత్తురు.

గో—అట్టివానిని మంత్రాధ్యయనంబు గావింపనిత్తురా?

అం—అధ్యయనంబుఁ జేయనిత్తురు.

గో—అట్టివానికిఁ దమ పుత్రికల నొసంగి వివాహము గావింతురా?

అం—అటులఁ జేయుదురు.

గో—క్షత్రియు లట్టివాని నభిషేకాదులచేఁ దమకులములోనికి దీసికొని సత్కరింతురా?

అం—అట్లు సత్కరింపరు.

గో—ఎందువలన నట్లుచేయరు?

అం—అట్టివాఁడు జననిపక్షమున క్షత్రియవంశ జాతుఁడై యుండకపోవుటచే నట్టి సత్కారము లామనుజులకు క్షత్రియులు గావింపరు.

గో—బ్రాహ్మణునికి క్షత్రియ స్త్రీయం దుద్భవించిన మనుజుని భోజనపానీయాసనాదులచే బ్రాహ్మణులు సత్కరింతురా?

అం—బ్రాహ్మణులట్టి నరుని సత్కరింతురు.

గో—అట్టివానిని వేదాధ్యయనంబుఁ గావింపనిత్తురా?

అం—అగును.

గో—అట్టివానికిఁ దమకన్యలనిచ్చి వివాహముఁ గావింతురా?

అం—కావింతురు.

గో—అట్టివానికి క్షత్రియు లభిషేకాదులం గావింపుదురా?

అం—అట్లుచేయరు.

గో—ఎందువలన?

అం—పితృపక్షమున నట్టివాఁడు క్షత్రియకులోద్భవుఁడుగఁ బరిగణింపఁబడఁడు.

గో—అంబధ్ధా! స్త్రీపక్షము చూచినను బురుషపక్షము చూచినను క్షత్రియులే యున్నత కులోద్భవులుగను, బ్రాహ్మణులు వారికంటె హీనకులోద్భవులుగను బరిగణింపఁబడుచున్నటుల స్పష్టమగుచున్నది. క్షత్రియులచే నవమానింపంబడి జాతినుండి బహిష్కరింపఁబడిన క్షత్రియకులసంభూతుని బ్రాహ్మణులు సత్కరించి తమతో నేకపంక్తిని భోజనం బిడి యధ్యాపనంబుఁ జేయింతురా?

అం—అగునటులఁ జేయింతురు.

గో—అతినీచుండైనను క్షత్రియుం డున్నత కులసంభూతుండుగను బ్రాహ్మణుం డంతకంటె నీచంబగు కులమున నుద్భవించినవాఁడుగను బరిగణింపఁబడుచున్నాఁడు.

అం—కులపరిగణనములో క్షత్రియకుల మత్యధికముగఁ బరిగణింపఁబడుచున్నది. కాని సచ్చరితుండును, సుజ్ఞానియునగు నరుండు



నిలింపులలోను నరులలోను నత్యుత్తముఁడుగ నెన్నుకొనఁబడుచున్నాఁడు.

## వాసెట్ఠసుత్తము

మనుజుం డెటులు బ్రాహ్మణుండగునని భారద్వాజవాసెట్ఠులను నిరువురు బ్రాహ్మణయువకులు వివాదపడుచుండిరి.

భారద్వాజుఁడు—పితృమాతృపక్షముల నుత్తమకుల సంభూతుండై పితృపితామహాది సప్తకము వఱకును విశ్రుతకులము గలిగిన జన్మలోఁ గళంకరహితుండగువాఁడు బ్రాహ్మణుండగును.

వాసెట్ఠుఁడు:—"సచ్చరితుండై పుణ్యకర్మానుష్ఠానుండై పూతుండై యుండువాఁడె బ్రాహ్మణుండై యుండు." వారిరువురకు నిట్టి యభిప్రాయభేదము కలిగి సమాధానంబు లేకుండుటచే గోతమబుద్ధుని నీవిషయములో సత్యనిరూపణంబుఁ గావింపుమని వేడిరి. గోతమబుద్ధుఁడు జన్మచే మనుజుని బ్రాహ్మణుఁడని గాని బ్రాహ్మణేతరుఁడని గాని నిరూపింపనేరమనియుఁ గర్మవలననే యట్టి నిశ్చయముఁ జేయవలెననియు నుడువుచుఁ గర్షణమువలన జీవించువాఁడు కృషీవలుఁడనియు బ్రాహ్మణుండు కానేరఁడనియును, గృహ్యాకర్మలం జేయించువాఁడు యాజకుఁ డగుననియును బ్రాహ్మణుఁడు కానేరఁడనియును జెప్పెను.

## అస్సలాయనసుత్తము

అస్సలాయనుఁడను బ్రాహ్మణవిద్వాంసుఁడు గోతముని కడకుం జని యీరీతిగఁ బ్రశ్నించిరి.

"ఓయి గోతముఁడా! బ్రాహ్మణు లీరీతి నుడువుచున్నారు. బ్రాహ్మణు లుత్తమవర్ణజులు. తదితర వర్ణస్థు లంతఱును బ్రాహ్మ

ణులకంటె హీనవర్ణములవారై యున్నారు. బ్రాహ్మణులది శ్వేతవర్ణము; తదితర వర్ణజు లందఱు కాలవర్ణయుక్తులు. బ్రాహ్మణులే పవిత్రులు; తదితర వర్ణస్థులంద ఱపవిత్రులు. బ్రాహ్మణు లొకరే బ్రహ్మముఖసంభూతులును, బ్రహ్మోద్భవులును, బ్రహ్మౌరసపుత్రులును, బ్రహ్మచే సృజింపఁబడినవారలు నై యున్నారు. ఆర్యా! ఇందులకుఁ దా మేమి చెప్పుదురు?

అప్పుడు బుద్ధుఁ డా బ్రాహ్మణయువకుని బ్రాహ్మణస్త్రీలు తదితర వర్ణస్త్రీలు లోనై యున్నటులఁ బ్రసవకష్టములకు లోనై యున్నారా లేదా యని ప్రశ్నించెను. అస్సలాయనుఁ డందులకు బ్రాహ్మణస్త్రీలును దదితర వర్ణస్త్రీలవలెఁ బ్రసవకష్టములకు లోనై యున్నారని యొప్పుకొనెను. బుద్ధుఁ డప్పుడు ఇతరదేశములలో బ్రాహ్మణులకును దదితర వర్ణస్థులకును గడు వర్ణభేద ముండినను బానిసలు యజమానులుగను యజమానులు బానిసలుగను మారుట గాన్పించుటలేదా యని ప్రశ్నించెను. అందుల కా బ్రాహ్మణయువకుఁడు వల్లెయని యొప్పుకొనెను. గోతముఁ డప్పు డాతని క్షత్రియ వైశ్య శూద్రకులములం బుట్టిన నరుండు నరహత్య గావించిన మరణానంతరమున దుఃఖభాజనంబగు జన్మమును గాంచునటులనే బ్రాహ్మణుఁ డట్టి క్రూరకర్మ నాచరించిన కష్టభూయిష్ఠంబగు జన్మమును గాంచఁడా యని ప్రశ్నించెను. "ఉపనీతుఁడును ననుపనీతుఁడును నగు నిరువురు సోదరులలో నెవ్వానికి బ్రాహ్మణులు పుణ్యకర్మలం జేయునపు డగ్రస్థానము నొసంగుదురు?

అస్సలాయనుఁడు:—ఉపనీతుఁడైన వానికే యగ్రస్థాన మొసంగఁబడును.

బుద్ధుఁడు:—అటులైనను నుపనీతుండైనవాఁడు పాపకర్ముఁడై దుర్వ్యాపారములం జేయుచుండి, యనుపనీతుండైన వాఁడు పుణ్య



కర్ముఁడై సదాచరణపరాయణుండై యుండిన బ్రాహ్మణులు వారిరువురలో నెవ్వానికి నగ్రస్థానం బొసంగుదురు?

అస్సలాయనుఁడు:—అనుపనీతునకే యగ్రస్థాన మొసంగఁబడును.

బుద్ధుఁడు:—అస్సలాయనా! నీవే జన్మవలనఁ బూతత్వమును శ్రేష్ఠత్వమును గలుగనేరదని యొప్పుకొనుచుఁ బవిత్రతలో నన్నివర్ణములవారును సమానులే యను వచనము నంగీకరించుచున్నావు.

### మధురసుత్తము

అస్సలాయన సుత్తంబున బుద్ధుఁడు ప్రశ్నించిన రీతినే మహాకచ్చానుఁడను వానినిఁ బ్రశ్నింప నాతఁడు మనుజులలో బ్రాహ్మణకులం బుత్కృష్టంబని నుడువుట యర్థరహితపదోచ్చారణమే కాని వేఱొండుకాదని చెప్పుచుఁ దనయభిప్రాయముల స్థైర్యమునకై యీదిగువ నుదాహరింపఁబడిన యైదుకారణములఁ జెప్పెను.

(1) ధనసంపన్నుఁడైన క్షత్రియుఁడు బ్రాహ్మణునిఁ గాని వైశ్యునిఁ గాని శూద్రునిఁ గాని భృతిభుజునిఁగ నియమింపఁగలఁడు. అటులనె తదితర జాత్యుద్భవుండైన ధనికుండు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములలో నేవర్ణమువానినైన యుక్తవేతన మొసఁగి సేవకునిఁగ నియమింపఁగలఁడు. అట్టి సేవకులును జాతివిచక్షణ లేకయే యజమానుని నతిశ్రద్ధతో సేవింతురు.

(2) జీవహింసకుండును, భోగపరాయణుండును, ననృతవాదియుఁ, బిశునుండును, లోభియు, నసూయాపరుండును, నాత్మశ్లాఘియుఁ, గొల్లఁగొట్టువాఁడును, గుచ్ఛితాభిప్రాయములు గలవాఁడును, బరుషభాషణుఁడును నగు క్షత్రియుండు మరణానంతరమున

దుఃఖకారణం బగు దండనమును బొందును. ఇట్టి దుర్గుణంబులు గల బ్రాహ్మణవైశ్యశూద్రులు కూడ నిటులనె దుఃఖము ననుభవింతురు.

(3) పూర్వమునం జెప్పఁబడిన పాపకార్యములం బరిత్యజించు క్షత్రియుఁడు మరణానంతరమున సుఖదాయకం బగు పుణ్యలోక వాసంబు నొందు. అటులనే బ్రాహ్మణవైశ్యశూద్రులు సచ్చరితులగుచుఁ బుణ్యలోకంబులకుం జనుదురు.

(4) ఇండ్లను గొల్లఁగొట్టుచు, బందిపోట్లం గావించుచు వ్యభిచరించు క్షత్రియుండు నిజదుష్కృతానుసారముగ మరణ, దహన, దేశబహిష్కార, దండనంబులం బడయును. ఇట్టి దుష్కృతములం జేయు బ్రాహ్మణ, వైశ్య, శూద్రాదులు కూడ దండితులగుదురు.

(5) చతుర్థాశ్రమమును స్వీకరించు క్షత్రియుఁడు జనులచే సత్కరింపఁబడుచున్నాఁడు. పరివ్రాజకులగు బ్రాహ్మణ వైశ్య శూద్ర కులోద్భవులు కూడ జనులచే సత్కరింపఁబడుచున్నారు.

వర్ణంబు సంపదలను గాని యాముష్మికానంద దుఃఖములను గాని న్యాయస్థానంబుల న్యాయనిరూపణంబును గాని పరివ్రాజకులకు జనులు చూపించెడి గౌరవమును గాని మార్పలేదని నుడువుచుఁ జాతుర్వర్ణ్యమువారును సమానులగుదురా కారా యని మహాకచ్చాయనుఁడు తన పృచ్ఛకుని నడిగెను.

"ఓకచ్చాయనుఁడా! నిశ్చయముగఁ జాతుర్వర్ణ్యంబుల వారికిని బరస్పర భేదంబెద్దియుఁ గాన్పింపదు."

కణ్ణకథాల సుత్తము

"ఓమహారాజా! క్షత్రియ బ్రాహ్మణ వైశ్య శూద్ర వర్ణంబులన్నాలుగు. ఈచాతుర్వర్ణ్యములలోను రెండు వర్ణములవారు (బ్రాహ్మణ క్షత్రియ వర్ణములవారు) అభివందనాసనముకుళితహస్తపరిచర్యాదుల కర్హులైన నరులలో నగ్రమున నున్నారు."



జాతకకథలయందును బ్రాహ్మణులంగూర్చి చర్చలనేక స్థలములం గావింపఁబడినవి. జాతులలో బ్రాహ్మణవర్ణాధిక్య ఖండనంబులెన్నియో చోటులందుఁగాన్పించు. అందు ముఖ్యములైన కొన్నికథల నిందు వ్రాయుచున్నాము. అందు

ఉద్దాలకజాతకం బొకటి

పూర్వకాలమున బ్రహ్మదత్తుండు వారణాసిని బాలించుచుండినపుడు విశిష్టపాండిత్య గరిష్ఠుండును విశేషబుద్ధి కౌశల్యయుక్తుండును నగుటచే బోధిసత్త్వునిఁ దనపురోహితునిఁగ రాజు నియమించెను. ఆ బ్రాహ్మణశ్రేష్ఠుం డొకనా డుపవనంబున నత్యంతరమణీయంబైన ప్రదేశంబున నొక సౌందర్యరాశి యగు స్వైరిణింగని యామెను మోహించి యామెతో రమించెను. ఆయువతియు గర్భముందాల్చెను. గర్భవతియని యెఱింగి యామె యా భూసురునితో "ఆర్యపుత్రా! నే నొక సజీవంబగు ఫలంబు నొందితిని. అయ్యది జననంబుఁగాంచిన పిదప శిశువున కాతని పితామహుని నామమునుం బెట్టెద" అని చెప్పె. ఆ యవనీసురుఁడును "హీనజాతి స్త్రీ వలన నుద్భవించిన యపత్యము కులనామంబు ధరించుట కర్హమై యుండదు" అని చింతించి యామెతో నిట్లు చెప్పెను: "ప్రేయసీ! ఇచ్చటనుండు నీ వృక్షముయొక్క నామముద్దాలంబు. ఇచటనే నీవు గర్భధారణంబు గావించితివి. కావున నీవా శిశువున కుద్దాలక నామంబుఁ బెట్టుము," అని యనుచు నపు డామె కొక యంగుళిముద్ర నొసంగి యామెతో "నీ కొక పుత్రిక యుద్భవించిన నామె నీ యుంగరముతో బోషింపుము. అటుగాక నీ కొక పుత్రుఁడు జనించిన నాతఁడు యుక్తవయస్కుండైన పిదప నా దగ్గఱ కాతనిం బంపుము," అని చెప్పెను. కొంతకాలమైన పిదప నామె యొక పుత్రునింగనె. ఆమె సుతున కుద్దాలకనామంబుఁ బెట్టెను. ఆ బాలకుండు యుక్తవయస్కుండై జనని నాతఁడు ప్రశ్నించెను.

"ప్రియజననీ! నా జనకుండెవ్వఁడు?"

"బాలకా! నీ జనకుఁడు రాజపురోహితుఁడు" అని తల్లి ప్రత్యుత్తరమొసఁగెను. "అట్లైన నే వేదాధ్యయనముం జేసెద," అని బాలకుఁడు నుడువుచు జనని దగ్గఱనుండి యంగుళిముద్రయును గురుదక్షిణయుం గైకొని తక్కశిలానగరంబునకుం జని జగద్విఖ్యాతుండగు నాచార్యుని సన్నిధిని విద్యలం గఱచెను. సన్న్యాసిసంఘము నొకనాఁడాతఁడుగని "ఈ బైరాగులు పరమోత్కృష్టంబైన జ్ఞానముంగలిగి యుండవలయును. వీరివద్ద జ్ఞానోపదేశంబు నొందెదను" అని వితర్కించుకొనుచు జ్ఞానసంపాదన లగ్నమనస్కుండై తురీయాశ్రమంబుఁ బ్రవేశించి యా సన్న్యాసులకు సమస్తవిధములగు నుపచారములం జేయుచు దనకు జ్ఞానబోధఁ గావింపవలెనని వారిని వేడెను. వారు స్వజ్ఞానానుసారముగ నాతనికి బోధయుం గావించిరి. కాని యా పంచశత సంఖ్యాకంబగు సన్న్యాసిసంఘములో నొక్కరుండైనను నుద్దాలకునికంటె నెక్కువబుద్ధి కౌశల్యముం గలిగి యుండలేదు. వారందఱిలో నాతఁడే ప్రాజ్ఞుండై యుండె. అందుచే వారందఱు నైకకంఠ్యముగ నాతని దమకుఁ బ్రముఖునిఁగ నెన్నుకొనిరి. ఉద్దాలకుఁడు వారితో నిటులఁ జెప్పెను.

"భ్రాతలారా! మీరలు వనంబున వసియించుచుఁ గందమూలఫలాదులం భక్షించుచుందురు. మనుజవాసంబుల కెంమలకుం జనరు?

"ఆర్యా! మాకు భిక్ష నొసంగిన పిదపఁ బ్రజలు మావలనం ధర్మోపదేశంబుఁ బొంద నిచ్చగింతురు. వారు ప్రశ్నల నడిగెదరు. ఆ భయముచే మేము నరవాసంబులకుం జనము" అని వారు సమాధానమొసఁగిరి.



"భ్రాతలారా! నేను మీలో నొక్కరుఁడనై యున్నాను. జగజ్జేతవచ్చినను బ్రశ్నసమాధానంబుల నాకు విడిచి నిర్భయముగ నుండుఁడు" అని యుద్దాలకుఁడు పలికి భిక్షార్థంబు దేశపర్యటనంబు వారలతోఁ గావించుచుఁ దుదకు వారణాసిని జేరి యచటనుండు రాజోపవనంబున బసచేసి మఱునాఁడు సన్న్యాసిసంఘమంతటితోడను ద్వారరక్షితంబగు గ్రామం బొకదానికి భిక్షార్థముం జనెను. అచ్చటజనులు వారల కత్యధికభిక్షాదానంబుం జేసిరి. మఱునాఁడు వారు పురమునకుం జన నచ్చటను వారలకు భిక్ష యత్యధికంబుగ దొరకెను. సన్న్యాసియగు నా యుద్దాలకుఁడు వందనముల నర్పించి ప్రజల నాశీర్వదించి వారి ప్రశ్నలకుం సమాధానముం జెప్పెను. జనులీయుపదేశంబులచేఁ గడుసంతసించి వారు కోరినంత భైక్షము వారలకొసంగిరి. పురమున నెల్లెడలను బ్రాజ్ఞుండును సచ్చరితుండును బరివ్రాజకుండునగు సన్న్యాసి యొక్కరుఁడు పురమునకు విచ్చేసెనని జనులు చెప్పుకొనుచు నరపాలకునితో సైతమాయుదంతమును జెప్పిరి. రాజా సన్న్యాసి యెచట నున్నాఁడని యనుచరులఁ బ్రశ్నింప నాతఁడు సన్న్యాసులతో నుపవనంబున వసించి యున్నాఁడని వారు చెప్ప "సరియే నేనీ దినమున నచటికి జని యాసన్న్యాసిని సందర్శించెదను" అని చెప్పెను. ఉద్దాలకునితో నెవ్వఁడో యొక పురుషుఁడు రాజాతని దర్శించుటకై వచ్చుచున్నాఁడని చెప్పెను. ఉద్దాలకుఁడా ప్రాజ్ఞులగు సన్న్యాసులను రావించి "ఒక్కదినమునైనను మనుజుండు నరపాలుని దయకుఁ బాత్రుండైన నట్టివాని జీవితమంతటికిని నయ్యది చాలు" నని చెప్పెను. "ఓ గురుపుంగవా! మేము చేయవలసిన దేమున్న"దని వారు ప్రశ్నింప నాతఁ డీరీతిని వారలతోఁ జెప్పెను.

"మీలోఁ గొందఱు గబ్బిలములవలెఁ బ్రవర్తింపవలయును. మఱికొందఱు వివిధాసనబంధంబులతో నుండి తపము నాచరించు

చుండవలయును. మఱికొందఱు కంటకశయనంబులపైఁ బరుండియుండవలయు. కొందఱు పంచాగ్నిమధ్యంబునఁ దప మాచరించు చుండవలయు. కొంతమంది యుదకమునందు మగ్నులై యుండవలయు. మఱికొంతమంది వివిధస్థలంబుల శ్లోకంబులం జదువు చుండవలయు'' అని చెప్పి యుద్దాలకుఁడును బదిమంది విద్వాంసులతో నొక నిర్ణీత స్థలంబునఁ గూర్చుండియుండి యెదుట రమణీయంబగు మేజాబల్లపై నొక పుస్తకము నుంచెను. అనల్పపరివారసమేతుఁడై నరపాలుఁడు పురోహితునితోఁ గూడ నా ప్రదేశమునకుంజని యామిథ్యాసన్న్యాసులు తపమాచరించుటను జూచి "వారందఱు దుఃఖభయాది యుక్తులై యున్నారని'' వితర్కించు కొనుచు నుద్దాలకునికడకుం జని భక్తిపూర్వకముగ నాతని నభివందించి యాతని ప్రక్కను గూర్చుండి యీ రీతినిఁ బురోహితునితో ముచ్చటింప నారంభించెను.

"మార్దవరహితచర్మంబులను ధరించుచు దీర్ఘశిఖులుగలవారై యపరిశుద్ధదంతములతోడను నప్రక్షాళితముఖంబులతోడను శ్లోకంబులఁ బఠియించుచుఁ దపంబు మనుజుల ధర్మవిధియని గుర్తెఱుంగుటచే సన్న్యాసులు దుఃఖహీనులై యున్నారా?" పురోహితుఁడు రాజవచనముల విని "రాజున కిట్టి మిథ్యాసన్న్యాసులపై ననుగ్రహము జనించినది. నేను బద్ధముఖుండనై యుండఁ జనదు" అని చింతించుకొనుచు నీరీతిని బల్కెను.

"ఓ నరపాలకా! పాపకార్యంబుఁ జేయుచు సదాచరణరహితుండై యుండువాఁడు సత్యపథంబును గనుఁగొనలేకుండిన దుఃఖరహితుండై యుండఁడు." ఉద్దాలకుఁ డా పురోహితుని వచనంబులు విని "ఈ పుణ్యాత్ములసంఘముపై రాజున కెంతయు ననుగ్రహము పుట్టినది. ఈ బ్రాహ్మణుండు పరుగిడుచున్న వృషభము ముఖంబునఁ గొట్టినాఁడు. సంసిద్ధభోజనముపై మలంబు పడవేయఁబడినది. నే



నాతనితో సంభాషించెద" అని చింతించుకొని యీవిధమునఁ జెప్పె. "వేయి వేదంబుల జ్ఞానము గలిగియు సత్పథంబును గనుంగొన నేఱకుండుటచే మనుజుండు దుఃఖవిముక్తుండు కాలేకపోవుటచే వేదంబులు నిరర్థకంబులనియును నాత్మనిగ్రహపథంబె సత్యపథంబై యుండవలయుననియును నే నూహింపవలసి యున్నది," అనెను. ఇందుల కా పురోహితుఁడు "వేదము లెన్నటికిని నిరర్థకంబులు కావు; మఱియు నాత్మనిగ్రహపథంబె నిశ్శంకంబుగ సత్యంబు గాదు. ఏలయన, వేదాధ్యయనంబుఁ జేయువాఁడు కీర్తినిఁ బడయు; జీవితకాలములో నాత్మనిగ్రహవంతుండైన మనుజుండె శాంతిపొందు" అని చెప్పెను.

ఉద్దాలకుఁడు పురోహితవచనశ్రవణానంతరమున "ఇచట నున్న నీ భూసురునితో విరోధమార్గంబున నాకుఁ బోఁ జనదు. నే నాతని పుత్రుండనని చెప్పిన నాపై నాతఁడు ప్రేమఁ జూపు. నే నాతనితోఁ దెలియఁజెప్పుకొందు" అని యూహించి యీరీతిని జెప్పం దొడంగె.

"జననీజనకులను తదితర బంధువులను మనుజుండు పోషింపవలె. ఎవ్వాని జన్మ కెవ్వాఁడు కారణంబై యుండు నట్టివార లభిన్నులై యుందురు. నీ బ్రాహ్మణకుటుంబమునఁ బుట్టిన యుద్దాలకుండను వాఁడను నేను."

పురోహితుఁడు:—నీవు నిశ్చయముగ నుద్దాలకుఁడవా?

ఉ:—ఆ! నే నగుదును.

పురో:—అటులైన నేను నీ జనని కభిజ్ఞానార్థము చిహ్నానొసంగితిని. అది యేది?

ఉ:—ఓ బ్రాహ్మణుఁడా! ఇదిగో!" అనుచు నంగుళిముద్ర నా బ్రాహ్మణున కొసంగెను.

బ్రాహ్మణుఁ డా యంగుళీయకమును గుర్తెఱింగి "నీవు నిశ్చయముగ బ్రాహ్మణుండవే. ఐనను బ్రాహ్మణధర్మంబును నీ వెఱుంగుదువా? బ్రాహ్మణవిధు లెట్టివియో నీకుం దెలియునా?" అని నుడువుచు నీరీతిగఁ బ్రశ్నించెను.

"ఎట్టివి (గుణకర్మలు) నరుని బ్రాహ్మణునిఁగ నొనర్చు? అతఁ డెటుల సత్యోత్తముం డగు? సచ్చరితుం డన నెట్టివాఁడు? అట్టివాఁ డెటుల నిర్వాణానందముం బొందును?" అందుల కుద్దాలకుం డీరీతిని బ్రత్యుత్తరమిడెను: "సంసారమును త్యజించి సన్న్యాసియై హవ్యవాహనార్చనలం జేయుచు నుదక పరిషేచనంబుల నొనర్చుచు యజ్ఞదండంబును మీఁది కెత్తునట్టివానిఁ బ్రజలు ధర్మాచారపరాయణుండని పొగడుదురు. అట్టి బ్రాహ్మణుఁడు శాంతిం బొందియుండు." ఆపురోహితుం డామాటలు విని యీరీతిగ వాని యసత్యభావంబులఁ బ్రకటించుచు నుడివెను.

"పరిషేచనాదులు బ్రాహ్మణుని బవిత్రునిఁగ నొనర్పఁజాలవు. ఇట్టివి సిద్ధత్వముం జెందుటయుఁ గానేరదు. శాంతియు, దయయుఁ బొందనేరఁడు. నిర్వాణానంద మనుభవింపఁజాలఁడు."

ఉద్దాలకుఁడు పురోహితుని బ్రాహ్మణగుణముల నిరూపింపుమని ప్రశ్నింప నాతఁ డిటులఁ జెప్పె: "క్షేత్రములుగాని ధనముగాని కామంబులుగాని బంధువులుగాని రోగంబులుగాని లేక యుండి జీవనమ్మును నరకుంగొనక దుర్మార్గముల ననుసరింపక యుండు బ్రాహ్మణుఁడు మనశ్శాంతిని బొంది ప్రజలచే ధర్మాచరణపరాయణుండని కీర్తింపఁబడు." మఱియు నుద్దాలకుఁడు "క్షత్రియులును, బ్రాహ్మణులును, వెస్సులును, సుద్దులును, జండాలురును, రక్కసులును సచ్చరిత్రులై నిర్వాణానందముం బొందుట కర్హులైయున్నారు. సన్న్యాసులలో నౌన్నత్యనీచత్వములకుం బ్రసక్తి లేదు. అనేక వర్ణములతోఁ గూడి



నశాణంబుతోఁ జేయఁబడిన పటమండపంబు వివిధవర్ణితార్ధగోళాకృతిశిఖరయుక్తంబయ్యు నేకవర్ణముగల ఛాయనే యొసంగుచున్నది," అని చెప్పెను.

పైనుదాహరింపఁబడిన వానిం బట్టి జాతకకథలలో నయితేము బౌద్ధ వైదిక గ్రంథములలో జాతుర్వర్ణ్య సిద్ధాంతమును గనుచున్నారము. వర్ణముల నిష్ప్రయోజనత్వ మాగ్రంథములయందు దృఢముగఁ జెప్పఁబడినను సంఘము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములుగ విభజింపఁబడియుండుట, నిస్సంశయ విషయముగ బౌద్ధభిక్షువులచేతను బరిగ్రహింపఁబడుచుండెడివని స్పష్టమగుచున్నది. బ్రాహ్మణ వర్ణసిద్ధాంతమును బూర్వపక్షముగ చేయుటకై బౌద్ధభిక్షువు లిట్టి దీర్ఘంబులగు చర్చలఁ గావించియుండిరని మన మూహింపవలసియుండును. బౌద్ధభిక్షువులు నయితేము వర్ణవిభాగముల నిరసింపక గౌరవించుచుండెడివారనునది మాత్రము విచారణీయ విషయము. జంబూఖాదక జాతకంబువలన బౌద్ధభిక్షువులు సన్న్యసింపక పూర్వము దాము చెందియుండెడి వర్ణములఁ బ్రకటించుచుఁ బ్రజలచే నధిక సత్కారముం బొందుచుండెడివారని తెలియుచున్నది. ఆ కథలో దేవదత్తకోకిలులను నిరువురు బౌద్ధసన్న్యాసులు బిచ్చమెత్తుకొనుచు గృహమునుండి గృహమునకు నొకరినొకరు పొగడుకొనుచుఁ దిరుగుచుండిరని చెప్పఁబడినది. దేవదత్తుఁడు విఖ్యాతిచెందిన యొక్కాక (ఇక్ష్వాకు) వంశమునందు జనించినవాఁడని కోకిలుండును, గోకిలుఁడు దీచ్య(బ్రాహ్మణకుల సంభూతుఁడని (బౌద్ధ మతావలంబనమునకుఁ బూర్వము) దేవదత్తుండును జెప్పుకొనుచు భిక్షాటనంబు గావించుచుండిరఁట. బౌద్ధభిక్షువులు వర్ణవిభాగములను లెస్సగ గుర్తెఱిఁగియుండి, జాతినిస్సారతను గనుంగొనియుండి, వర్ణసిద్ధాంత ఖండనమున వర్ణవినాశంబు నసుకూర్చి సుభద్రమగు సంఘంబును నిర్మింపలేదు.

వారలు మోక్షసంపాదనకు జాతి కారణముకాదనిమాత్రము నిర్ణయించుటకుఁ బ్రయత్నించిరి.

ఈ యవ్యావహారిక విచారణముల వలన బుద్ధునికాలములోఁ బ్రాగ్దేశములందు సైతము సంఘము వివిధవర్ణములుగ విభజింపఁబడియుండెడిదనిమాత్రము స్పష్టమగుచున్నది. బౌద్ధమతము దేశమునఁ బ్రబలియుండిన కాలమున వర్ణవిభాగములు నశించియుండెనని చెప్పుటకు వలనుపడదని ఫిక్ దొరగారు దృఢముగఁ జెప్పుచు నిటుల వ్రాయుచున్నారు.

"దేశములో బౌద్ధమతము వ్యాపించినతఱువాతను దత్పూర్వమునవలె వర్ణములు సుస్థిరములై యుండి బుద్ధుఁడవతార మెత్తిన పిదప సైతము సంఘనిర్మాణ మేమియు మార్పుఁజెందక యేయుండెను. అతి పురాతనపాళీ వైదికగ్రంథములలో విభాగాను సంధానంబులను గనుచున్నారము. ఇంతియకాక నవీనములగు జాతక వ్యాఖ్యానములలోసైతము, దేశమున బౌద్ధమతము ప్రబలియుండి మోక్షసంపాదనలో వర్ణము నిష్ప్రయోజనమను బౌద్ధసిద్ధాంతము ప్రజల యంగీకారమును బడసినపిదపను, వర్ణవిభాగముల బలము క్షీణింపక యెప్పటివలెనె యుండెను."*

## ౩

### బ్రాహ్మణవర్ణము.

బౌద్ధసూత్రములంబట్టియు, జాతకకథలయందుఁ గల బ్రాహ్మణాచారఖండనంబుంబట్టియు, యజ్ఞవేదాధ్యయనంబులు సచ్చరిత రహితునిఁ బూతునిఁగ నొనర్పఁజాలవనియు, వర్ణములలో బ్రాహ్మణుల కౌత్కృష్ట్యంబు మిథ్య యనియును, బవిత్రచరితుం డేజాతివాఁడైనను బూజార్హుం డనియును, వర్ణమునకుఁ గర్మమేకాని జన్మకారణంబు కాదనియును, బౌద్ధులు సుదృఢముగఁ జెప్పుచుండెడివారని స్పష్టమగుచున్నది. బ్రాహ్మణ వాఙ్మయంబున బ్రాహ్మణులకు వర్ణములలో నగ్రస్థానం బీయఁబడినటులనే బౌద్ధవాఙ్మయమున క్షత్రియులకు వర్ణములలో నగ్రస్థానం బీయఁబడినది. బ్రాహ్మణధర్మ సూత్రాదులలోఁ గనుపించు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్ర క్రమంబు బౌద్ధవాఙ్మయములో క్షత్రియబ్రాహ్మణ వైశ్యశూద్ర క్రమంబై కాన్పించుచున్నది.

బ్రాహ్మణ ధర్మసూత్రంబులలో ద్విజులకు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములు నాలుగును నాశ్రమములుగఁ జెప్పఁబడినవి. ఈ రీతిగనే బౌద్ధులును జతురాశ్రమంబుల నంగీకరించినటుల లోమహంస జాతకంబువలన స్పష్టమగుచున్నది (94). జాతకకథలలో ననేక స్థలములందు బ్రాహ్మణక్షత్రియ బాలురు బ్రహ్మచర్యాశ్రమస్థులై వేదాధ్యయనంబునందును, శిల్పాదివిద్యాసంపాదనయందును గాలము గడపుచుండెడివారని చెప్పంబడినది. (50 దుమ్మేధజాతకము, 51 మహాశీలవజాతకము, 55 పంచావుధ జాతకము) త్రివేదజ్ఞానసంపన్నులైన విద్వాంసులవద్ద బ్రాహ్మణ

క్షత్రియ యువకులు వేదాధ్యయనంబుఁ జేయుచుండెడివారు. అష్టాదశవిద్యలనుగూడ బాలు రభ్యసించుచుండెడివారు. విద్యాభ్యాసార్థము తక్కశిల, వారణాసి మున్నగు పట్టణములకుం జనుచుండెడివారు. తక్కశిలానగరము గాంధారదేశంబునను వారాణసి కాశీదేశంబునను బూర్వమున విద్యాపీఠములుగఁ బరిగణింపఁ బడుచుండెడివి. ఈ ప్రాచీన విద్యాపీఠములందు విఖ్యాతిచెందిన విద్వచ్ఛేఖరులు ధనికుల పుత్రులనుండి యుపాయనముల స్వీకరించుచు ధనము గైకొనకుండఁగనే బీదలగువారి పుత్రులకు విద్యాదానంబును జేయుచుండెడివారని తెలియవచ్చుచున్నది. విద్య ప్రారంభించినపుడు శిష్యుఁడు ధనవంతుఁడైన నాచార్యుని పాదంబులు గడిగి దక్షిణను సమర్పించు వాడుక యుండెడిది (సుసీమజాతకము).

రాజపుత్రులు, ధనికుల బిడ్డలు, సాధారణముగ వేయి వరహాలను దక్షిణారూపముగ నాచార్యుల కొసంగుచుండెడివారు (సుసీమజాతకము). ఒకప్పుడు ధనములేని బాలురు విద్యాభ్యాసము న్ముగించి దేశ మంతటను యాచించి యాచార్యునకు దక్షిణ నొసంగుచుండెడివారు. బ్రాహ్మణ బ్రహ్మచారి యొక్కరుఁడు తక్కశిలానగరంబున నొక గురువుదగ్గఱ విద్యల నభ్యసించి విద్యాభ్యాసానంతరము దేశపర్యటనంబుఁ గావించి సువర్ణమును సంపాదించి యాచార్యుని యొద్దకుఁ జనుచు గంగానదిని దాఁటుచుండ నా బంగారము నదిలోఁ బడిపోయెను. వారణాసి సమీపమున నా బ్రహ్మచారి నిరాహారియై గంగయొడ్డున యజ్ఞోపవీతము చూపఱ కందఱకు నగపడునటుల ధరించి సువర్ణప్రతిమవలెఁ జలన మేమియు లేక కూర్చుండియుండె. అంతె జానపదులు, పురవాసులు, పురరక్షకులు, రాజవల్లభులు, రాజామాత్యులు, క్రమముగ నాఱురోజు లాతనితో సంభాషింపఁ బ్రయ



త్నించిరి కాని, యాతఁడు వారితో భాషింపక యూరకుండెను. ఏడవనాఁడు నరపాలకుఁ డా బ్రాహ్మణ యువకుని దర్శించి నిరాహారుఁడవై మౌనమును ధరించి ధ్యానమగ్నుఁడవై కూర్చుండి యుండుటకుఁ గతం బేమని యా బ్రహ్మచారిని బ్రశ్నించెను. బ్రాహ్మణయువకుఁ డా నరపాలకునకుఁ దన వృత్తాంత మంతయు నెఱిఁగింప రా జాతనికి దక్షిణకు ద్విగుణంబుగ ధన మొసంగి సత్కరించెను (దూతజాతకము—478).

నిఱుపేదలగు బాలురకు వారణాసిమున్నగు పట్టణంబులలోఁ బౌరు లుచితముగ భోజన సదుపాయములఁ జేయుచుండెడివారు. లోశజాతకంబున వారణాసీపురవాసులు ప్రతిదినంబున భోజన ముచితముగఁ బెట్టి దక్షిణ లేకుండఁగనే కడు బీదలగు విద్యార్థులకుఁ బండితులచే విద్యలఁ జెప్పించుచుండెడివారని చెప్పఁబడినది. ఇట్టి యాచార మిప్పటికిని మన దేశములోఁ గాన్పించుచున్నది. విద్యార్థుల కిట్టి సదుపాయములు ప్రజ లొనర్చుచుండ వందలకొలఁది విద్యార్థులు గురువుల దగ్గఱ విద్యల నభ్యసించుచుండెడివారు. ఏనూరుగురు శిష్యులకు విద్యలఁ గఱపుచుండెడి గురువులు జాతకకథలలోఁ గాన్పించుచున్నారు. పాండిత్యములో జగద్విఖ్యాతిం జెందిన యాచార్యులవారియొద్ద కనల్పసంఖ్యాకులగు విద్యార్థులు జనుటలో వింత యేమియును లేదు.

బ్రహ్మచర్యాశ్రమస్థులు విద్యాభ్యాసము ముగియువఱకును వివాహముఁ జేసికొనఁగూడదని బ్రాహ్మణ ధర్మసూత్రములు చాటుచున్నవి. ఆపస్తంబ ధర్మసూత్రమునఁ బ్రథమప్రశ్న, ద్వితీయ పటల పంచషట్సప్తమఖండంబుల బ్రహ్మచారియొక్క నియమములు పేర్కొనఁబడినవి.

ఏ సంఘములలో బాల్య వివాహములు సామాన్యములైనవో యా సంఘములయందుఁ బైని జెప్పఁబడిన నియమము నిరాకరింపఁ బడునని వేఱుగఁ జెప్ప నవసరములేదు. బాల్య వివాహములను నిరసించి పాశ్చాత్య సంఘములలోని యువకులు విద్యాభ్యాసము సంపూర్ణమైనపిదప వివాహములం గావించుకొనుట సర్వసామాన్యముగఁ గన్పడును. కాని యమెరికాదేశములో నీ యాచారము మార్పుం జెందినదని వినవచ్చుచున్నది. సంయుక్తరాష్ట్రములలో నేకవింశతిసంవత్సరముల ప్రాయముగల యువకుండు విద్యాలయములో విద్యార్థిగ నుండియు విద్యలంగఱపుచున్న యూనవింశతిసంవత్సరముల ప్రాయముగల యువతిని వివాహమాడు నాచారము ప్రాబల్యము జెందుచున్నదని తెలియవచ్చుచున్నది. జాతకకథలలో విద్యార్థులుగ నుండియు వివాహితులైన వారలు గాన్పించుచున్నారు. దురాజన జాతకంబును, ననభిరతిజాతకంబును, నిందులకు నిదర్శనములు. మొదటికథలో నొక బ్రాహ్మణయువకుఁడు పరదేశమునుండి విద్యాభ్యాసార్థము వారాణసికిం జని యచట నొక కన్యను మోహించి వివాహమాడెను. భార్య వ్యభిచారిణియై, తాను పాపకార్యంబు లొనర్చిననాఁడు విధేయతతో భర్తకుపచారములం జేయుచు, బాపంబు లొనర్పనినాఁడు తిరస్కరించుచు, నుండెను. ఇట్టి యవ్యవస్థచిత్తముతో నామె సంచరించుచుండుటచే నా యువకుఁడు ఖిన్నుఁడై యాచార్యునికడకు సమముగఁ జనకయేయుండెను. ఆచార్యుఁ డాతని నందులకుఁ గారణం బడుగ నాతఁడు తన గృహిణియే యిట్టి లోపమునకుఁ గారణమని ప్రత్యుత్తర మిచ్చెను.

శీలవిమంశనజాతకములో (290) నాచార్యుఁడు ఛాత్రబృందములో నుత్తముండైన వానికిఁ దన కన్యక నిచ్చి వివాహముఁ జేయ నిశ్చయించి వారల రావించి "ఓ మిత్రులారా! నా కొక యుక్త



వయస్కురాలగు పుత్రిక యున్నది. నే నామెకు వివాహము చేయ నిశ్చయించుకొనియున్నాఁడను. కాన నామెకు యుక్తములగు వస్త్రాభరణాదులనే సంపాదింపవలెను. మిత్రుల కంటఁ బడకుండ మీ రాభరణాదులఁ దస్కరించి నా దగ్గఱకుం దేవలయును. మీరు తస్కరించుచుండఁగా నొరులు చూడని వస్తువులనే స్వీకరించెదను గాని పరులు చూచినవానిఁ బుచ్చుకొనను" అని చెప్పెను. మిత్రుల కంటఁ బడకుండ నాఁటినుండియు వార లాభరణాదుల దొంగిలించుచు గురువునకు సమర్పించుచుండిరి. ఆచార్యుఁడును నొక్కొక్క శిష్యుఁడు దెచ్చి సమర్పించుచుండిన వస్తువులఁ బ్రత్యేకముగ నుంచుచుండెను. ఆ యాచార్యుని వద్ద విద్యల నభ్యసించుచుండిన బోధిసత్త్వుఁడు మాత్ర మేవస్తువులను దేకుండెను. ఆచార్యుఁడు బోధిసత్త్వునితో నిటులఁ జెప్పెను: "ఓయీ నీ వేమియుఁ దెచ్చి నా కీయకున్నావు"?

బో॥ అగును. గురువర్యా!

ఆచా॥ ఎందులకు?

బో॥ రహస్యమునఁ దీసికొనివచ్చినఁగాని తాము వస్తువులఁ బరిగ్రహింపరు. పాపకార్యాచరణములో రహస్య మేమియును లేదని నా నమ్మకము.

ఆచార్యుండు బోధిసత్త్వుని సద్బుద్ధికై సంతసించి కుమార్తె నాతని కిచ్చి వివాహముం గావించెను.

ఛాత్రునకు విధింపఁబడిన విధులలో గురుశుశ్రూష యొకటి. బ్రహ్మచర్యాశ్రమమును వర్ణించుచు మనువు,

శ్లో॥ అగ్నీంధనం భైక్షచర్యా మధశ్శయ్యాం గురోర్హితమ్।
ఆసమావర్తనాత్కుర్యాత్ కృతోపనయనో ద్విజః॥

అని నుడివె. ఆచార్యులు శిష్యులఁ దమకుఁ బరిచర్యల చేయుటలో నియమించుటయు జాతకకథలలోఁ గన్పించుచున్నది. భూపాల

ధనాధికుల పుత్రులుగూడ గురుశుశ్రూషలు గావించుచుండెడివారేమో తెలియదు.

విద్యాభ్యాసమును ముగించినపిదప బ్రాహ్మణ యువకులు గృహస్థాశ్రమ ప్రవేశంబుఁ గావించి ధనసంపాదనముఁ జేసి నిజకుటుంబములఁ బోషించు చుండెడివారు. కొందరు భవమందైన దుఃఖములం గని సంసారవిముఖులై గృహస్థాశ్రమమునఁ బ్రవేశింపకయే సన్న్యాసులై యడవులకుం జని మోక్షకాములై తపశ్చర్యాదులఁ గావించుటయుఁ గాన్పింపకపోదు. వివాహముం జేసికొని గృహస్థులైన బ్రాహ్మణుల కధ్యాపనయాజన ప్రతిగ్రహంబులు వృత్తులుగ ధర్మశాస్త్రంబులలో నియమింపఁబడినవి. ఈ శాస్త్రవిహితవృత్తులచే బ్రాహ్మణగృహస్థు లందఱును జీవించుచుండెడివారని చెప్పుట సత్యవిరుద్ధమై యుండు. మన్వాది ధర్మశాస్త్రములవలనను, జాతక కథలవలనను బ్రాహ్మణులు వివిధ వ్యాపారములం జేయుచు జీవించుచుండెడివారని స్పష్టమగుచున్నది.

మనుధర్మశాస్త్రము ననుసరించి బ్రాహ్మణు లవలంబించుచుండెడి వివిధ వృత్తులు పూర్వమునఁ జెప్పఁబడినవి. బ్రాహ్మణులు ధనుర్విద్య నభ్యసించి నరపాలురం గొల్చి జీవనోపాధిని సంపాదించుకొనుచుండెడివారు. భీమసేన జాతకములోఁ ద్రివేదపారంగతుఁడై సర్వవిద్యల నుత్తీర్ణుండై ధనుర్విద్యాప్రవీణుండైన యొక బ్రాహ్మణ యువకుఁడు యోధుఁడై కాశీరాజు సేనలో ధనము నార్జించి గౌరవమును బడసినరీతి చెప్పంబడినది. మఱియు నిపుణులగు యోధులకు భూపాలురు బహు వేతనంబుల నొసంగుచుండెడివారు. భీమసేనునకు నర్ధమాసంబునకు వేయి బంగారు నాణెములు వేతనముగ నిర్ణయించి నరపాలుఁ డొకఁడు తన సేనలో యోధునిగ నియమించెను. దశబ్రాహ్మణజాతకంబున నీరీతిగ దశవిధబ్రాహ్మణులు పేర్కొనఁ



బడిరి. వారివారి వృత్తిభేదములవలననే యీ విభాగములు గావింపఁబడినవని తెలియనగును. ధర్మాత్ముఁడగు యుధిష్ఠిరుఁడు ప్రాజ్ఞుండగు విదురునితో నిటులం జెప్పె: "విదురా! ప్రాజ్ఞులును దుష్టభోగ కార్యరహితులును నగు బ్రాహ్మణులను మద్దత్తాన్నభోక్తలుగ నుండుటకై వెదకి కనుంగొనుము. బహు పుణ్యసంపాదనార్థ మత్యధిక దానంబుల నట్టివారల కొసంగెదను"

విదురుఁడు:—రాజర్షభా! త్వత్ప్రదత్తంబగు విశిష్టాన్నమును భుజింపఁదగిన పుణ్యాచరితులును, బండితులును, సత్పురుషులును, గామరాగాది కళంకరహితులును, నగు బ్రాహ్మణులఁ గనుఁగొనుట యతి దుర్లభము. ఓ రాజాధిరాజా! యవధరింపుము. దశవిధ బ్రాహ్మణుల భిన్నగుణముల నిర్ణయించి తద్భేద నిరూపణంబుఁ గావించెదను. ఔషధమూలికా సంచయనంబుఁ గావించుచు, స్నానంబులం జేయుచు, నభిచారమంత్రాదులఁ బఠియించుచు, నౌషధమూలికాపూరితంబులును సుబద్ధంబులును నగు గోణుల వీపుపై మోయుచుఁ గొందఱు బ్రాహ్మణులు సంచరించుచుందురు. ఓ నరపాలకా! యట్టివారు వైద్యులఁ బోలియుండియు బ్రాహ్మణ నామధారులై యున్నారు. ఇట్టి వృత్తులు గల బ్రాహ్మణులను నీ విపుడు తెలిసికొంటివి గాన నట్టి బ్రాహ్మణులకై నేను ప్రయత్నింపవలయునేమో ప్రసాదింపుము.

కౌరవ్యుఁడు:—ఇట్టివారు బ్రాహ్మణనామార్హులుగారు. వారి బ్రాహ్మణత్వము నశించినది. ఓ విదురుఁడా నేఁ బెట్టు భోజనమును భుజించుటకును బహు పుణ్యములకై నే నిచ్చు దానముల గ్రహించుటకును దగిన ప్రాజ్ఞులును, పూతులును, దుష్టరాగ కార్యరహితులును నగు నితర బ్రాహ్మణులను గనుంగొనుము."

విదురుఁడు:—"ఓ మహాప్రభూ! కొందఱు బ్రాహ్మణులు కింకిణీధారణంబుఁ గావించి యగ్రగాములై కింకిణీనినాదంబు సలుపుచుఁ జనుదురు. నైపుణ్యముతో రథమును నడుపుదురు. మఱియు వార్తాహరణంబును జేయుదురు. ఓ రాజపుంగవా! ఇట్టివారలు సేవకులవలె నుండియు బ్రాహ్మణులని చెప్పంబడుచున్నారు. ఇట్టి బ్రాహ్మణులను నీవు దెలిసికొంటివి గాన నట్టివారలకై నే వెదుకవలయునేమో సెలవిమ్ము."

కౌరవ్యుఁడు:—ఇట్టివారలు బ్రాహ్మణ నామార్హులు కారు. కావునఁ బైని జెప్పినట్టి బ్రాహ్మణులను గనుంగొనుము.

విదురుఁడు:—కొందఱు దీర్ఘనఖములను ధరించి మలదూషితదంతయుక్తులై, లోమావృతావయవములం గలిగి పాంశుసమాచ్ఛాదితులై, మాలిన్యయుక్తులై, దరిద్రయాచకులవలెఁ దిరుగుచుఁ గాష్ఠభేదకులై యుండియు బ్రాహ్మణులని చెప్పఁబడుచున్నారు. ఇట్టి బ్రాహ్మణులను దెలిసికొంటివి గాన నిట్టివారలకై వెదుకవలయునేమో సెలవిమ్ము.

కౌరవ్యుఁడు:—ఇట్టివారును బ్రాహ్మణ నామార్హులు కారు కావునఁ బైఁ జెప్పినట్టివారిని గనుంగొనుము.

విదురుఁడు:—ఆమలకంబులు, బిల్వఫలంబులు, జంబూఫలంబులు, పక్వామ్రఫలంబులు, ఇక్షుకరండంబులు, స్వాదుమధువు, కర్షఫలంబులు, దారుఫలంబులు మున్నగు ననేక వస్తువులతో వ్యాపారముం జేయుదురు. ఇట్టివారలు వణిజులవలె నుండియు బ్రాహ్మణులని చెప్పంబడుదురు. ఇట్టి బ్రాహ్మణులను నీవు దెలిసికొంటివి గాన నిట్టివారికై వెదుకవలయునేమో సెలవిమ్ము.

కౌరవ్యుఁడు:—ఇట్టివారుకూడ బ్రాహ్మణనామార్హులు కారు, కాన నింకను వెదకి తెలిసికొనుము.



విదురుఁడు—కొందఱు వాణిజ్యమును జేయుదురు. మఱి కొందఱు కర్షణవృత్తి నవలంబింతురు. ఇంకఁ గొందఱు "అజావికంబులను, వ్రజాజిరంబులఁ బోషణంబుఁ గావింతురు. శుల్కములకై యాడుబిడ్డల నమ్ముకొని వివాహములం జేయుదురు. వైశ్యాంబష్ఠుల వలె వీరలు సంచరించుచుండినను బ్రాహ్మణులని పిలువఁబడుచున్నారు. ఇట్టి బ్రాహ్మణులకై వెదకుమని యాజ్ఞయా?

కౌరవ్యుఁడు:—ఇట్టివారలు బ్రాహ్మణనామార్హులు కారు. గాన నింకను వెదకి గనుంగొనుము.

విదురుఁడు:— కార్తాంతికులై ధనముకొఱకుఁ బశువులకు వృషణచ్ఛేదంబుఁ గావించుచు వానికి వాతలు వేయుచుందురు. అట్టివారలకు గ్రామవాసులు భోజనంబుల నొసంగి తమ గ్రామములలో నివసించుటకుఁ దఱచుగఁ బిలుచుచుందురు. మఱియు గ్రామములలో వీరలకై యనేక దినములు గోవులు, వృషభంబులు, సూకరంబులు వధియింపఁబడును. ఇట్టివారలు నీచాఖేటకులవలె నుందురు కాని వీరలను బ్రాహ్మణులని పిలుచుచుందురు. ఇట్టి బ్రాహ్మణులకై వెదకుమని యనుజ్ఞయా?

కౌరవ్యుఁడు:—ఇట్టివారును దన్నామార్హులు గారు గాన నింకను బరీక్షింపుము.

విదురుఁడు:—కరవాలఫలక కుఠారధారులై చనువ నడుపుటకు సంసిద్ధులై మార్గదర్శకులవలె వణిజుల సమక్షమున నిల్తురు. గోరక్షకులను, సాహసికదస్యులను, బోలియుండు నిట్టివారలను బ్రాహ్మణులని చెప్పుదురు. ఇట్టి బ్రాహ్మణులను వెదకవలెనని యాజ్ఞయా ?

కౌరవ్యుఁడు:—ఇట్టివారును బ్రాహ్మణనామార్హులు కారు గాన నింకను బరిశీలింపుము.

విదురుఁడు:—కొందఱు బ్రాహ్మణు లటవీప్రదేశంబులఁ గుటీరముల నిర్మించియుఁ గూటయంత్రంబులఁ బన్నియు మత్స్య కూర్మ శశమార్జారసరటంబులఁ బట్టుదురు. మహారాజా! వీరు కూడ నాఖేటకులయ్యు బ్రాహ్మణులని చెప్పఁబడుచున్నారు. ఇట్టివారిని వెదకుమని యనుజ్ఞయా?

కౌరవ్యుఁడు:—ఇట్టివారలు బ్రాహ్మణనామార్హులు కారని నా యభిప్రాయము, కావున నింకను బరీక్షింపుము.

విదురుఁడు—ధనకాంక్షచేఁ గొందఱు బ్రాహ్మణులు సౌమిక యజ్ఞంబుచేయు నరపాలకుని పర్యంకంబుక్రింద నారాజు పర్యంకముపై స్నానము చేయుచుండునపుడు పరుండియుండుటకు సంసిద్ధు లగుచున్నారు. ఇట్టివారు నాపితులం బోలియుండియు బ్రాహ్మణులని చెప్పఁబడుచున్నారు. ఇట్టివారలను వెదకుమని తమ యనుజ్ఞయా?

కౌరవ్యుఁడు:—ఇట్టివారు బ్రాహ్మణ నామార్హులు కారు, కావున నింకను వెదకి యట్టివారినిఁ గనుంగొనుము.

విదురుఁడు:—ఉదకుంభమును, వక్ర దండమును ధరించి కొందఱు పల్లె పల్లెకును నగరమునుండి నగరమునకును, "వనమునఁ గాని నగరమునఁగాని ప్రాభృతంబుఁ గల్పించువఱకును నివర్తింపము" అని నుడువుచు రాజదర్శనార్థమై యతి రయమునఁ జనుచుందురు. కరగ్రాహకులవలె నిర్బంధశీలురై యుండియు వీరలు బ్రాహ్మణులని పిలువఁబడుచున్నారు. ఇట్టి బ్రాహ్మణులను దెలిసికొంటివిగాన నిట్టి వారలకై నే వెదకవలయునా సెలవిమ్ము.

బ్రాహ్మణులు వివిధవృత్తులచే జీవనోపాధిని సంపాదించుకొనుచుండెడివా రనుట నిశ్చయము. బ్రాహ్మణులు రాజస్థాపిత భిక్షాగేహంబుల సత్కారములం బొందుచుండెడివారు. (మహా ఉమ్మగ్గజాతకము)



బ్రాహ్మణులు బౌద్ధ భిక్షువులు మున్నగువారలకు భిక్షాదానంబుల నొసంగుటకు భిక్షాగేహంబులను ధర్మచింతగల భూపాలురును, ధనికులును నిర్మించుచుండెడివారు. మహారాజులు తమ ముఖ్య పట్టణంబులలో నగరద్వారంబులయొద్దను నగర మధ్యంబునను నిజ ప్రాసాదసమీపమునను నట్టి భిక్షాగేహంబుల నిర్మించుచుండెడివారు (వెస్సంతరజాతకము), ఇట్టి భిక్షాగృహములలో సువర్ణముల నొసంగు వాడుకయు నుండెడిదని మన మూహింపవచ్చును (చూ॥ వెస్సంతరజాతకము).

బ్రాహ్మణులును బౌద్ధభిక్షులవలె దానార్హులుగఁ బ్రజలచేఁ బాటింపఁబడి ప్రజల సత్కారములం బొందుచుండెడివారు. మఱియు బౌద్ధభిక్షువులకు ధనసంపాదన నిషిద్ధం బగుటచే బ్రాహ్మణులు రాజుల నాశ్రయించి ధనము నార్జించుచుండెడివారు. రాజులు పర రాజులనుండి యుద్ధంబు చేయకయే విశిష్టవస్తువులం గ్రహింపబూనిన నట్టి నరపాలురదగ్గఱకుఁ దత్కామిత వస్తుసంపాదనార్థము బ్రాహ్మణులం బంపుచుండెడివారని తెలియనగును (కురుధమ్మజాతకము). వస్సంతరజాతకంబున బీద బ్రాహ్మణ స్త్రీ యొకతె గ్రామస్థులచేఁ బరిహాసింపఁబడి భర్తను వెస్సంతకుమారునికడకు దాసీజనము నొసంగుమని ప్రార్థించుటకై పంపినటులఁ జెప్పఁబడినది. బ్రాహ్మణులకు విందులు చేసియు నత్యంత స్వాదుభోజనములం బెట్టియు నృపులును సామాన్యజనులును గూడ గౌరవించుచుండెడివారు (సద్ధినిపాత జాతకము). ధర్మశాలలయందు సామాన్యులగు పాంథులు బస చేయుటకును, దిక్కులేనివా రుండుటకును, దిక్కులేని స్త్రీలు పురుడుపోసికొనుటకును, బరదేశీయులగు వణిజులు తమవస్తువులను భద్రముగా నుంచుకొనుటకును బౌద్ధభిక్షువులును బ్రాహ్మణులును బసచేయుటకును వేఱువేఱు కోష్ఠములు • ఏర్పాటు చేయబడి

యుండెనని 'మహాఉమ్మగ్గ' జాతకంబులవలనఁ దెలియవచ్చుచున్నది. అధ్యాపనయాజన ప్రతిగ్రహంబులను వృత్తులచేఁ గొందఱు బ్రాహ్మణులు జీవించుచుండినను, బ్రాహ్మణులకు నిషిద్ధంబులును హీనజాతివారలకు నియమింపఁబడినవియు నగు వృత్తులచే ననల్పసంఖ్యాకులగు బ్రాహ్మణులు జీవించుచుండెడివారని. మనము నిశ్చయింపవచ్చును.

గ్రామములలోఁ గొన్ని జాతులవారలలోఁ గులసంఘమును గులవృద్ధునుగూడఁ గనుచున్నారము. చాఁకలులు, మంగలులు, గొల్లలు మున్నగువాండ్రలో నెవ్వఁడైనను జాత్యాచారములకు విరుద్ధముగ నడచినచో నట్టివారి నా యూరనుండు సమవర్ణస్థుల సంఘము శిక్షించుచుండును. ఇట్టి కులసంఘముల యధికారము క్రమక్రమముగ క్షీణించుచున్నది.

ఉత్తమవర్ణములలో నిట్టి కులసంఘము లుండెడివా యనునది మనము నిశ్చయింపవలెను. ఇప్పు డట్టి సంఘము లెవ్వియుఁ గాన్పింపవు. పూర్వకాలముననైన నిట్టి సంఘము లుండినటులఁ దెలియరాకున్నది. వేదకాలమందైన సమితియును, సమాజమును, కులసంఘములు కావని స్పష్టము. జాతకాది పాళీపుస్తకములలోనుగూడఁ బూర్వమునఁ గులసంఘము లుండినటుల మనము నిశ్చయింపనేరము. కాని బ్రాహ్మణులలో శిష్టాచారవిరుద్ధముగఁ బ్రవర్తించినవాఁడు జాతిబహిష్కృతుఁడై యుండెడివాఁడు. ఇప్పు డట్టి బహిష్కారము లరుదైనవి.

భోజన స్పృశ్యతాది విషయములలో నెంతవఱ కాచారములు సిద్ధాంతముల ననుసరించుచుండెడివో విచారింతము. బ్రాహ్మణుఁడు హీనజాతివానియొద్ద భోజనము చేయఁగూడదని మనువు నిషేధించియున్నాఁడు. (మను॥ అ. 11. శ్లో 159. వసిష్ఠ. అ. 14. శ్లో.)



ఆప॥ I 16, 22: గౌత. XVII, 17: విష్ణు. 21. 7: శూద్రోచ్ఛిష్టం బతినీచంబు. మను. XI. 153 విశి. XIV. 33 విష్ణు. 21,50,54, శర హీనజాతివానియొద్ద భోజనము చేసినను శూద్రోచ్ఛిష్టంబు భుజించినను బ్రాహ్మణుఁడు పతితుఁడగును. ఉచిత ప్రాయశ్చిత్తంబు జేసికొనినఁగాని యట్టి బ్రాహ్మణునితో నాతని వర్ణమువారు సంపర్కము లేకయే యుందురు. అనఁగ నట్టివాఁడు వర్ణబహిష్కృతుఁడై యుండు.

పూర్వమునను భోజనవిషయమై యిట్టి నియమము లుండెడివని మన మూహింపవచ్చును. భద్దసాలజాతకమునందైన పచ్చుప్పన్నవత్తును మన మిందుల కుదాహరణముగఁ జెప్పవచ్చును. కోసలరాజు శాకీయుల కన్యను దనకు భార్యగ నొసంగఁ గోరుచుఁ గపిలవత్తుపురంబునకు రాయబారుల నంపెను. శాకీయులు కులాభిమానము గలవారగుటచే వారు తమ కన్య నిచ్చుటకుమాఱుగ జన్మకళంకము గల బాలికను దమ ప్రభువునకు భార్యగ నొసంగుదు రేమో యని శంకించుచు నా రాయబారు లట్టి శాకీయులతో భోజనము చేయవలెనని చెప్పిరి. మహానామునకు దాసియం దుద్భవించిన వాసభఖత్తియయను గన్యను గోసలరాజునకు భార్యగ నొసంగుటకు శాకీయులు నిశ్చయించుకొనియుండి కోసలరాజుయొక్క రాయబారులవచనములను విని చేయునదేమియులేక భీతిల్లుచుండిరి. అంత మహానాముఁడు వారలకు ధైర్యముఁజెప్పి తాను భుజించుచున్నపు డలంకారశోభితయైన వాసభఖత్తియను దనయొద్దకుఁ దీసికొని రావలసినదనియుఁ దానొక కబళమును దినినపిదప "ఓ రాజా! ఆ దేశపురాజు (దేశనామమును జెప్పుచు) ఈ యుత్తరమును బంపినాఁడు. మొదట వాని సందేశమును వినుండు" అని చెప్పవలెననియు నొకయుపాయముం జెప్పె. శాక్యులీయుపాయమున కానందముఁ జెందిరి. మహానా

ముఁడు భోజనముం జేయ సిద్ధముగానుండి తనతోఁగూడ భోజనము చేయుటకై నిజపుత్రికను దీసికొని రమ్మని సేవకుల నాజ్ఞాపించెను. ఆమె నలంకరించు మిషతోఁ గొంచెము కాలయాపనముం జేసి యామె నచటికిం దీసికొని వచ్చిరి. ఆతఁడు హస్తమును బాత్రయందుంచి యొక కబళమునుదీసి నోటియందుంచుకొనెను. రెండవసారి యాతఁడింకొక కబళమును దీసికొనుటకు సిద్ధముగ నుండఁగ నేర్పాటు ప్రకారమే యాతనికొక యుత్తరముం దెచ్చియిచ్చిరి. వామహస్తముతో దాని నందుకొని జదువుచుండినటుల నటించుచు బాలికను భుజింపుమని ప్రోత్సహించుచు మఱియొక మెదుకునైన నోటిలోఁ బెట్టుకొనకయుండి యాబాలిక భక్ష్యమును భుజింపఁగనే దానును ముఖహస్తప్రక్షాళనంబుఁ గావించుకొనెను. రాయబారులును నాకన్య మహానాముని యౌరసబాలికయేయని నిశ్చయించుకొనిరి. బ్రాహ్మణుఁడు చండాలోచ్ఛిష్టంబు భుజియించిన వర్ణమునుండి బహిష్కృతుండై యుండెడివాఁడు. చండాలోచ్ఛిష్ట సంపర్కముగల యన్నమును బ్రమాదంబున భుజించుటచేఁ బదునాఱువేలమంది బ్రాహ్మణులు జాతిబహిష్కృతులై స్వదేశమును విడిచిపెట్టిరని చెప్పంబడినది. చండాలోచ్ఛిష్ట భోజనమువలనఁ గలుగు పాతిత్యమును బ్రాయశ్చిత్తముచేఁ బోఁగొట్టుకొనుటకు వీలుండఁగ నింతమంది బ్రాహ్మణులు దేశమును విడిచిపెట్టి చనునంత యవసరముండునాయని మనము శంకింపుచుఁ బైకథను నమ్మకపోయినను నాకాలమునాఁటికి భోజన విషయములో నిట్టి నియమము లుండెడివని మనమూహింపవచ్చును. ఈవిషయమే శతధమ్మ జాతకంబునఁ గనుపట్టుచున్నది.

బోధిసత్త్వుఁడు చండాలుండై జనించి యొకనాఁడాహారముంపఁబడిన మంజూషతోఁ బ్రయాణము చేయుచుండెను. ఆమార్గంబుననే యుత్తరదేశంబున వసించుచుండెడి ధనసంపన్నులగు బ్రాహ్మణుల



కుటుంబమును జెందిన యువకుండొకఁడు చనుచుండెను. ఏకారణము వలననో యాతఁడాహారముం దనతోఁ దీసికొనకయే చనుచుండెను. వారలొండొరుల వర్ణములం దెలిసికొని యామార్గముననే కలిసి చనుచుండిరి. భోజనసమయంబున బోధిసత్త్వుఁడొక నూయిప్రక్కను గూర్చుండియుండి హస్తంబులం గడుగుకొని బుట్టనుదెఱచి బ్రాహ్మణుని భోజనమునకై పిలిచెను. శతధమ్మండను నాబ్రాహ్మణుండు "ఛీ, ఛీ. చండాలుఁడా నాకేమియు నవసరములేదు" అని చెప్పెను. సరియే యనుచు నాచండాలయువకుఁడాబుట్టనుండి తనకవసరమైనంతవఱకు భక్ష్యములందీసి పత్రమున నిడికొని బుట్టను దిరిగి భద్రముగఁ గట్టి వానిని భుజించి యుదకముం ద్రావి పాదహస్తప్రక్షాళనంబుఁ గావించుకొని "ఆర్యా రండు" అనుచు మార్గము ననుసరించి చనుచుండెను.

దినమంతయు వారు నడిచినడిచి సాయంసమయమున రమ్యంబగు తటాకమున జలకమాడిరి. బోధిసత్త్వుఁ డుదయమునందువలె బుట్టనుండి యాహారమునుదీసి భుజించుచు బ్రాహ్మణుని భోజనమునకై పిలువఁడాయెను. భూసురుం డచటనే క్షుద్బాధాపీడితుఁడై నిలువంబడి "నాకతఁడు భక్ష్యముల నిచ్చిన నేఁ దినెదను" అని యనుకొనుచుఁ జండాలుండు దినుచుండఁ జూచుచుండెను. చండాలుండు మాటాడకయే భుజించెను. "ఆహా! ఈయధమకులోద్భవుండు మాటలాడకుండ నున్నదంతయుఁ దిని వేయుచున్నాఁడు. సరియే నేనాతని నొకకబళంబు వేఁడెదను. అందపవిత్రంబగు బహిర్భాగంబు విడిచి యంతర్భాగంబును దినెను. తద్భోజనానంతరమున "నాకులంబునకును గోత్రంబునకును జాతికిని నగౌరవంబుఁ దెచ్చితిని. ఏమీ! నేను జండాలోచ్ఛిష్టంబు భుజించితి?" అని కడుదుఃఖితుఁడై వమనమునుం జేసికొన నందు రుధిరముకూడఁ బడెను. చేసిన నీచకార్యమునకుఁ జింతించుచు నడవులంజొచ్చి యేకాకియై మృతింజెందె. ఈకథనుబట్టి చూచిన నవవి

త్రంబగు నాహారమును భుజించిన నట్టి భోజనముచే బొటిల్లు పాపములు కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తంబులవలననే పోఁగొట్టుకొనఁబడుచుండెడివని మన మూహింపవచ్చును.

అస్పృశ్యతాది సంబంధములగు నియమము లెట్టివి యుండెడివో నిర్ణయింపఁ బ్రయత్నింతము. మనుధర్మ శాస్త్రంబువలన (మను. III 239) శ్లో॥ చండాలశ్చ వరాహశ్చ కుక్కుట శ్శ్వతథైవ చ। రజస్వలాచషండశ్చనే క్షేరన్నశ్నతో ద్విజాన్॥ నస్పృశ్యతాదిదోష సహితులగు చండాలుర దృష్టి భోజనముపైఁ బ్రసరించిన నట్టి భక్ష్యముల బ్రాహ్మణుఁడు భుజింపఁగూడదని స్పష్టముగఁ దెలియుచున్నది. చండాలు రస్పృశ్యులు.

శతధన్ముండు మార్గమునఁబోవుచు నొకయువకునింగని వాని జాతి యెద్దియని ప్రశ్నించెను. ఆతఁడు తనజాతి చండాలజాతియని చెప్పి పృచ్ఛకుని వర్ణముంగూర్చి ప్రశ్నింప శతధన్ముఁడు సాటోపంబుతో నేను దీచ్యబ్రాహ్మణుఁడనని ప్రత్యుత్తరమిచ్చెను. ఎటుల సాభిమానియగు బ్రాహ్మణుఁడును జండాలుఁడును నామార్గముననే గలిసి చనఁగలిగిరో వింతగనున్నది.

బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించుచుండినపుడు బోధిసత్త్వుఁడు జగద్విఖ్యాతుం డగు నాచార్యుఁడై పంచశతశిష్యులకు విద్యలఁ గఱపుచుండె. ఆఛాత్రులలోఁ బ్రముఖుండగు నేతకేతు వనువాఁ డుత్తరదేశీయ బ్రాహ్మణకుటుంబమునం బుట్టె తన వర్ణముచే గర్విష్ఠుఁడైయుండెను. సహాధ్యాయులతోఁ గూడ నొకనాఁ డాతఁడు పురబాహ్యప్రదేశమునం దిరిగి యింటికి వచ్చుచు నొక చండాలునిం గని వాని వర్ణమునుఁ గూర్చి ప్రశ్నించెను. "చండాలుఁడను నేను" అని యాతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఆచండాలుని దేహమును సోకిన వాయువు తనదేహమును దాఁకినఁ దానును నపవిత్రుఁడగుదునను భయ



ముచే "ఓరీ దుష్కృత కారకుండవగు చండాలుఁడా! గాలి వీవని వైపునకుం జనుము" అని యాజ్ఞాపించుచు జండాలునిపై వచ్చు గాలి తన్ను సోకకుండఁగ వాతాభిముఖంబుగఁ జనఁబోయెను; గాని చండాలుండు బ్రాహ్మణుని కంటె ముందుగఁ బరుగులిడి వాతాభిముఖంబుగ నుండె.

బ్రాహ్మణుం డొకఁడు తురీయాశ్రమస్థుండై యొక నది యొద్దున నాశ్రమంబు నిర్మించుకొని వసించుచు నొకనాఁడు ముఖప్రక్షాళనార్థము నద్యుదకంబులఁ బ్రవేశించెను. ఆనదీతటంబుననే బ్రాహ్మణాశ్రమప్రదేశంబున కుపరిభాగంబునఁ జండాలుఁ డొకఁడు నివసించుచుండెను. వాని దంతోల్లేఖని (పల్లుకట్టు పుల్ల) నదీ జలములలోఁ గొట్టికొనిపోవుచు బ్రాహ్మణుని జటలలోఁ జిక్కుకొనెను. అది గని బ్రాహ్మణుండు కోపోద్దీపితుండై నదియొద్దుననేయున్న చండాల వాసమునకుం జని చండాలునిఁ గని "నీకులం బెద్ది" యని ప్రశ్నించెను. వాఁడు 'చండాలుఁడను' అని ప్రత్యుత్తరమిడెను.

బ్రా—నీవు దంతశోధనికను బ్రవాహములోఁ బడవేసితివా?

చం—అగును: నేనే యాశోధనికను బ్రవాహమునందుఁ బడవైచితిని.

బ్రా—చండాలా! నరాధమా! అపశకునపతంగమా! నీవు నదీ తటోపరిభాగంబున వాసంబు మాని క్రిందకుఁ జని యచట నివసింపుము."

ఈకథలవలనఁ జండాలస్పర్శవలన నపవిత్రత సంభవించునని బ్రాహ్మణులచేఁ బరిగణింపఁబడుచుండునట్లు స్పష్టము. జాత్యభిమానము గల బ్రాహ్మణు లిటులఁ జండాలస్పర్శనతిదూష్యమైన దానిగఁ బరిగణించుచుండినటుల నిశ్చయమగుచున్నను గొన్ని కథలలో నుత్తమ క్షత్రియకులోద్భవులు చండాలురతో సంపర్కమును

దూష్యముగ భావించినటులఁ గనుపింపదు. గర్భవతియగు భార్య యామ్రఫలంబును దినఁగోరుటచేఁ జండాలుండొకఁడు రాజోపవనంబున నుండిన యామ్రతరువు నెక్కెను. ఆతఁడాచెట్టుపై నుండఁగనే యుదయమాయెను. అప్పుడు తాను దిగిన నెవఁడైనను జూచినఁ దనకు హాని వాటిల్లునని భయముచే రాత్రికై యచ్చటనే వేచియుండెను. ఇంతలో నరపాలుఁడు పురోహితునితోఁ గూడ వేదాధ్యయనంబునకై వనంబునకుం జని యామామిడిచెట్టు క్రిందనే యున్నతాసనంబునఁ గూర్చుండి పురోహితుని నీచాసనంబునఁ గూర్చుండఁబెట్టి వేదాధ్యయనంబుఁ గావించుచుండెను. అంత నాచండాలుం డది కని క్రిందికి దిగివచ్చి గురుశిష్యు లిరువురును గూర్చుండియుండుటలో నుండిన యపచారమును గూర్చి ముచ్చటించెను. రాజాతని వచనములకు సంతసించి వాని కులముం గూర్చి ప్రశ్నించెను.

చం—నేను జండాలుఁడను.

రాజు—అయ్యో! యేమి విచారకరమైన సంగతి. నీవు జాతిసంపన్నుఁడవై యుంటివేని నీకు నారాజ్యమును సమర్పించియే యుందును. అయినను నేను బగటి సమయమున మాత్రము సార్వభౌముఁడనై యుందును. నీవు రాత్రి రాజవై యుండుము” అనుచు నారాజాతనికిఁ దన కంఠము నలంకరించుచుండిన హారమును బారితోషకముగ నొసంగి వేగులవానిఁగ నియమించెను. ఈకథవలన రా జస్పృశ్యతాదిదోషములను బరిగణింపని వాఁడేమో యని యాలోచింపవలసియున్నది. ఆకాలమున నెంతవఱకు హీనజాతివాండ్రను స్పృశించుట మున్నగు విషయములందు నియమములు పాటింపఁబడుచుండెడివో నిశ్చయించుట కష్టము. కాని బ్రాహ్మణ వర్ణస్థులే గాక యొక సెట్టియొక్క కొమార్తెయుఁ బురోహితుని కొమార్తెయుఁ బురద్వారంబు కడకు విహారార్థము చని చండాల



సోదరుల నిరువురం గని పరిమళోదకములతో నాదుర్దర్శనమువలన గలుగు హానిఁ బోఁగొట్టుకొనుటకై కన్నులను గడుగుకొని దిరిగి యిండ్లకుఁ బోయిరని యున్నది (IV 391). ఇటులనె (IV 378) కథలో సైతమున్నది. చండాలుఁ డొకఁడు వారాణసీ పురద్వారంబు సామీప్యమున •సెట్టికొమార్తెను గని యామె యపూర్వలావణ్యమును ఱెప్ప వేయక తేఱిపాఱి చూచుచుండెను.

కన్య—వాఁ డెవఁడు ?

పరిచారకులు—చండాలుఁడు.

“నేఁ జూడఁ గూడని దుర్దర్శమును గంటి” అని యనుచుఁ దన ముఖమును సగంధజలములతోఁ గడుగుకొనెను.

వర్ణసంబంధములైన వివాహ నియమములను మనము పరిశీలింపవలసియున్నది. ఇప్పుడు మనదేశములో నొకవర్ణమువా రింకొక వర్ణమువారితో వివాహసంబంధములను జేసికొనకపోవుటయే గాక యొక్క వర్ణములోనే భిన్నశాఖలవారలు వివాహసంబంధములను జేసికొనకుండుటయుఁ గనఁబడుచున్నది. ఇటుల భిన్నశాఖలవారలతో వివాహము లెక్కడనో గాని జరుగవని మనము చెప్పవచ్చును. మనుధర్మశాస్త్రమునందు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రకులములను జెందిన నలుగురు కన్యలను వివాహ మాడవచ్చునని చెప్పంబడినది. అటులనే క్షత్రియునకు క్షత్రియ వైశ్య శూద్ర కులోద్భవలగు ముప్వురు కన్యలు భార్యలుగ నుండవచ్చుననియు, వైశ్యుఁడు వైశ్య శూద్ర జాతి కన్యలను వివాహ మాడవచ్చుననియు, శూద్రుఁడు శూద్ర కన్యను దప్ప నితరుల కన్యలను వివాహ మాడరాదనియుఁ జెప్పఁబడినది. అటుల బ్రాహ్మణునకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రకులములలోని కన్యలను వివాహ మాడు నధికార మొసఁగఁబడెను. సవర్ణభార్య తప్ప తదితర జాతి భార్యలు

ధర్మకార్యాదులలో భర్తతో సహచారిణులై యుండరాదని నియమింపఁబడెను.

ఇందువలన మనుధర్మశాస్త్ర కాలము నాఁటికి వివాహ విషయములలో నొక వర్ణమువారు తమవర్ణమువారితోడనే సంబంధముఁ జేసికొనవలెనను నిష్కర్షము దేశమునలేదని మనము చెప్పవచ్చును. పురాణములలో బ్రాహ్మణులు క్షత్రియాది కన్యలను వివాహమాడి బ్రాహ్మణ సంతానోత్పత్తి కారణులైనటుల ననేక గాథలు గాన్పించుచున్నవి. ఇట్టి వర్ణాంతర వివాహము లెప్పటివఱకు సామాన్యముగ జరుగుచుండెడివో చెప్పుట కష్టము. వసిష్ఠుని భార్యయైన యక్షమాల హీనజాతి కన్యయని చెప్పుచు మనువీరీతిగ నుడివెను. (IX 23, 24)

శ్లో॥ అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాధమయోనిజా।
సారంగ మందపాలేన జగామాభ్యర్హణీయతా॥
ఏతాశ్చాన్యాశ్చ లోకే స్మిన్నతికృష్ట ప్రసూతయః।
ఉత్కర్షం యోషితః ప్రాప్తాస్స్వైస్స్వైర్భర్తృగుణైశ్శుభైః॥

అయినను జాతక కథలు కొన్నింటిలోఁ జెప్పఁబడిన విషయములం బట్టి యానాటికి సవర్ణ వివాహములే జనసమ్మతములై ప్రాబల్యమును జెందియున్నవని మన మూహింపవచ్చును. ఆర్యవంశస్థులు నీచజాతివారల నపవిత్రులుగఁ బరిగణించుచు నట్టివారలతోడి సంబంధములు జాతిహైన్యకారణములని నిరాకరించుచుండెడివారు. ఆర్యవర్గములో వివాహసంబంధములైన యాచారములను, నాదిమవాసులతో సంకర మేమియు లేకుండఁ జేయుటకై ధర్మవిధులుగ నియమించిరని మనము చెప్పవచ్చును. ఇట్టి నియమము లార్యజాతులవారల కాదిమవాసులతో సాంకర్యము లేకుండ రక్షించుటకై గావింపఁబడినవి. మాతంగజాతకంబునఁ జండాలుఁ డొక్కరుఁడు సెట్టి



పుత్రికను భార్యగనొనర్పఁగలిగినందుల కాచండాలుఁడు బోధిసత్త్వుఁడై యుండుటయే కారణంబని చెప్పఁబడినది. "ఏలయన బోధిసత్త్వుల మనోనిశ్చయము ఫలించును." ఈ కథలోనే యాచండాలుం డుత్తమజాతికన్యకను వివాహమాడినను నామెతో సంగమములేకయే యుండెనని వర్ణింపఁబడినది. భద్దసాల జాతకసంబంధమైన పచ్చుప్పన్నవత్తులో "వాసభఖత్తియ" యనునామె దాసీపుత్రియని తెలిసికొనియు శాక్యులు తనకుఁ గావించిన యవమానముంగూర్చి యొకరాజు బుద్ధదేవునితోఁ జెప్పుచు "ప్రభూ! శాక్యులు స్వవంశోద్భవురాలగు కన్యయని మహానామ దాసీపుత్రికను భార్యగనొసంగి నన్ను వంచించిరి. అందుచే నామెకును, నామె పుత్రునకును బట్టమహిషికిని యువరాజునకును దగినటుల ధనంబుల నొసంగక బానిసలకుఁ దగినటుల ధనము నిచ్చుచున్నాఁడను" అని పల్కెను.

బుద్ధుఁడు—"ఓ మహారాజా! శాక్యు లయుక్తంబుగఁ బ్రవర్తించిరి. వారలు కన్యాప్రదానంబుఁ గావించిన స్వవంశజురాలగు కన్యకనే యొసంగవలసినది. అయినను నేనిది చెప్పవలసియున్నది. వాసభఖత్తి, నరపాల పుత్రియై మహారాజు పట్టమహిషిగఁ దత్ప్రసాదంబున నభిషిక్తయైనది. విదుందభుఁడు మహారాజునకుఁ బుత్రుఁడు. పూర్వపుఁ బండితులు జననీ జన్మపరిగణన మనవసరమనియు, జనకుని వంశమే ముఖ్యమనియుఁ జెప్పుచుఁ గట్టెపుల్లలనేరు కడుబీదయగు స్త్రీ నొకరాజునకుఁ బట్టమహిషిగఁ గావించిరి. ఆమెపుత్రుఁడు "కాష్టవాహరాజు" అనునామముతో వారాణసీ పరిపాలకుఁడాయెను. కాన నీవును నట్లుచేయుము" అని యనెను.

ఆకాలమున జననీకులసంబంధము లెక్కింపక జనకునివర్ణముం బట్టియే పుత్రవర్ణపరిగణనము కావింపఁబడుచుండెడిదో లేక మహారాజు మొదటఁ గావించినటుల హీనజాతిస్త్రీయం దుద్భవించినవాఁడు,

జనకుఁ డుత్తమకులజుండైనను హీనకులమువాఁడుగఁ బరిగణింపఁబడు చుండెడివాఁడో నిర్ణయించుట సులభముకాదు. మనుధర్మశాస్త్రం బునఁ బదియవ యధ్యాయంబున నుత్తమకులసంభూతుఁ డగువాఁడు తనవర్ణము తరువాతివర్ణమును జెందినకన్యను వివాహమాడిన నట్టి దంపతుల కుద్భవించు పుత్రులు పితృవర్ణమును జెందుదురు కాని మాతృ జన్మకళంకచిహ్నితు లగుదురని యున్నది. ఇంతియకాక మనుధర్మ శాస్త్రంబున మూఁడవ యధ్యాయంబున

శ్లో॥ "నబ్రాహ్మణ క్షత్రియయోః । ఆపద్య విహితిష్ఠతోః ।
కస్మింశ్చిదపివృత్తాంతే । శూద్రాభార్యోపదృశ్యతే॥ 14॥

శ్లో॥ వృషలీఫేన పీతస్యనిశ్వాసోపహతస్యచ ।
తస్యాంచైవ ప్రసూతస్యనిష్కృతిర్న విధీయతే॥ 15॥

"ద్విజు లవివేకముతో హీనజాతి స్త్రీని వివాహమాడి తమ కుటుంబమును సంతానమునుగూడ శూద్రత్వము నతిత్వరలోఁ బొందింతురు." అని చెప్పఁబడినది. మఱియుఁ గొన్ని జాతకకథలలోఁ గొన్నిచోటుల సవర్ణవివాహమునే చేయుచుండు నాచారము ప్రబలి యుండెనని స్పష్టముగనున్నది. ఇందులకు విరుద్ధములగు విషయ ములు కత్థహారి జాతకంబునను, గుమ్మసపిండజాతకమందైన వచ్చు ప్పన్నవత్తునందును గాన్పించుచున్నవి. అటులైనను ప్రసంగరీతిని విచారించిచూచిన నాకాలమునాటి కతిసాధారణముగ జనులు తమ తమవర్గములం దాఁటి యన్యవర్గములవారితో వివాహములం జేయు కుండెడివారనియు సమానవర్ణముల వారలతోడనే వివాహములం జేయుట ప్రబలంబైన యాచారమై యుండెడిదనియు మనము చెప్ప వచ్చును. ఈ యాచారమప్పుడప్పుడు నరపాలురు పాటించినటులఁ గాన్పింపకపోయినను జనులు మాత్రము సర్వసాధారణముగ ననుస రించి చనుచుండెడివారనుట స్పష్టము.



## ౪

### బ్రాహ్మణులు, క్షత్రియులు.

ఋగ్వేదకాలములో నార్యసంఘముల వర్ణములు విభజింపఁ బడినవా? యను విషయమున విద్వాంసులు భిన్నాభిప్రాయులై యున్నారు. బ్రాహ్మణ సిద్ధాంతానుసారముగ సంఘము వర్ణములుగ విభజింపఁబడలేదనియే యనేక విఖ్యాత విద్వాంసుల నిశ్చయము. ఋగ్వేదమునఁ బురుషసూక్తముతప్ప వేఱెందును చాతుర్వర్ణ్యముం గూర్చి ప్రశంసలేదని కనఁబఱుచుచుఁ బురుషసూక్తము మాత్రము తదితర ఋగ్వేదభాగములకంటె నతినవీనమని విద్వాంసులు చెప్పు చున్నారు. అయినను ఋగ్వేదకాలమునాఁటికే యార్యులలోఁ జతు ర్వర్గంబులు సుజాతంబులై యుండెడివని మన మూహించుటకుఁ దగిన ప్రమాణములు గాన్పించుచున్నవి. ఐరేనియనుల సంఘము పురుష సూక్తస్థవిభాగముల ననుసరించు చతుర్వర్గములుగ విభజింపఁబడి నటుల స్పష్టము. వారలలో నాథ్రవులు (పురోధసులు) రథస్థులు (యోధులు) వాస్త్రియస్ఫ్షోయంటులు (గృహపతులు) హుయితులు (కృషిసేవాదులం జేయువారు) బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లతోఁ గ్రమముగ సరిపోవుచున్నారు. విద్వాంసు లూహించుచున్న టులఁ బురాతనపుఐరేనియనులును, బురాతనపుటార్యులును నొకప్పుడు కలిసియుండినచో ఋగ్వేదమునాటికే యార్యులు చతుర్వర్గవిభాగము లెస్సగ గుర్తెఱింగియుండిరని మన మూహింపవచ్చును.

ఋగ్వేదకాలములో నార్యుల సంఘము చతుర్వర్గములుగ విభజింపఁబడియుండెడిదని మన మూహించినను నావర్గములు వర్ణ ములు విశేషలింగములు గలిగియుండెడివని ఘనము చెప్పఁజాలము.

సామాన్యముగ వర్గములు వృత్తుల ననుసరించియుండినను నొకవర్గమును జెందిన నరుని పుత్రుఁడు జనకుని వృత్తిని నిరాకరించి భిన్నవృత్తి నవలంబించినను నట్టివాఁడు జనకునివర్గమును జెందినటులఁ బరిగణింపఁ బడియుండు నాచారము ప్రబలియుండినటులఁ గాన్పింపదు. ఒక్కొక్క వర్గ మొక్కొక్కవృత్తి నవలంబింపవలయునను విధి యాకాలమున లేదనియును భిన్నభిన్నవృత్తుల నవలంబించువారు సునిర్మితములగు భిన్నభిన్నవర్గములం జెందునటులఁ బరిగణింపఁబడువాడుక యాపురాతనకాలపు టార్యులకుఁ దెలియదనియును విద్వాంసులు చెప్పుచున్నారు. క్రమముగా వర్గనిర్మాణము దృఢంబై వర్ణనిర్మాణమునకు దారి చూపినదని కొందఱ నిశ్చయము.

కౌషీతకి బ్రాహ్మణములో బ్రాహ్మణులు దేవతలనియును, దేవదేవులనియును గీర్తింపఁబడి బ్రహ్మతో సమానులని చెప్పఁబడు చున్నారు. వారలు "అర్చన, దానము, అజయ్యత (పీడార్హులు కాకుండుట) అవధ్యత" అను నాలుగు విశేషధర్మములు గలవారలుగ వర్ణింపఁబడిరి. వారలకు బ్రాహ్మణత్వము (ఉత్తమకులత్వము) ప్రతిరూపచర్య, వేదాధ్యయనాదులవల్లనైన యశస్సంపాదనము, అధ్యాపనయాజనాదులవలన జనులకు శిక్షఁగఱపి ధర్మబోధనలఁ గావించి వారలను ధర్మమార్గానుసారులుగఁ జేయుట యను నీనాల్గును ధర్మములుగ విధింపఁబడినవి. మఱియు నీదిగువ వ్రాయఁబడిన పంచనియమములును విధింపఁబడినవి.

(1) బ్రాహ్మణుఁడు బ్రహ్మచర్యము పాటింపవలెను.

(2) తన పుత్రునకు విహితవయస్సునం దుపనయనము గావింపవలెను.

(3) భోజనవిషయములలో నియమముల ననుసరింపవలయును.



(4) అశ్లీలభాషణంబులఁ బలుకరాదు.

(5) ఆయుధధారణంబును జేయఁగూడదు.

ఈనియమములను బాటింపక నిరాకరించు బ్రాహ్మణుఁడు పతితుఁడుగఁ బరిగణింపఁబడి యుక్తప్రాయశ్చిత్తానంతరమున సంఘములోఁ గలుపుకొనఁబడుచుండెడివాఁడు. అయినను బ్రాహ్మణపుత్రుండే బ్రాహ్మణుఁ డగునను నియమము దృఢముగ నార్యసంఘములో నాకాలమునాఁటికి స్థాపింపఁబడలేదని యీదిగువ నుదాహరించిన వచనములంబట్టి స్పష్టమగుచున్నది. జ్ఞానమేగాని జన్మ బ్రాహ్మణత్వమునకుఁ గారణముకాదని స్పష్టము. శతపథబ్రాహ్మణంబున (11, 6, 2, 10) జనకుఁడు యాజ్ఞవల్క్యబోధలవలన బ్రాహ్మణుఁడయ్యెనని చెప్పంబడినది. "ఏష వై బ్రాహ్మణ ఋషిరార్షేయో యః శుశ్రువన్" "జ్ఞానసంపన్నుం డగువాఁడే బ్రాహ్మణఋషి" అను తైత్తిరీయసంహితవచనముపైసిద్ధాంతమును స్థిరపఱచుచున్నది. ఇందుల కనుగుణముగ మైత్రాయణీయసంహితయందు "కిం బ్రాహ్మణస్యపితరమ్, కిము పృచ్ఛసిమాతరమ్। శ్రుతంచేత్, అస్మిన్ వేద్యం సపితాసపితామహః॥" అను వచనము గనఁబడుచున్నది. "బ్రాహ్మణకులోద్భవులగు జననీజనకులంగూర్చి యెందులకుఁ బ్రశ్నించెదవు, వేదాధ్యయనంబుఁ గావించినవాఁడె తండ్రియును దాతయును."

వేదజ్ఞానసంపన్నతయె బ్రాహ్మణత్వమునకు ముఖ్యకారణముగఁ బరిగణింపఁబడు చుండెడిదనునది స్పష్టము. కౌశీతకి 55 వలన నాచార్యునకు "ఆక్షేయము" అనఁగ బ్రాహ్మణత్వము శిష్యునకొసంగుశక్తి యుండెడిదని స్పష్టమగుచున్నది. ఐతరేయబ్రాహ్మణమున గాథయొకటి యున్నది.

"ఋజ్ఞను క్షత్రియ వైశ్య శూద్రులను ద్యజించి బ్రాహ్మణునిఁ జేరెనఁట. అక్కారణముచేతనే యిప్పటికినీ బ్రహ్మయొక్క యు

బ్రాహ్మణులయొక్కయు నాధారముపై యజ్ఞము నిలిచియున్నది. క్షత్రియుండు బ్రహ్మననుసరించి చని "నన్నుఁగూడ యజ్ఞమునకుఁ బిలువుము" అని యనెను. బ్రహ్మ యిటులఁజెప్పె: "నీయాయుధములం బరిత్యజించి బ్రహ్మాయుధుండవై బ్రహ్మరూపమున బ్రహ్మవై యజ్ఞముకడకుం జనుము"

క్షత్రియుండు 'వల్లె' యని నిజాయుధములం బరిత్యజించి, బ్రహ్మాయుధములఁ బరిగ్రహించి, బ్రహ్మరూపమున బ్రహ్మయై యజ్ఞము కడకుఁబోయెను. అందుచేతనే యిప్పుడును క్షత్రియుండు తన యాయుధములను విసర్జించి బ్రహ్మాయుధములను స్వీకరించి బ్రహ్మరూపమున బ్రహ్మయై యజ్ఞముకడకుం జనుచున్నాఁడు. శతపథబ్రాహ్మణంబున "యజ్ఞముం జేయువాఁడు బ్రాహ్మణత్వముం జెందినటుల యజ్ఞంబుంజేయు" అని యున్నది. కాత్యాయనుండు శ్రౌతసూత్రంబున "బ్రాహ్మణశబ్దంబు వైశ్యునకును రాజన్యునకునుగూడఁ బ్రయోగింపవలయును" అనెను. ఇందులకు వ్యాఖ్యానం బీరీతిగ నున్నది. "ఈ బ్రాహ్మణుండు దీక్షితుఁడైనాఁడు," అనువచనంబు వైశ్యుఁడుగాని క్షత్రియుఁడుగాని చేయుయజ్ఞములలోఁ వారలంగూర్చి ప్రయోగింపవలయును. కాని "ఈరాజన్యుఁడు లేక యీవైశ్యుఁడు దీక్షితుఁడైనాఁడు" అనువాక్య ముపయోగింపరాదు. దీనినిబట్టి యజ్ఞముచేయువాఁడు క్షత్రియుఁడైనను వైశ్యుఁడైనను యజ్ఞమునకై దీక్షితుండైన బ్రాహ్మణుండనియే చెప్పఁబడుచుండెడివాఁడని మన మూహింపవచ్చును.

ఆకాలంబున వేదాధ్యయనంబును యజ్ఞాదికర్మలం జేయుటకుఁ దగిన జ్ఞానంబును గలిగియుండుటయు బ్రాహ్మణత్వమునకు ముఖ్యకారణంబులనియు జన్మ యట్టిముఖ్యకారణము కాదనియుఁ దలఁపఁబడినట్లు స్పష్టమగుచున్నది. • ఉపనయనసంస్కారముం బొందనివాఁ డెట్టి



నీచుఁడుగాఁ బరిగణింపఁబడుచుండెడివాఁడో యీదిగువ నుదాహరింపఁబడిన యాపస్తంబీయవచనములవలన స్పష్టమగుచున్నది. "అథయస్య పితాపితామహ ఇత్యనుపేతౌ స్యాతాం తే బ్రహ్మహసంస్తుతాః॥ తేషామభ్యాగమనం భోజనం వివాహమితిచవర్జయేత్॥ (I,1,28,29) "......"

దీనినిబట్టి యీకాలమున వేదజ్ఞానము కలిగి ఋత్విజులుగ నుండుటకుఁ దగినవారలే బ్రాహ్మణులుగఁ బాటింపఁబడుచుండెడివారని చెప్పుట బ్రాహ్మణులే వేదాధ్యయన యజనాదుల కర్తలని చెప్పుటకంటె యుక్తముగనున్నది. వేదాధ్యయనమునకుఁ దగిన శక్తి గలిగియుండిన బాలుని కాచార్యుండు సంస్కారాదులం గావించి వేదజ్ఞానంబు నొసంగి వైదికకర్మలం జేయుట కర్హుఁడుగ నొనర్చుటచే నట్టివాఁడు బ్రాహ్మణుఁడుగఁ బరిగణింపఁబడుచుండెడివాఁడని మన మూహింపవచ్చును. ఆర్యసంఘమప్పు డిప్పటివలెఁగాక వేదజ్ఞానసంపన్నులగు నరులనందఱను బ్రాహ్మణులుగఁ బరిగణించి పరిత్యజించుట కశక్యముగాని జన్మముతో సంబంధము లేకయే యుండెడిదని పండితులు చెప్పుచున్నారు. క్రమక్రమముగ జన్మాది సిద్ధాంతములవల్లనైన నిరోధములు ప్రబలమై వర్ణములననుల్లంఘనీయ బంధయుక్తములుగఁ గావించినవి.

జన్మమువలననే మనుజుఁడు బ్రాహ్మణుఁడుకాని, క్షత్రియుఁడు కాని, వైశ్యుఁడుకాని యగునను సిద్ధాంతము వేదములలోఁ గానరాదు. క్రమక్రమముగ నీసిద్ధాంతము ప్రాబల్యమును జెందినది. పైనుదాహరింపఁబడిన వచనములంబట్టిచూడఁగా వేదజ్ఞానసంపన్నతయే బ్రాహ్మణత్వమునకు ముఖ్యకారణంబనియును జన్మమట్టికారణము కానేరదనియును బహుపూర్వకాలమున నార్యుల యాశయమై యుండెడిదని నిశ్చయమగుచున్నది. విశ్వామిత్రుఁడును, జనకుఁడును, జన్మమువలన రాజన్యులయ్యు జ్ఞానతపోబలములవలన బ్రాహ్మణత్వ

ముం జెందినటులఁ బురాణములవలన స్పష్టము. మతంగోపాఖ్యానము మాత్రము దీనితో సరిపోవకున్నది.

మతంగోపాఖ్యానము;—మతంగుఁ డను బ్రాహ్మణకుమారుండు యజ్ఞార్థంబైన పనికిం దండ్రి పంపునఁబోయి పోయి యొక గాడిద కొదమం గోలఁగొని కొట్ట నయ్యది తన తల్లిం జేరి తన్నా విప్రకుమారుం డడఁచెనని చెప్ప నాయాఁడుగాడిదయు "ఈతఁడు చండాలుండు, ప్రచండ స్వభావముకలవాఁడు, కాన నిన్నుఁ గొట్టె" అని చెప్పె. ఆవిప్రకుమారుండును బూర్వజన్మ కర్మ విశేషంబునఁ దిర్యగ్జాతి భాషావిదుం డగుటఁ దనకు మాలతనం బెవ్విధంబునఁ గలిగెనో యాయాఁడు గాడిద నడిగెను. ఆగార్దభియు "ఓయి నీవు శూద్ర బీజంబున బ్రాహ్మణస్త్రీకి నుద్భవించితివి. అక్కారణముచే చండాలుండవయితివ"ని చెప్పెను. అప్పుడాతఁ డామాటలాలకించి విషాదముతో దన పోయెడి పనికిం బోవక మరలి సదనంబునకుం జని జనకున కత్తెఱంగెల్ల నెఱింగించి యతనితో "శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు తప్పక చండాలుండు కానోపును గాన నేను దపంబుఁజేసి బ్రాహ్మణత్వము సంపాదించెద"నని చెప్పి యరణ్యంబునకుఁ బోయి ఘోరతపం బాచరించెను. అంతట నింద్రుండు ప్రత్యక్షంబయి "ఓయీ నీతపంబునకు మెచ్చితి. వరంబుఁ గోరుమ''ని చెప్ప నాతఁడు నాకు బ్రాహ్మణ్యము లభింపవలయునని నుడివెను. అంత నింద్రుండు "ఓయీ నీవెంత ఘోరతపం బాచరించినను నీకు బ్రాహ్మణత్వంబు సిద్ధింపనేరదు. కాన నిందులకు రిక్త ప్రయాసము నొందకుము" అని చెప్పి మఱియొక్క వరం బిచ్చి పోయెను. కాన బ్రాహ్మణత్వంబు సర్వజనులకు సంప్రాప్తింపదని యీయుపాఖ్యానమువలనఁ దెలియుచున్నది.

ఈకథలంగూర్చి యొక పాశ్చాత్యవిద్వాంసుఁడీరీతిగ వ్రాయుచున్నాఁడు. "క్షత్రియుండు జన్మపరంపరల ననుభవించి గాని



బ్రాహ్మణుండు కానేరఁడని యిచటఁ గాన్పించు దృఢోక్తి విశ్వామిత్ర వీతహవ్యాద్యుపాఖ్యాన విషయములను ఖండించుచున్నది.

కాలక్రమమున నాచారములు మాఱి నూతనాచారానుసారములగు సిద్ధాంతములు వెలువడినవి. బ్రాహ్మణత్వము జన్మమువలనఁ గలుగునను సిద్ధాంతము బయల్వెడలి క్రమక్రమమున బ్రాహ్మణత్వమునకు జన్మమే ముఖ్యకారణమైనది. బ్రాహ్మణదంపతుల సంతానమే బ్రాహ్మణత్వముం జెందునను సిద్ధాంతము మెల్లమెల్లగఁ బ్రాబల్యము బొందినది. భారతంబునందు బ్రాహ్మణునకు క్షత్రియ వైశ్యభార్యలం దుద్భవించిన పుత్రుండు బ్రాహ్మణుఁడై యుండునని నిరూపింపఁబడినది. మనుసంహితలో ద్విజులకుఁ దమకంటె నొక యంతరువు తక్కువయైనజాతుల స్త్రీలయందుఁ బుట్టిన పుత్రు లుత్పాదకసమానవర్ణస్థులై యుండినను నట్టివారు జననులందుండు దోషములచే దూష్యు లగుచున్నారని చెప్పఁబడినది. గౌతమ ధర్మసూత్రములోనుండి యీదిగువ నుదహరింపఁబడిన యంశముంబట్టి చూచిన నీ విషయములో సిద్ధాంతము లెటుల మాఱుచుండెడివో సులభముగఁ దెలియును. "బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయం దుద్భవించిన కన్యను బ్రాహ్మణునకిచ్చి వివాహము చేయఁబడి యటులనే యామె వంశమున సంభూతలగు స్త్రీ లేడంతరములవఱకు (బ్రాహ్మణులతో) వివాహితలైన నట్టి యేడవ యంతరములోని స్త్రీయందు బ్రాహ్మణ భర్త కుద్భవించిన సంతానము బ్రాహ్మణత్వముం జెందు. ఈ రీతిగనే సవర్ణపురుషుఁ డనఁగ బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయం దుద్భవించిన పురుషుండు క్షత్రియకన్యను వివాహ మాడిన నారీతిగనే యాతని పుత్రపౌత్రాదు లేడంతరములవఱకును క్షత్రియ కన్యలను వివాహమాడుచుండిన నట్టి యేడవ యంతరము వానికి క్షత్రియ భార్యయం దుద్భవించిన పుత్రుండు క్షత్రియుఁడై యుండు. ఈ నియ

మమే క్షత్త్రియులకు వైశ్యభార్యలయం దుద్భవించిన సంతానము నకును వైశ్యులకు శూద్రభార్యలయం దుద్భవించిన సంతానమునకును జెందును."

అయిదవ యంతరములోనే యిట్టి మార్పులు చెందునని కొందఱు ధర్మకర్తలమతమని గౌతమునిచేఁ జెప్పఁబడినది. "బ్రాహ్మణు లెటుల శూద్రత్వముం జెందుదురు? మఱియు శూద్రులెటుల బ్రాహ్మణత్వముం జెందుదురు?" అను విషయము మనుధర్మశాస్త్రంబునఁ బదియవ యధ్యాయంబున నిరూపింపఁబడినది.

శ్లో॥ „శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసాచేత్ప్రజాయతే
అశ్రేయాంచ్ఛ్రేయసంజాతిం గచ్ఛత్యాసప్తమాద్యుగాత్
శూద్రోబ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం
క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ॥"

బౌద్ధవాఙ్మయము చూచినను, బ్రాహ్మణుల సంస్కృత వాఙ్మయము చూచినను, బ్రాహ్మణులును, క్షత్రియులును, వర్ణములలో నగ్రస్థులుగఁ బరిగణింపఁబడుచుండెడివారని స్పష్టమగుచున్నది. బ్రాహ్మణులును క్షత్త్రియులును వర్ణములలో నగ్రస్థానమునకై చాలకాలము కలహించిరను విషయమును స్పష్టపఱచుటకై బ్రాహ్మణవాఙ్మయమునుండి కొన్ని విషయములుదీసి యీక్రింద నిరూపించుచున్నాము. (Muir S. T. P. 337–371.) ఈవిషయముం గూర్చి బౌద్ధవాఙ్మయమున సంబద్ధాదిసూత్రములం జెప్పవచ్చును. ఈ విషయములో జైనకల్పసూత్రంబులు బౌద్ధసుత్తంబుల ననుసరించుచున్నవి. కల్పసూత్రము లో(XXII పుటలు 225–226)అర్హంతులునీచ కులములలోఁగాని హీనకులములలోఁగాని బ్రాహ్మణ కుటుంబములలోఁగాని యిదివఱకెన్నఁడును జనింపలేదనియు నిఁకముందెన్నఁడును జనింపరనియుఁ జెప్పఁబడినది. పూర్వకర్మానుసారముగ నట్టివారలు



పిండస్వరూపమున నట్టి కులములం జెందిన స్త్రీ గర్భములలోఁ బడినను నందుండి జన్మము గాంచకయె యుత్తమస్త్రీ గర్భములోనికిం దీసివేయఁబడుదురు.

బౌద్ధజైన వాఙ్మయములం జెప్పఁబడిన బ్రాహ్మణసిద్ధాంత విరుద్ధంబగు క్షత్త్రియాన్నత్యము మిథ్యయనియును బౌద్ధజైనులకు బ్రాహ్మణులయెడలనుండిన ద్వేషమే యట్టి క్షత్త్రియవర్ణోత్కృష్ట్యమునకుఁ గారణమనియును గొందఱు చెప్పవచ్చును. కాని బ్రాహ్మణ సిద్ధాంతమునఁ జెప్పంబడిన బ్రాహ్మణోత్కృష్ట్యమున కిట్టి యాక్షేపణమె యున్నదని మనము చెప్పకతీరదు. వాజసనేయసంహితయందు (XXXVIII–19) క్షత్త్రియులు బ్రాహ్మణులకంటెఁ బ్రథమమునఁ జెప్పబడినారు. కాథకంబున (28-5) క్షత్త్రియులు బ్రాహ్మణులకంటె శ్రేష్ఠులని చెప్పఁబడినది. శతపథబ్రాహ్మణంబున "బ్రాహ్మణుఁడు నరపాలుని నాశ్రయించి చనెననియును భూపాలుని తరువాత భూసురుఁడు పూజింపఁదగినవాఁడనియును" జెప్పఁబడినది. ఈ దృష్టాంతములంబట్టి చూచిన బ్రాహ్మణాదివర్ణములిప్పటివలె దృఢనిబద్ధములై యుండలేదనియు నుత్తమవర్ణములలోనైనను యోగ్యతనుబట్టి యొక వర్ణమునుండి యింకొకవర్ణములోనికి మార్పుఁ బొందవచ్చుననియు స్పష్టమగుచున్నది.

బ్రాహ్మణులకును క్షత్త్రియులకును వర్ణములలో నగ్రస్థానమునకై జరిగిన వివాదములోఁ గ్రమముగ బ్రాహ్మణులే జయముం గాంచిరి. ఏవరీతిని బ్రాహ్మణులకు జయము సంభవించినదో నిరూపించుట సాధ్యము కాకపోయినను బౌద్ధమతము క్షీణించినపిదప బ్రాహ్మణులు వర్ణములలో నగ్రస్థానముం బొందుట స్పష్టము.

క్రీ॥ శ॥ ఆఱవశతాబ్దమునాటి తాలగుండశాసనము బ్రాహ్మణ క్షత్త్రియ వైషమ్యమును సూచించుచున్నదని విద్వాంసు లూహించు

చున్నారు. మయూరశర్మయను బ్రాహ్మణుండు పల్లవుల రాజధానికి వేదాధ్యయనంబునకై చని యచట నొకపల్లవాశ్వకునితో వివాదపడి "అయ్యో! ఈకలియుగంబున బ్రాహ్మణులు క్షత్రియులకంటె దుర్బలులై యుండుట విచారకరము. ఆచార్యకుటుంబమున కతిశ్రద్ధతో శుశ్రూషంజేసి నిజవేదశాఖను సమగ్రంబుగఁ బఠియించిన నరుని పవిత్రత నరపాలుని యధీనంబై యుండిన నెంత దుఃఖకరంబు!" అని విలపించుచుఁ గుశసమిధల నతి కౌశల్యముతోఁ బట్టి కరంబుచే నొర నుండి దేదీప్యమానంబగు కరవాలంబును దీసి పల్లవుల నోడించి రాజ్యాభిషిక్తుఁడయ్యెనని చెప్పఁబడినది. జోదుపూరు రాష్ట్రంబున బ్రతిహారచౌకుని శాసనంబులో హరిశ్చంద్రుఁడను భూసురునకు బ్రాహ్మణక్షత్రియస్త్రీ లిరువురు భార్యలై యుండిరనియు నందు క్షత్రియస్త్రీయం దుద్భవించినవారు ప్రతిహారక్షత్రియు లైరనియుఁ జెప్పంబడినది. ఇట్టి యసమాన వర్ణవివాహములు జనసమ్మతములై సామాన్యముగ దేశమున జరుగకుండిన నిట్టి యున్నతవంశమునకిట్టి యుద్భవకారణంబు శాసనకర్తలీయ సాహసింతురని నమ్మఁజాలము.

కాకుస్థవర్మయొక్క తాలగుండశాసనమునఁ గదంబవంశస్థులు బ్రాహ్మణులయ్యుఁ దమ పుత్రికను మాతృపక్షమున వ్రాత్యక్షత్రియులతో సంబంధము గల గుప్తవంశజుండగు నొక నరపాలకున కిచ్చి వివాహము చేసిరని చెప్పఁబడినది. కాలక్రమమున బ్రాహ్మణులు వివాహభోజన స్పర్శనాదివిషయములలో నియమములు దృఢంబుగ నొనర్చి యట్టి నియమములచే నన్యవర్ణములవారలతో సంపర్కము లేకుండఁ జేసి తమ వర్ణమున కౌత్కృష్ట్యముం గావించుకొనిరి. ఈ నియమములనే క్షత్రియులు, వైశ్యులుకూడ సాధ్యమైనంతవఱకు నవలంబించుచు శూద్రాదులతో సంపర్కమేమియులేక వర్ణక్రమములోనున్న తత్స్థానముల నలకరించుచు వచ్చిరి.

## ౫

## క్షత్రియులు

పూర్వాధ్యాయములలో బ్రాహ్మణులకును క్షత్రియులకును వర్ణములలోని యగ్రస్థానంబు కొఱకు జరిగిన వివాదలం గూర్చి చెప్పితిమి. బౌద్ధమతకాలములో హిందూదేశమున బ్రాహ్మణుల యౌత్కృష్ట్యము క్షత్రియులచే నంగీకరింపఁబడి నటులు గాన్పింపదు. ఏది యెటులున్నను బ్రాహ్మణులును క్షత్రియులును వర్ణములలో నుత్తములని ప్రజలచేఁ బరిగణింపఁబడుచుండుట స్పష్టము. ఈ రెండు వర్ణముల వారలలో మిశ్రవివాహము లేకాలమువఱకు జరుగుచుండెడివో చెప్పుట కష్టము. మఱియు నట్టి మిశ్రవివాహములు భరతఖండంబుననే యేభాగములందు జరుగుచుండెడివో నిర్ణయించుటయుఁ గష్టమే. ఈయుత్తమ వర్ణములవా రొండొరులతో నిప్పటివలెఁ గాక భోజన ప్రతి భోజనంబులు చాల కాలమువఱకుఁ జేయుచుండుటయు స్పష్టమె.

వర్ణసిద్ధాంతములలో క్షత్రియులు యోధులుగను నరపాలకులుగను వర్ణింపఁబడిరి. పురాణాదులం బరికించి చూచినఁ బరిపాలకులై యుండుటంజేసి క్షత్రియులు యోధులై యుండవలసివచ్చెనని మన మూహింపవచ్చును. అన్యజాతులవారలును యోధులై యుండెడివారు. రాజసైన్యములు కేవలము క్షత్రియులతోడనేనిండి యుండెడివని చెప్పుటకు వీలులేదు. భూపాలురును సామంతరాజులును సేనలలో నున్నతోద్యోగస్థులుగను క్షత్రియులుగనుబరిగణింపఁబడుచుండెడి వారు. ముఖ్యముగఁ గోసల మగధవిదేహాది రాజ్యపరిపాలకులును, వారి బంధువులును, నీమహీరాజ్యప్రాంతంబులనుండు రాజ్యం

బులం బాలించుచుండెడి శాక్యమల్లలిచ్ఛవాది రాజులును దద్బంధువులును, వారివారి సామంతరాజులును క్షత్త్రియులుగఁ బరిగణింపఁబడుచుండెడివారు. మహామాత్రులు క్షత్త్రియులై యుండుట కవసరముండి నటులుఁ గాన్పింపదు. అమాత్యులు బ్రాహ్మణులై యుండుటయు క్షత్త్రియాన్యవర్ణములవారలు సేనానాయకులుగ నుండుటయు స్పష్టము.

రాజత్వము గలిగి యందు కర్తలైనవారలే క్షత్త్రియులు : కులాదినియమాతీతులు : రాజకీయశక్తిని వ్యక్తీకరించు సంఘమును జెందినవారలు. ఇట్టియెడ నట్టివారల నొకవర్ణమును జెందినవారలుగఁ బరిగణించుట యుక్తమాయనునది మనము చర్చింపవలసి యున్నది.

ప్రజా పరిపాలనము క్షత్త్రియవర్ణమునకు బ్రాహ్మణసిద్ధాంతములో నియమింపఁబడిన ముఖ్యమైన వృత్తి. ఈప్రజాపరిపాలనమే క్షత్త్రియవర్ణ విశిష్టలింగము. నరపాలురలో నన్యోన్యముండు విరోధభావములు వివిధనరపాలుర నొక్క సునిర్మితవర్ణముగ బంధింపనేరవయ్యె ననునది నిశ్చయము. ఎట్టి వివాహ భోజనాది నియమములచే నిట్టివారు బంధింపఁబడి క్షత్త్రియవర్ణస్థులుగఁ బరిగణింపఁబడుచుండెడివారో నిశ్చయించుటకు వీలులేదు. వర్ణస్థుఁడు తద్వర్ణసంబంధములైన భోజన వివాహాది నియమములం బాటింపకుండిన నావర్ణమునుండి బహిష్కృతుండగును. పృథుశక్తియుక్తుండైన నరపాలుని నీరీతిగ దండించు శక్తి యెవ్వానికుండును? హీనకులోద్భవురాలగు సత్యవతిని వివాహమాడి కురువంశస్థుఁడగు నుత్తమక్షత్త్రియుఁడు రాజ్యార్హుఁడగు బాలుని జనకుఁడు కాలేదా? బ్రాహ్మణియగు కదంబవంశీయ రాజకన్యను క్షత్త్రియవ్రాత్యకులసంభూతుఁడగు గుప్తవంశపు రాజున కిచ్చి వివాహము చేయుటయు మనముగనియే యున్నారము.



భోజనాది విషయములలో నరపాలురు నియమరహితులని చెప్పుట యసత్యమైనను దదితర వర్ణస్థులవారలలోఁ గన్పడు సుదృఢ నియమములు నరపాలురగు క్షత్త్రియులలోఁ గాన్పింపవు. బ్రాహ్మణ ధర్మశాస్త్రములం బట్టియు రాజున కాశౌచాది విషయములలో నిర్బంధము లతిస్వల్పములు. రాజబంధువు లీ నియమములచే నెంత వఱకు బంధితులగుచుండెడివారో చెప్పుట కష్టము. రాజ్యపాలకులై శక్తిమంతులగు నరపాలురు నీచవంశస్థులతో వివాహములం జేసికొనుట కిష్టపడరనుటలో వింతయేమియును గానరాదు. వర్ణసంబంధములు లేని పాశ్చాత్య దేశములలోఁ గూడ నరపాలురు తమతో సమానులగువారలతో వివాహములం గావించుకొనరు.

కొలఁది మాసములకుఁ బూర్వము రుమేనియా దేశపు యువరాజు సామాన్య కన్య నొకతెను మోహించి వివాహమాడఁ బ్రయత్నించెను. కాని విఫలమనోరథుఁ డాయెను. రాజులు రాజకన్యలనే వివాహమాడుట వర్ణనియమములను బాటించుటకై కాదు. హీనకులజాతలగు కన్యలను వివాహమాడినఁ దమ కుద్భవించిన పుత్రులు రాజగుణరహితులై వంశమునకును రాజ్యమునకును హాని కలుగఁ జేయుదురను నమ్మకముచే రాజులు వివాహ విషయములో నియమబద్ధులై కొంతవఱకు సంచరింతురు. భరతఖండపు జనులను వర్ణవిభాగములును, వర్ణవిషయక సిద్ధాంతములును విశేషముగ వశపఱచికొని యుండుటచే జనపాలకకుటుంబములు క్షత్త్రియవర్ణమును జెందినటులు పరిగణింపఁబడుచుండెడివని మన మూహించిన సత్యవిరుద్ధంబై యుండదు.

జాతకకథలలో రెండుమూఁడు చోట్లమాత్రమే క్షత్త్రియవర్ణము పేర్కొనఁబడినది. గంగమాలజాతకంబున మంగలియొకఁడు పచ్చేకబుద్ధుఁడై యొక నరపాలు నాతనిపేరితోఁ బిలిచి యిట్లు

ప్రశ్నించెను: "బ్రహ్మదత్తా! నీవు శ్రద్ధాళుఁడవై దానాది సత్కర్మలం జేయుచు రాజ్యమును ధర్మముతోఁ బరిపాలించుచున్నావా?" అని ప్రశ్నించిన రాజమాత యది విని కడు కోపముతో నీ రీతి నాతని మందలించెను: "నీచకులోద్భవుం డగు నంగమర్దనముచేయు మంగలి కొడుకు నిజస్థానమును గుర్తెఱుంగకున్నాఁడు. క్ష్మాపాలుండును క్షత్రియవర్ణజుండును నగు నాపుత్రుని బ్రహ్మదత్తా యని పేరు పెట్టి పిలుచుచున్నాఁడు." నరపాలురు బ్రాహ్మణులను క్షత్రియవర్ణస్థులకంటె హీనులుగఁ బరిగణించుచుండుటయు బౌద్ధసూత్రములలోనే గాక జాతకకథలలోఁ గూడఁ గాన్పింపకపోదు. సోనకజాతకంబున నరిందముం డను రాజీరీతిగ వితర్కించుకొనెను: "ఈహీన జాత్యుద్భవుండగు బ్రాహ్మణుఁ డవిచ్ఛిన్న క్షత్రియకులసముద్భవుం డనగు నాశిరముపై నిజపాదరేణువుల విరియఁజల్లి యాకాశమున మాయమైనాఁడు." క్షత్రియులు వివాహమాడు నపుడు సమాన కుటుంబములనుండియే కన్యల స్వీకరించుటచేతను వారలకుండు వర్గాభిమానముచేతను నీక్షత్రియవర్గము క్రమక్రమముగ వర్ణమాయెను.

బౌద్ధమతమునకు జన్మస్థానములైన ప్రాగ్దేశములలో క్షత్రియులు బ్రాహ్మణులకంటె నుత్తమవర్ణజులుగఁ బరిగణింపఁబడుచుండెడివారని తెలియఁజేయు వచనములను బౌద్ధవాఙ్మయమునుండి యుదాహరించితిమి. క్షత్రియు లిట్టి యగ్రస్థానమును దమ యధికారముచే సంపాదింపఁగలరని యూహింపవలసుపడదు. క్షత్రియులు జ్ఞానసంపన్నులై యుండి ప్రజలు గౌరవమును బడయుచుండిరి. ఉపనిషత్తులయందలి పరమాత్మక్షేత్రజ్ఞ మోక్షసంబంధముగల సిద్ధాంతములు విశేషముగ క్షత్రియోద్భవములని విద్వాంసులు చెప్పుచున్నారు. మఱియు బ్రాహ్మణ సిద్ధాంతములో క్షత్త్రియులకధ్యయనయజనంబులు విధులుగ నియమింపఁబడినవి. ఇందు కనుగుణముగ జాతకకథలలో ననేక స్థలములందు క్షత్త్రియ కుమారులు వేదత్రయంబు నాచార్యుల దగ్గఱఁ దక్కశిలాది నగరములలో నభ్యసించినటులు చెప్పఁబడినది.



శిల్పములను, నష్టాదశవిద్యలను క్షత్త్రియకుమారు లభ్యసించుచుండెడి వారు. బ్రాహ్మణబాలురకువలె క్షత్త్రియబాలురకుం గూడ వేదాంతాది విద్యలయందుఁ గూడ శిక్షం బొందుట యావశ్యకమని మన మూహింపవచ్చును. తఱచుగ జాతకకథలలో క్షత్త్రియకుమారుల విద్యను గూర్చి చెప్పఁబడినపుడు కుమారులు షోడశవర్షీయులైన పిదపఁ దక్కశిలానగరమునకు విద్యాభ్యాసమునకై తమ జనకులచేఁ బంపఁబడినటులు నుడువంబడుచున్నది. తక్కశిలానగరము భారతఖండంబున విద్యలకు ముఖ్యస్థానమై యుండెడిది. ఇయ్యది గాంధారదేశమందలి గొప్ప పట్టణము. కాశియు విఖ్యాత విద్వాంసులచే నలంకరింపఁబడుచుండినను గాశీరాజు కుమారులు కూడ విద్యాభ్యాసమునకై తక్కశిలానగరమున కేగుటను బరికించి చూడఁగా నానగరము విశిష్టార్య ప్రబోధనమున కాటపట్టైయుండెడి దని మన మూహింపవచ్చును. పూర్వపు రాజులు తమ పుత్రులను దూరస్థమగు గాంధారదేశమునకుఁ బంపుటలో నింకొక యుద్దేశము గూడఁ గలిగియుండెడివారని చెప్పవచ్చును. తిలముష్టిజాతకంబున నప్పటివారు దమ పట్టణములో జగద్విఖ్యాతుండగు నాచార్యుండు వసించుచుండినను తమ పుత్రులను దూరప్రదేశములకు విద్యాభ్యాసమునకే గాక "గర్వాభిమానరహితులుగఁ జేయుటకును, శీతోష్ణముల నోర్చియుండు శక్తి గల్గించుటకును, లౌకికవ్యవహారజ్ఞానము సంపాదింపఁ జేయుటకును బంపుచుండెడి వారు" అని చెప్పఁబడినది.

విద్యాభ్యాసమైన పిదప నృపకుమారులు యువరాజులుగను, నుపరాజులుగను, దమ జనకులచే నియమింపఁబడుచుండెడి వాడుక

యుండెడిది. యువరాజు నెటుల నృపుఁడు కాపాడవలయునో కౌటిల్యుని యర్థశాస్త్రమునఁ జెప్పఁబడినది. రాజపుత్రుఁడు బాలుండై యుండిన నృపాలుని కనిష్ఠ సోదరుఁ డుపరాజుగ నియమింపఁబడు వాడుక యుండెడిది. (1-133) నరపాలుఁడు మరణించిన పిదప నాతని జ్యేష్ఠ పుత్రుఁడు రాజగుచుండెడివాఁడు. సాధారణముగ నగ్రమహిషి యొక్క పుత్రులు రాజ్యాభిషిక్తు లగుచుండెడివారు. క్షత్రియ కులజాతలైన భార్యలనే నరపాలురగ్రమహిషులుగఁ బరిగ్రహించుచుండెడివారో లేదో నిశ్చయించుట కష్టము. కర్ఠహారి జాతకంబున రాజు కాష్ఠహారిణియగు స్త్రీయం దుద్భవించిన పుత్రుని నుపరాజుగ నియమించెనని చెప్పఁబడినది.

పుత్రహీనుండైన నృపునకుఁ బుత్రికయుండిన నామె భర్తయే రాజుయొక్క మరణానంతరమున రాజ్యాభిషిక్తుఁడగు చుండెడివాఁడు. ముదుపాణి జాతకంబున రాజు తన మేనల్లునిఁ గూర్చి యమాత్యులతో "నామరణానంతరమున నా మేనల్లుఁడు రాజగును. నాపుత్రిక యాతని యగ్రమహిషియై యుండు" అని చెప్పెను. తరువాతఁ దన యుద్దేశమును మార్చుకొని తన పుత్రిక నింకొక రాజున కిచ్చి వివాహముచేయఁ బ్రయత్నించెను గాని విఫలమనోరథుం డయ్యెను. ఆరాజ పుత్రిక నరపాలుని మేనల్లునిఁ బ్రేమించి యుండుటచేఁ దండ్రి యాజ్ఞకు వ్యతిరేకముగ నాయువకునే వివాహ మాడెను.

రాజు, పుత్రహీనుండై మరణించిన తరువాత రాజ్యార్హుఁడైన రాజబంధువుఁ డెవ్వఁడును లేకుండిన నమాత్యులు రాజు నెన్నుకొనుచుండెడివారని జాతకకథలవలన స్పష్టమగుచున్నది. వేదములలోను బురాణములలోను బ్రజలే యట్టి సమయంబులఁ దమపాలకుని నెన్నుకొనుచుండెడివారని చెప్పఁబడినది. తయోధమ్మ జాతకంబున భూపాలకుని మరణానంతరమున వాని పుత్రులలో శ్రేష్ఠుఁడగు



వానిని రాజుగఁ బ్రజ లెన్నుకొనిరని చెప్పఁబడినది. మందుఁడును, కుష్ఠము మున్నగు దుర్వ్యాధులచేఁ బీడితుండును నగు పుత్రుండు జ్యేష్ఠుఁడయ్యు రాజ్యపాలనమునకనర్హుఁడుగఁ బరిగణింపఁబడుచుండెడివాఁడని (పు 145 భాగము) తెలియుచున్నది.

ఇంకొక యాచారము జాతకకథలలో వర్ణింపఁబడినది. రాజు పుత్రహీనుండై మరణించిన నాతని కుత్తరక్రియలన్నియు జరుపఁబడినపిమ్మటఁ బురోహితుఁడు పుష్పరథ మొకదానిపై బంచరాజచిహ్నములనుంచి పుర మంతటను ద్రిప్పునఁట. ఈవిధముగ రాజాన్వేషణము గావించునపుడు పద్మవర్ణముగల సైంధవంబుల నాల్గింటి నా పుష్పరథంబునకుఁ బూంచి యా రథముపై నుత్తరచ్ఛదనం బుంచి రాజచిహ్నపంచకాలంకృతంబుగ నారథము నోసర్చి, దాని యొక్క చర్మబంధములను హేమమయంబగు సృణిని బురోహితుఁడు శుద్ధోదకములచేఁ బ్రోక్షించి చతురంగబల పరివృతంబుగ దానిని రథికశూన్యంబుగనే యా పట్టణంబునఁ బోవిడుచునఁట. ఈ రథము ననుసరించి యింకొక రథము భేర్యాదితూర్యంబులు సునినాదంబులు సలుపుచుండ నేకరథికాధిష్ఠితంబై చనుచుండునఁట. రాజపురోహితుండును రథము ననుసరించును. ఆ రథికశూన్యరథము నెక్కినవాఁడు రాజ్యార్హుఁడైనయెడల రాజుగ నెన్నుకొనెడివారఁట. మహాజనకుం డనువాఁడు మాతృగర్భస్థుఁడై యుండ నాతని జనకుండగు నరిష్ఠ జనక మహారాజు యుద్ధమున శత్రు రాజగు పోల జనకునిచే వధింపఁబడెను.

గర్భవతియగు నరిష్ఠజనకుని పట్టమహిషి శత్రువుల నుండి తప్పించుకొనిపోయి యొక బ్రాహ్మణుని యొండఁజేరి సుఖప్రసన్నయై పుత్రునిఁ బడసెను. ఆపుత్రుఁడు దినదినాభివృద్ధి చెందుచుండ నా బ్రాహ్మణునిచే రక్షితురాలై సుఖముగ జీవించుచుండెను. మహా

జనకుఁడును సర్వవేదముల నభ్యసించి ధనుర్వేదాదివిద్యలలోఁ బ్రవీణతను సంపాదించియుండెను. మహాజనకునిమాత మాత్రము బాలునితో నాతని జనకునిం గూర్చియుఁ గులముం గూర్చియు నేమియుం జెప్పక యూరకొనియుండ మహాజనకుఁడు తాను బ్రాహ్మణుఁ డనియే నమ్ముకొనుచుండెను. బ్రాహ్మణ కుమారులగు నాతని సహాధ్యాయులు క్షత్రియకుమారుఁడ వీవని వెక్కిరించిరి. బాలుఁడు జనని కడకుం జని సహాధ్యాయుల మాటలకుఁ గతం బేమని ప్రశ్నింప నామె నిజ వృత్తాంతం బంతయు నెఱిఁగించెను. మహాజనకుఁడు పితృరాజ్యంబును పోలజననియొద్దనుండి బలాత్కారముగ నాకర్షించెదనని జననితోఁ జెప్పి యామె దగ్గఱనున్న రాజాభరణములం బుచ్చుకొని మైథిలికిం బ్రయాణమైపోయెను. త్రోవలో సముద్రమును దాఁటవలసియుండుటచే నాతఁ డొక యోడపై బ్రయాణము సాగించుచుండ సముద్రమధ్యంబున నా నావ బ్రద్దలాయెను. సుషుప్తుండగు నా మహాజనకుని నొక దేవత సురక్షితముగఁ దీసికొనిపోయి మైథిలిరాజు యొక్క యామ్రవనంబున రాజశిలపైఁ బరుండఁబెట్టి చనెను. పోలజనకుఁ డప్పటికి గొలఁదిరోజులక్రిందటనే మృతినొందెను. అతని కొక పుత్రికయే యుండెను. మృతినొందుసమయమునఁ బోలజనకుఁ డమాత్యాదులతోఁ దన పుత్రికచేఁ బ్రేమింపఁబడువాఁడు రాజుగ నియమింపఁబడవలెనని చెప్పెనఁట. ఆ పురమునందుండు గొప్పవారలలో నొక్కనినైనఁ బోలజనకుని పుత్రిక ప్రేమింపకుండుటచేఁ దుదికమాత్యులందఱును బురోహితవచనముల ననుసరించి పైనిజెప్పిన ప్రకారము పుష్పరథంబు నాయూరఁ ద్రిప్పిరఁట. ఆ రథం బామ్రవనంబు చొచ్చి యా మహాజనకుండు నిదురపోవుచుండిన యా శిలాసమీపమున నాఁగెను. తూర్యారావము లుద్ఘోషించెను. నిదుర నుండి మేల్కాంచియు నాయువకుం డానినాదంబులను లక్ష్యపెట్టకయే



ప్రక్కకుఁ దిరిగి నిదురం జెందుచుండె. పురోహితుఁ డా మహాజనకుని పాదములం బరీక్షించి సమ్రాట్చిహ్నముల నాతని పాదములయందుఁ గనెను. పిదప యచటనే యతనిని రాజ్యాభిషిక్తునిఁగ నొనర్చెను.

ప్రజలచే నెన్నుకొనఁబడుచుండెడివాఁడు క్షత్రియకులస్థుఁడై యుండకపోయినను రాజైనపిదప నాతఁడుక్షత్రియుఁడుగఁ బరిగణింపఁబడుచుండెడివాఁడో, లేదో చెప్పుట కష్టము. క్షత్రియవర్ణమునకుం జెందని రాజులు మనకుం గాన్పింపకపోరు. మౌర్య రాజ్యస్థాపకుండైన చంద్రగుప్తుఁడుశూద్రుఁడు. బ్రాహ్మణసిద్ధాంతములో క్షత్రియకులసంభూతుఁడు కానివాఁడు నరపాలకుండైనను క్షత్రియుఁడుగఁ బరిగణింపఁబడఁడు.

విద్యాభ్యాసము సంపూర్ణమైనపిదప జ్యేష్ఠపుత్రుని నుపరాజుగఁ జేయు నాచార ముండెడిదనియు యింతకుమున్నే చెప్పితిమి. ఒకప్పుడు రాజు లట్లు పుత్రులకు సర్వాధికార మొసంగుచుండెడివారు. ఈ యుపరాజుల కెట్టి యధికారము లుండెడివో తెలియరాకున్నవి. ఉత్సవసమయములలో నూరేగింపు సమయమున నుపరాజు నరపాలకుని ప్రక్కను భద్రగజముపైఁ గూర్చుండియుండును. ఒకప్పు డట్టి సమయములందుఁ బురోహితుఁడును భూపునిప్రక్కనాసీనుండై యుండు. కురుధమ్మజాతకములో మాత్ర ముపరాజు రాజ్యకార్యములలో రాజునకు సహాయ మొనర్చుచుండెనని యున్నది. ఆ క్రమ మీక్రింద నుదహరింపఁబడుచున్నది.

"ఉపరాజు ప్రతిదినమునను సాయంకాలమున రాజునకుఁ బూజఁ గావించుచుండును. ఒకవేళ రథము ప్రాసాదప్రాంగణముఁ జేరునప్పటి కుపరాజునకు రాజుతో భోజనముం జేసి యా రాత్రి యచటనే పరుండవలెనని యిచ్చ వొడమినచోఁ బగ్గములను, సృణిని

యుగంబులపై విడిచివేయును. ఇదియే వాని పరిజనంబునకు సెలవొసంగి పంపివేయుట. మఱునాఁటి యుదయముననే పరిజనులు ప్రాసాదప్రాంగణమున వాని యాగమనమునకు వేచియుందురు. సారథి రథంబుఁ గొనిపోయి మఱునాఁటి యుదయముననే రాజప్రాసాద ద్వారంబుదగ్గఱ రథముతో వాని రాకకు వేచియుండును. ఇఁక నుపరాజానాఁటి రాత్రి యట్లు ప్రాసాదంబున నుండ నిచ్చగింపనిచోఁ బగ్గంబులను, సృణిని రథమందే యుంచి రాజపూజార్థము ప్రాసాదంబు లోనికిఁ బోవును."

రాజకుమారు లుపరాజులుగ నుండి రాజ్య పరిపాలనాది విషయములలో జ్ఞానము సంపాదించుచు రాజ్య వ్యవహారములలోఁ బరిచయము చేసికొనుచుండెడివారు. అట్టి యుపరాజులు భూపాలుని మరణానంతరమున రాజ్యాభిషిక్తులై రాజ్యములం జేయుచుండు నాచార ముండెడిది. ఉపరాజులు కొందఱు దురాశాపరులై నరపాల మరణానంతరమువఱకు రాజ్యమునకై వేచియుండనేరక పరిపాలకుని వధియించి రాజ్యము నాక్రమించుకొను వాడుకయు గన్పట్టకపోదు. నరపాలుని భక్ష్యములలో విషప్రయోగములం జేసియు శయ్యాగృహాదులలోఁ బొంచియుండి ఖడ్గములతో నఱికియు నట్టి యుపరాజులు రాజును వధింపఁ బ్రయత్నించుచుండెడివారు. మఱియు నుపరాజులు రాజ్యము నాక్రమింపఁగోరి రాజ్యప్రాంత ప్రదేశములలో నేలికపైఁ బితూరీలు లేవదీసి కలవరములం గలుగఁజేసి నరపాలుని నాజిని జయింపఁ బ్రయత్నించుటయు నాకాలమునఁ గాన్పింపకపోదు. రాజుల నెన్నుట ఋగ్వేదకాలములోఁ గూడ జరుగుచుండెడిదని కొందఱూహించుచున్నారు. ఇట్టియూహాలను బలపఱచు ఋక్కుల నిందుఁ బొందుపఱచుచున్నాము.



I. "ప్రజలు రాజును వరించునటులు వారలు (ఉదకములు) భయకంపమానులై వృత్రునినుండి విడిపోయి యచటచట నుండిరి." (ఋగ్వేద X 124, 8)

II. 'నిన్ను నీళ్ళనుండి (పక్షమున) వరుణుఁడు పిలుచుఁగాక; సోముఁడు నిన్ను పర్వతములనుండి (పక్షమున) పిలుచుఁగాక; నిన్ని ప్రజలనుండి (పక్షమున) యింద్రుఁడు పిలుచుఁగాక; నీవు డేగవై ప్రజల దగ్గఱకు శీఘ్రగమనము కలవాఁడవై రమ్ము'

"స్తోత్రము చేయఁదగిన గమనముగల యాకాశస్థదేవుఁడు పరరాష్ట్రమునందు బంధింపఁబడినట్టియు, నాహ్వానముఁ జేయఁదగినట్టియు నిన్ను నచటనుండి దీసికొనివచ్చుఁగాక; అశ్వినీదేవతలు నీ వచ్చుమార్గమును సుగమముగఁ జేయుదురుగాక; ఓసమానజన్మముగల బాంధవులారా! స్వరాష్ట్రప్రవేశము గావించిన రాజును సమక్షముననుండి సేవింపుఁడు."

"ఓరాజా! ఎల్ల జనులు నిన్నెల్లప్పుడును సేవింతురుగాక; ప్రతికూలమిత్రులును (శత్రువులును) విరోధమును విడిచిపెట్టి నిన్ను సేవింతురుగాక; ఇంద్రాగ్నులును, విశ్వేదేవులును, బ్రజలయందు నీక్షేమమును జేయుదురుగాక (నీక్షేమమునకు హాని కలుగకుండఁ గాపాడుదురు గాక)

"ఓరాజా! నీయొక్క స్వరాష్ట్రప్రవేశ విషయమగు నీపున రాహ్వానమునకు సమానబలము గలిగినట్టియుఁ, దక్కువ బలము గలిగినట్టియు నెవ్వాఁడు వివదించునో (అంగీకరింపకపోవునో) యట్టి వాని నింద్రుఁడు బహిష్కృతునిగఁ జేసి పిదప నిన్ను నీరాష్ట్రమునఁ బ్రకటించుగాక. (ఈతఁడే యీరాష్ట్రమునకు రాజని ప్రకటించుఁగాక.)

III. "పరాక్రాంతమైన రాజ్యము తిరిగి నీకు వచ్చినది. కనుక వర్చస్సుచేతను బ్రఖ్యాతుఁడవు కమ్ము. ప్రథమమునఁ బ్రజలందఱికిని పాలకుఁడవై, నిస్సపత్నుఁడవై విశేషముగఁ బ్రకాశింపుము. నిన్ను తూర్పు మొదలగు నన్నిదిక్కులును (అందుండు ప్రజలుగాని దేవతలుఁగాని) ప్రభువుగ నంగీకరింతురు గాక. ఈ నీ రాష్ట్రమునందుఁ బ్రభువుగ సేవింపఁబడి నమస్కరింపఁబడుదువు గాక.

"ఓ రాజా ప్రజలు నిన్ను రాజభావము కొఱకు (రాజుగ నుండుటకు లేక రాజ్యము చేయుటకు) వరియింతురుగాక. ఈతూర్పు మొదలగు దిక్కులైదును (మధ్య యనెడి దిక్కుతోఁ గూడ) బ్రకాశించుచున్నవై నిన్ను వరించుఁగాక. రాష్ట్రముయొక్క శరీరము నందునుమాపురమువలె నున్నతమగు స్థానమునందు (సింహాసనమందు) నుండుము. మఱియు నీవు పూర్ణమైన బలము గలవాఁడవై సేవకులమగు మాకు ధనము నిమ్ము.

"ఓ రాజా సమానజన్మము గలిగినటువంటి రాజు లాజ్ఞారూపమైన యాహ్వానముఁ గలవారై నిన్నభిముఖులై పొందుదురు గాక. నీచేతను బంపఁబడిన దూత యగ్నివలె సంచరించుఁగాక. భార్యాపుత్రాది బంధువులు సౌమనస్యముగలవారై యుందురుగాక. అధిక బలముగల నీవధికమగు పన్నును వచ్చినదానినిగఁ జూడుము. (అనఁగా నీవధికమగు పన్నును బొందుదువు గాక)

"ఓ రాజా నిన్నశ్వినీదేవతలును, మిత్రావరుణు లిరువురును నాహ్వానింతురు గాక. విశ్వేదేవులును, మరుత్తులును రాజ్యప్రవేశనమును జేయింతురు గాక. తరువాత నీయొక్క మనస్సు యాచకులకు ధనము నిచ్చునట్లుచేయుము.

"అత్యంతదూరదేశమునుండి యోరాజా స్వరాష్ట్రాభిముఖుఁడవై శీఘ్రముగ రమ్ము. స్వరాష్ట్రమును బ్రవేశించు నీకు ద్యావా



పృథివులు రెండును మంగళ కారిణులగుఁ గాక. నీరాక విషయమై యీ రాజగు వరుణుఁడు పూర్వమునందుఁ జెప్పినటులనె వచించుచున్నాఁడు. ఈవరుణుఁడు నిన్ను బిలుచుచున్నాఁడు. నీవు స్వరాష్ట్రమును బొందుము.

"ఓ యింద్రుఁడా! వరుణునితో (ఈ రాజుయొక్క యాహ్వాన విషయమున) నైకమత్యమును బొంది సమానజ్ఞానము కలవాఁడవైతివి. అట్టి యింద్రుఁడు నిన్ను రాజాయని పిలుచుచున్నాఁడు. ఆ రాజు రాష్ట్రమును బొంది యందున్నవాఁడై యింద్రాదులకు యాగములు చేయుచుఁ బ్రజలను దమ పనులయందు నియోగించుఁగాక.

"ధనము గలిగి యున్నట్టియు, మార్గమునకు హితమును గలుగఁజేయునట్టియు, ననేక ప్రకారములుగ నున్నట్టియు, వివిధాకారములు గలిగినట్టియు దేవత లందఱును నైకమత్యమును బొంది నీకు శ్రేయస్సును గలుగఁజేయుదురుగాక. ఆ దేవత లందఱును నైకమత్యమును బొంది నీకు శ్రేయస్సును గలుగఁజేయుదురుగాక. ఆ దేవత లందఱును నైకమత్యమును బొంది నిన్ను రాష్ట్రప్రవేశము కొఱకుఁ బిలిచెదరుగాక. వారలచేఁ బిలువఁబడిన నీ వీరాష్ట్రమున మంచి బలము గలవాఁడవై, సంతుష్ట మనస్కుఁడవై పదియవ దశ వఱకు నుండుము, (అనగా నూఱు సంవత్సరములు జీవింపుము.)

V "ఓ దేవతలారా! ఈ పురుషునకు శాసించుటయందు సూర్యాగ్ని హిరణ్యరూపము గల తేజస్సుండుఁగాక. ఈతనిసపత్నులు (ప్రత్యర్థులు) ఈ పురుషునికంటె నికృష్టులై యుందురుగాక. ఈ పురుషుని నుత్తమమైన స్వర్గమును బొందింపుఁడు."

"ఓ జాతవేదుఁడా! ఏ యుత్కృష్టమగు మంత్రముచే నింద్రుని క్షీరాదిహవిస్సులఁ బొందించితివో, యట్టి మంత్రముచేతనో యగ్ని

యీపురుషు నిచట (స్వస్థానమున) వృద్ధిని బొందింపుము. సమానులగు పురుషులమధ్యను నీ పురుషుని శ్రేష్ఠునిఁగ స్థాపింపుము."

"ఓ యగ్నీ! నీయొక్క ప్రసాదమువలన నీ శత్రువులయొక్క యజ్ఞమును, వర్చస్సును, ధనమును, బుష్టిని, మనస్సులను సంహారించుచున్నాను, (నా యధీనము చేసికొనుచున్నాను) కాన సపత్నులు (ప్రత్యర్థులు) మాకంటె నికృష్టులై యుందురుగాక. ఈ పురుషున కుత్తమస్వర్గము కలుగఁజేయుము.

VI "ఓ ఇంద్రా! నా సంబంధమగు నీ క్షత్రియుని వృద్ధిం బొందింపుము. ఈతని సంఘములలో శ్రేష్ఠునిఁగఁ జేయుము. ఈ రాజుయొక్క శత్రువుల నందఱను వ్యాప్తిలేనివారలనుగఁ జేయుము. ఆ శత్రువులను వీరలకు వశ్యమైనవారలఁగఁ జేయుము. నే నీతనినుత్తములలో నొక్కనిఁగఁ జేయుదును."

"ఓ యింద్రుఁడా! ఈ రాజును గ్రామమందును (జనసమూహములయందును) అశ్వములయందును, గోవులయందును సంతటను సంశ్లిష్టునిఁగఁ జేయుము. ఈ రాజుయొక్క శత్రుని గ్రామమునుండి విముక్తునిఁగఁ జేయుము. ఇతరరాజుల మూర్ధస్థానమునందు నీ రాజుండుఁగాక. ఈ రాజునకు శత్రువులనందఱ వశపఱుపుము. ఈ రాజు (సువర్ణ రజతాదులగు) ధనములకు స్వామి యగుఁగాక. ఈ రాజు ప్రజలకు స్వామి యగుఁగాక. ఓ యింద్రుఁడా! ఈ రాజునందు విశేషములగు గొప్పవియగు తేజస్సులను స్థాపింపుము. ఈ రాజుయొక్క శత్రువును నిస్తేజస్కునిఁగ నొనర్పుము.

"ఓ రాజా నీకు అధికోత్కర్షవంతుఁడైన యింద్రునిఁ గూర్చుచున్నాఁడను: ఎవ్వానిచేఁ బ్రేరేపింపఁబడి నీ భటులు శత్రుసేనను జయించుచున్నారో, యెవ్వాఁడు నిన్ను జనులలో సర్వో



త్కృష్టునిఁగఁ జేయుచున్నాఁడో, మను వంశీయులగు రాజులలో నెవ్వాఁడు నిన్ను శ్రేష్ఠునిఁగ నొనర్చుచున్నాఁడో సర్వోత్కర్షవంతుఁడైన యట్టి యింద్రుని నీకుఁ గూర్చుచున్నాఁడను.

ఓ రాజా నీవు సర్వోత్కృష్టుఁడ వగుము. నీకు శత్రువులై యెవరు ప్రతికూలత నాచరించుచున్నారో వా రందఱును నీకంటె నికృష్టు లగుదురుగాక. ప్రధానుఁడవై స్నేహితుఁడగు నింద్రునితోఁ గూడి శత్రువులను జయించుచు శత్రుత్వమును వహించువారి భోగసాధనములగు ధనములను నీవు హరింపుము.

VII ఇతర దేశపు రాజులను, రాజకర్తలను, సూతులను, గ్రామణులను, నోపర్ణమా, నాచుట్టును సేవించుటకు వచ్చి కూర్చుండువారినిగఁ జేయుము."

రాజు నెన్నుకొనువారిలో ముఖ్యులుగ రథికులును, గ్రామణులును, శతపథబ్రాహ్మణంబునను నథర్వవేదంబునను బేర్కొనఁబడుచున్నారు.

పై నిరూపింపఁబడిన వేదవచనములంబట్టి ఋగ్వేదకాలములో నయితము రాజు లెన్నుకొను నాచారము దేశమున నుండెడిదని స్పష్టమగుచున్నది.

పంచగారు జాతకమును, తెలపత్తజాతకమును, జాతక కాలములోఁగూడ దేశమున రాజు నెన్నుకొనుట గలదని సూచించుచున్నవి. ఈ యాచారము పురాణకాలములోఁగూడ నుండెనని చెప్పవచ్చును. మహాభారతము శాంతిపర్వము 67 అధ్యాయములో మొదటిరాజు ప్రజలచే నెన్నుకొనఁబడినట్లు చెప్పఁబడినది. రామాయణములో నయోధ్యాకాండమున 'దశరథ భూపాలుఁడు రాముని యువరాజుగాఁ జేయఁగోరునపుడు,

"శ్లో॥ నానానగరవాస్తవ్యాన్ పృథగ్జానపదానపి।
సమానినాయ మేదిన్యాః ప్రధానాన్ పృథివీపతిః ॥"
"తస్యధర్మార్థవిదుషో భావమాజ్ఞాయసర్వశః।
బ్రహ్మణాబలముఖ్యాశ్చ పౌరజానపదైస్సహ ॥"

అని చెప్పఁబడినది. రెండవశ్లోకమువలన రాజు నెన్నుటకై సమకూర్పఁబడిన సమితియందు బ్రాహ్మణులును, బలముఖ్యులును, సామంతప్రభువులును, ముఖ్యులై యుండెడి వారని నిశ్చయమగుచున్నది. ఇట్టి కార్యమునకై రావింపఁబడిన సమితిసభ్యు లధికారహీనులై యుండక శక్తియుక్తులై యుండెడివా రనునది యీక్రిందనుదాహరింపఁబడిన శ్లోకమువలన స్పష్టమగుచున్నది.

"శ్లో॥ యదిదంమేనురూపార్థం మయాసాధుసుమంత్రితమ్।
భవంతోమేను మన్యంతాంకథంవాకరవాణ్యహమ్ ॥"

ఇట్టి సభ్యులు రాజకారకులని రామాయణమునఁ జెప్పఁబడినది. దశరథమహారాజు మృతినొందిన పిదప రాజకారకులు రాజు నెన్నుకొనుటకై సమకూడిరఁట.

"శ్లో॥ వ్యతీతాయాంతుశర్వర్యామాదిత్యస్యోదయేతతః।
సమేత్యరాజకర్తారః సభామీయుర్ద్విజాతయః ॥"

అందులోఁ గొందఱిక్ష్వాకువంశము వాఁడొక్కరుఁ డాదినమున నే రాజుగ నెన్నుకొనఁబడవలెనని చెప్ప వసిష్ఠుఁడు రాజ్యము భరతునకు బ్రదత్తంబై యుండుటచే భరతుని రావింపవలెననియు నాతఁడు వచ్చువఱకును బ్రజలు వేచియుండవలసిన దనియును సభ్యులకు నివేదించెను. వారందులకు నల్లెయనిరి. రామాయణమునందు,

"శ్లో॥ కాలధర్మంగతేరామ......సగరేప్రకృతిజనాః।
రాజానంరోచయామాసురంశుమంతంసుధార్మికమ్ ॥"



మహాభారతమువలనను రాజునెన్నుకొను నాచారము దేశమున నుండెడిదని నిశ్చయమగుచున్నది. ప్రతీపుఁడను రాజు దేవాపియను తనపుత్రుని రాజ్యాభిషిక్తునిఁగ నొనర్పంబూనినఁ బ్రజలాతని నటులు చేయనీరైరి.

"శ్లో॥ అథకాలస్యపర్యాయే బుద్ధోనృపతిసత్తమః।
సంభారానభిషేకార్థం కారయామాసశాస్త్రతః ॥
మంగలార్థాని సర్వాణికారయామాసవై విభుః।
తంబ్రాహ్మణాశ్చబుద్ధాశ్చపౌరజానపదైస్సహ ॥
సర్వేనివారయామాసుః దేవాపేరభిషేచనమ్।
సతచ్ఛృత్వాతునృపతిః అభిషేకనివారణమ్।
అశ్రుకంఠోఽభవద్రాజా పర్యశోచతచాత్మజమ్।
ఏవంవదాన్యోధర్మజ్ఞః సత్యసంధశ్చసోఽభవత్।
ప్రియః ప్రజానామపి సత్వగ్దోషేణదూషితః ॥
హీనాంగం పృథివీపాలం నాభినందంతిదేవతాః ॥
ఇతికృత్వానృపశ్రేష్ఠం ప్రత్యషేధన్ ద్విజర్షభాః ॥"

రాజు నెన్నుకొను వాడుక వేదకాలములోవలెఁ బురాణకాలములోఁగూడ నుండెనని పైని జెప్పంబడిన వచనములవలన నిశ్చితమగుచున్నది.

దీఘనికయంబునను రేణుఁడను రాజకుమారుఁడు రాజకారకులు తన్నభిషిక్తునిగ నొనర్చినఁ దనమిత్రుల కుపాయనంబుల నొసంగెదనని వాగ్దానమొనర్చెనఁట. బ్రాహ్మణబౌద్ధవాఙ్మయముల వలననే గాక శాసనముల వలనను నిట్టి యాచారము పూర్వముండెడిదని తెలియుచున్నది.

కాశకుడి శాసనములలోఁ బల్లవరాజైన నందివర్మ ప్రజలచే నెన్నుకొనఁబడెనని యున్నది. ఖాలింపూరు శాసనములోఁ బాలవంశస్థాపకుండైన గోపాలుండను రా జెన్నుకొనబడెనని "మాత్స్యన్యా

యమపోహితుంప్రకృతిభిర్లక్ష్మ్యాః కరంగ్రాహితః। శ్రీగోపాల ఇతిక్షితీశ శిరసాం చూడామణి స్తత్సుతః'' అను వచనమువలనఁ దెలియుచున్నది. "సర్వవర్ణైరభిగమ్యరక్షణార్థం పతిత్వేవృతేన " అను గిర్నారు శాసనమువలన (150 హూణశ॥) రుద్రదాముఁడనురాజు ప్రజలచేనెన్నుకొనఁబడెననియు దెలియవచ్చుచున్నది.

ఉపరాజులు తమ్ముఁ దొలఁగించి రాజ్యాక్రమణంబుం జేయుదురను భయము రాజులకుం గలుగుచుండెడిది. సుచ్చజజాతకంబున రాజు నిజపుత్రుండైన యుపరాజునుగని తనకతఁడు హానిచేయునేమోయని భయముపడి యాతని దూరదేశమున నుంచెననియున్నది. జాతకకథలలో నధికముగ నిటుల నుపరాజులను దూరదేశముల కంపుట కాన్పింపదు. ధుసజాతకంబున షోడశవర్షీయుండగు రాజకుమారుఁడు రాజ్యాభిలాషచే జనకుని రాజ్యమునుండి తొలఁగింపఁబ్రయత్నించెను. కాని రాజాతనిఁబట్టి చెఱసాలయందుంచెను. పితృమరణానంతరమునఁ బ్రజలాతనిఁ గారాగృహమునుండి విడిచిపుచ్చి రాజ్యాభిషిక్తునిఁగ నొనర్చిరఁట. రాజబంధువు లేరీతిగ రాజ్యపరిపాలనములో నెంతవఱకుఁ బాల్గొనుచుండెడివారో తెలియరాకున్నది. దేవధమ్మజాతకములో నరపాలుఁడు కనిష్ఠసోదరుని నుపరాజుఁగ నియమించి సవతితమ్ముని సేనాపతిఁగఁ జేసెనని చెప్పఁబడినది.

అభిషేకసమయంబున రాజచిహ్నపంచకము గలిగి మణిరాశిపై రాజు సుఖాసీనుండై యుండఁ బురోహితుం డాతని నుదకముచే నభిషేచనంబుఁ గావించునని తెలియుచున్నది.

జాతకకథల వలన నభిషేకమునకు వేసాలీపట్టణముననుండిన సురక్షితంబగు తటాకంబునుండి నీటినిగొని తెచ్చువాడుక యుండెనని చెప్పంబడుటచే వేసాలీపట్టణ ప్రాంతముననుండు రాజుల యభిషేకమున నాతటాకోదకములుపయోగింపఁబడు చుండెడి వని మన



యూహింపవచ్చును. రాజ్యాభిషేకసమయంబున సువర్ణమయంబగు కలశలనుపయోగించు చుండెడివారని జాతకములలోఁ జెప్పంబడినది. ఆసమయమున దక్షిణావ్యావర్తనంబుఁ గల శంఖంబులు మూఁడింటి నుదకముతో నింపి యభిషేకములో నుపయోగించుచుండెడివారు. (పుస్త. IV పు. 220) మఱియు రాజు నభిషిక్తునిఁగ నొనర్చునపుడు డుంబరదారు నిర్మితాసనమును రాజసింహాసనముగ నుపయోగించుచుండెడివారు. (పుస్త. IV పు. 220). మహాహంసజాతకంబువలన రాజసింహాసనంబులు హేమనిర్మితంబులై, యష్టపాదయుక్తంబులై, కాశీదేశీయ వస్త్రాచ్ఛాదన శోభితంబులై యుండెడివని స్పష్టమగుచున్నది.

భార్యలలో నొకతెను బట్టమహిషిఁ జేయునపు డట్టియాపెను మణిరాశిపైఁ గూర్చుండఁబెట్టి యభిషేకముఁ జేయు వాడుకయుండినటులు భద్దసాలజాతకంబువలనఁ దెలియవచ్చుచున్నది.

అభిషేకము జరిగినవెనుక రాజు చతురంగబలయుతుండై యమాత్యులతోఁ గూడ నాభరణాలంకృతంబగు భద్రగజంబు నధిరోహించి యూరేగుటయు జాతకకథలలో ననేకస్థలములందుఁ జెప్పఁబడినది. దేవాలయములోఁ బ్రదక్షిణము చేయునపు డెటులఁ గుడివైపునకుఁ దిరుగుచుందురో యటులనే యూరేగింపుసమయములందును గుడివైపు రాజు లూరేగింపఁబడుచుండెడివారని తెలియ నగును. ఊరేగుటయయినపిదపఁ బ్రాసాదంబుసొచ్చి సింహాసనారూఢుండై రాజు, బంధువులు, నమాత్యులు, సేనాధిపతులు మున్నగువారల కుచితస్థానముల నిర్ణయించి కొలువుదీర్చు నాచార మగపడుచున్నది. పేరోలగంబున, రాణియు రాజునకుఁ గుడిప్రక్కఁ నాసీనురాలై యుండు నాచార ముండెడిదని (పుస్త. V పు. 197) తెలియవచ్చుచున్నది.

ఇట్టి యుత్సవసమయంబులఁ బ్రజలెటులు రాజమందిరములను బ్రాసాదములను బట్టణములను నలంకరించుచుండిరో మహాజనజాతకంబున వర్ణింపఁబడినది. రాష్ట్రములోని యన్నిభాగములనుండియుఁ బ్రజలు రుచ్యంబులగు వివిధభక్ష్యపానీయంబులతో రాజనగరమును బ్రవేశించి ప్రాసాదకుడ్యంబులఁ బిష్టపంచాంగుళంబులతోఁ జిత్రించి మాలలచే రాజమందిరంబుల నలంకరించి లాజగంధద్రవ్యపుష్పాదికముల నగ్నియందుంచి తదుద్ధూతధూమంబులచేఁ బ్రాసాదంబు చీఁకటులు గ్రమ్మునటుల నొనర్తురు. అట్టిసమయంబుల మృదువైనవియుఁ గఠినంబులైనవియు నగుభక్ష్యంబులను నానావిధఫలపేయంబులను నుపాయనంబులుగ జనులు తమ యేలికకు సమర్పించుచుండెడివారు. రాజ్యాభిషేకసమయములఁ బ్రజావినోదములకు నాట్యప్రదర్శనంబులు జరుపఁబడుచుండెడివని సత్తలేనిపాతకజాతకంబు వలనఁ దెలియుచున్నది. రాజనగరవర్ణనము విదురపండితజాతకమున విపులముగఁ గావింపఁబడినది. పుణ్యకుండను యక్షుండొకఁడు ధనంజయుని కొకయద్భుతంబగుమణిని గనఁబఱచి యందుఁ గన్పట్టువింతల నీరీతి వర్ణించెను.

“ఓ నరపుంగవా! అతులంబగు నీమణిం గనుఁగొనుము. అందు స్త్రీపురుషమృగపక్షి నాగరాజ సుపర్ణుల దేహంబులు చిత్రితంబులైయున్నవి.”

“గజాశ్వరథ పదాతియుక్తంబగు చతురంగబలం బదిగో నీమణియందుఁ జిత్రితంబైయున్నది. గజారోహులు, రాజరక్షకులు, రథంబులనుండి యుద్ధముంజేయు యోధులు, పదాతులై సమరం బొనర్చు యోధులును, వ్యూహంబులందీర్చియున్న యోధులును, మణియందుఁ జిత్రితులైయున్నారు కనుంగొనుము !



“సువృథసంస్థాపనంబులు గలిగి బహుద్వార యుక్తంబులగు ప్రాకారంబులచేఁ బరివేష్టితంబై మనోరంజకంబులగు శృంగాటకంబులు గలిగిన పట్టణం బీమణియందుఁ జిత్రితంబైనది గనుంగొనుము. మఱియు స్తంభములును, బరిఖలును, నర్గళబంధంబులును, రక్షోత్సేదంబులును, ద్వాధంబులును నున్నవి, చూడుము.”

“ద్వారపథంబులయందుఁగల హంస, సారసమయూర, చక్రవాక, కురరీ, కోకిల, బిందులాంఛిత గాత్ర యుక్తజీవంజీవక పక్షికులంబు లీమణియందుఁ జిత్రితంబులైయున్నవి.”

“మహాప్రాకార పరివేష్టితంబై పతాకాశోభితంబై హైమసికతంబులు గలిగి చూపఱనాశ్చర్యముచేఁ బులకితాంగుల నొనర్చు నీ విస్మయావహంబగు పత్తనంబును గనుంగొనుము.”

“అందాశ్రమ ప్రకోష్ఠములును, జత్వరోపేతంబులగు వివిధగృహంబులును, నవ్వానిమధ్య రాజపథంబులును, నవరుద్ధసంకటపథంబులును జిత్రితంబులైనవి గనుంగొనుము.”

“పానగృహంబులు, పథికాశ్రమంబులు, వధ్యస్థానంబులు, పాకాపణంబులు, స్వైరిణులు, గణికలు, మాలాకారులు, రజకులు, జ్యౌతిషికులు, వస్త్రంబులనమ్ము వణిజులు, బంగారుపనివాండ్రు, మణికారు లీమణియందుఁ జిత్రితులై యున్నారు, కనుము. భేరీమురజ శంఖ కర్దోదరానక నానావిధ ఝల్లకంబు లీమణియందుఁ జిత్రితములై యున్నవి. ఝల్లరీవిపంచికాతూర్యంబులును సుకృతనాట్యగాన విశేషంబులు నీమణియందుఁ గాన్పించుచున్నవి.

“ప్లవకులును, నైంద్రజాలికులును, మల్లురును, రాజవైతాళికులును, నావితులు నీమణియందుఁ జిత్రితులైరి చూడుము.”

“స్త్రీపురుషసమూహములు శ్రేణీశ్రేణులుగ నాసీనులై యున్నటులఁ గన్పడుచున్నది చూడుము. జనసమూహములలో ద్విగుణిత

హస్తతాడనంబుఁ గావింపుచు మల్లురయుద్ధంబును, నాయుద్ధములో జయముగాంచినవారును నోడినవారును గన్పట్టుచున్నారు. పర్వత నితంబంబులపై వివిధమృగ, సింహ, వ్యాఘ్ర, వరాహ, భల్లూక, తరక్షు, వృక, ఖడ్గమృగ, మహిష, రోహిష, రురు, కురంగ, చిత్ర మృగ, మార్జార, శశాదిజంతు సమూహంబులు చిత్రితంబులైనవి చూడుము. మఱియు నిందు నాలుగువిక్కలను బక్షికుల శోభితంబులై దీర్ఘశాల్కల యుక్తమత్స్యపూరితంబులైన సరోవరంబులు చిత్రితంబులై యున్నవి, ఇదిగో చూడుము" సుమేధునికథలోఁ గొంత వఱకు నమరయను పురివర్ణనంబుఁ గావింపఁబడినది. ఆపురవర్ణనంబు ప్రబంధములయందలి పురవర్ణనంబుల ననుసరించుచుండినను బూర్వ మహానగరంబుల విశిష్టవిషయములు యథార్థముగను నతిక్లుప్తముగను గొలఁదిమాటలతో నందుఁజూపఁబడినవి. అనేకయుగంబులకుఁ బూర్వ మమరయను పట్టణము మిక్కిలి మనోహరముగను సౌఖ్యముల కాటపట్టుగను నుండె. అద్యది సుఖానుభవప్రదానాహ్వానదశకధ్వని పూరితంబై యుండి భోజనపానీయంబులతో నిండియుండె. గజాశ్వశంఖ మృదంగధ్వనులతోడను "భోజనపానాదులం జేయుఁడు" అనుచునాహ్వానించువారల ధ్వనులతోడను నాపట్టణంబు ప్రతిధ్వనించుచుండెను. సర్వవిధముల సంపూర్ణంబై యుండి సర్వశిల్పములకు నాటపట్టయి సప్తవిధమణి పూరితంబై యన్యదేశీయులగు వర్తకులతో నిండియుండెను."

పై నుదాహరింపఁబడిన వచనములంబట్టి యాకాలమునను బశువుల వధియించుటకుఁ బ్రత్యేకముగ సూనాగారము లేర్పఱుపఁబడుచుండెడివనియును దుకాణములందు బజారులలో మిఠాయులమ్మఁబడుచుండెడివనియును స్పష్టము. ప్రజలు చూచి సంతోషించుటకై మల్లయుద్ధేంద్రజాలాది ప్రదర్శనములు జరుగుచుండెడివనియును నట్టి



ప్రదేశముల జనులు సుఖులై కూర్చుండియుండుటకు నాసనంబులు నిర్మింపఁబడుచుండెడివనియును స్పష్టము. గజాశ్వాది ఘోషములంబట్టి రాచనగరులందే చతురంగబలంబులుకూడ నుండెడివని మన మూహింపవచ్చును. క్రీడావనంబులతోడనో మఱియేవస్తువులతోడనో చతుష్పథంబులు రమ్యంబులుగ నొనర్పఁబడి ప్రజల వినోదార్థముగ నచట గానంబులును జరుపఁబడుచుండెడివి.

నగరంబులలో రాజులును ధర్మచింతగల ధనికులును భిక్షాదానగృహంబుల నిర్మించుచుండెడివారు. మఱియుఁ బట్టణములందును బల్లెలయందును బాంధులకొఱకువిశ్రాంతిగృహంబులు నిర్మింపఁబడి యందుఁ గూర్చుండుటకును నిదురం బోవుటకును బల్లలు మొదలగునవి యుంపఁబడెడివి. ఇట్టివిశ్రాంతిగృహములదగ్గఱ స్నానాదులకై తటాకాదులం ద్రవ్వించి నరులు బాటసారుల కెన్నియో విధముల నుపాయముల నొనర్చుచుండెడివారు.

## ౬

### క్షత్రియులు - నరపాలురు

బ్రాహ్మణవాఙ్మయమున బ్రాహ్మణుఁడెటులు వర్ణములలో నగ్రస్థానంబులనుండి నటులఁ బరిగణింపఁబడుచుండెడివాఁడో యట్లే పాళీవాఙ్మయమున నరపాలుఁడు మనుజులలో నధికుఁడుగ నెన్నుకొనఁబడుచుండెడివాఁడని పూర్వాధ్యాయములలో వ్రాసితిమి. బ్రాహ్మణవాఙ్మయములోఁ గూడ బ్రాహ్మణులు రాజు ననుసరించి చనుచుండురని చెప్పంబడిన సూత్రము పూర్వాధ్యాయమున నిరూపింపఁబడినది. ఈభూపాలకాధిపత్యము బ్రాహ్మణోద్దేశ విరుద్ధమైనటులు

గానరాదు. పూర్వపు హైందవపురాణంబులలోవలె జాతకంబులలోఁ గూడ బ్రాహ్మణసంఘము రాజులను వశీకరింపలేదు. అకుంఠితాధికారము గలిగి క్షాత్రశక్తియుక్తుండైన నరపాలు ననుసరించి చనియే బ్రాహ్మణులు ధనాదుల నార్జించుచుండెడివారు. ఆకాలమున రాజులకు వశ్యులై బ్రాహ్మణులుండెడివారని మనము దృఢముగఁ జెప్పవచ్చును.

అత్యధికవైభవోపేతులై యుండెడి రాజులు ప్రబలులై యత్యధికశక్తియుక్తులై యకుంఠితాధికారముతోఁ బ్రవర్తించుచుండెడివారనుట నిశ్చయము. బ్రాహ్మణవాఙ్మయమున నరపాలురు బ్రాహ్మణులకు వశ్యులైయుండినటులు గీర్తింపఁబడినను వారలు విశేషాధికారము గలిగి బ్రాహ్మణాధికారమునకు లోనుగాకయే రాజ్యపాలనం బొనర్చుచుండెడివారని యూహింపవలసియున్నది.

కొన్ని జాతకకథలలో రాజు పురోహితులకు వశ్యుఁడై ప్రవర్తించుచుండినటులుఁ జెప్పఁబడినను నయ్యవి సామాన్యపరిస్థితులం దెలియఁజేయుటలేదని యూహింపనగును.

సాధారణ గృహస్థులకువలె నరపాలురకును సామాన్యధర్మములు విధింపబడినవి. జాతకకథలలోఁ జెప్పఁబడిన దశరాజధర్మంబులట్టివియే. "దానంబును, ధర్మంబును, అనుతాపంబును, శీలంబును, మార్దవంబును, శాంతియు, దయయు, క్షమయు, భూతానుకంపయు, కళంకరహితంబగు సద్వృత్తియు," అను నివియే దశరాజధర్మంబులుగఁ బరిగణింపఁబడుచుండెడివి.

తెశకునిజాతకంబున రాజధర్మములును రాజవిధులును నిరూపింపఁబడినవి. వీనింబట్టిచూచిన రాజధర్మములకును, సామాన్యగృహస్థధర్మములకును భేదంబేమియుఁ గానరాదు. ఈధర్మములు బౌద్ధ



మతావలంబకులగు సామాన్యగృహస్థులకు విధింపఁబడిన ధర్మములని చదువరులు గుర్తెఱుంగవలెను.

"ప్రభూ, నరపాలకుఁడు సత్యంబులఁ బాటించుచు ధర్మంబుగఁ బరిపాలనంబుఁ జేయవలయు. భూపుఁడు కోపాసత్యదర్పంబులఁ బరిత్యజింపవలయును. కామరాగపాపంబులచే సత్పథభ్రష్టుండై సంచరించు నరుఁడు నిజదుష్కృతంబుచేఁ దరువాత విలపించును. రాజలసశీలుండై పరిపాలనం బశ్రద్ధతోఁ గావించిన నపయశమును బొంది సిరిని గోల్పోయి దుఃఖమును బొందును. సోత్సాహుండును, ప్రజ్ఞాయుక్తుండును, ధైర్యశాలియు, నసూయారహితుండును నగు నరుని మేమెల్లెడలఁ బ్రేమింతుము"

"దుర్దైవము శ్రీవిధ్వంసనంబుఁ గావించుచుఁ గఠిన హృదయులును నసూయాపరులును నగు దుష్టులను బ్రేమించును. ఓ రాజా! అందఱకును మిత్రుండవై యుండుము. అందఱు నీ శ్రేయస్సు నభిలషించుచు దానిరక్షించుటకై పాటుపడుచుందురు."

"ధర్మాచరణపరాయణుండవై యెట్టి నిర్బంధనములకు లోనైయున్నను బాపంబులగు కార్యంబుల నాచరింపకుము. పుణ్యకార్యములం జేయుటయందు శ్రద్ధాళుండవై యనవరతము వర్తిల్లుము. అలసశీలుండైన వాఁడానందము బొందనేరఁడు."

"రాజధర్మములు రెండుమాటలలోఁ జెప్పనగును. ఓ నరేంద్రా! అవధరింపుము. కలిగియున్నదాని సంరక్షించుకొనుచు, లేని దాని నార్జించుకొనుచు నీ శ్రేయస్సును సమముగఁ గనిపెట్టఁగలిగిన ప్రాజ్ఞులను మంత్రులుగ నియమించికొని పానద్యూత క్రీడాదిదుర్వ్యసనంబులఁ బరిత్యజించి జీవింపవలయును. తన్ను, తన ధనసంచయంబులను రథనియంతవలె జాగ్రత్తతోఁ గాపాడుకొనఁగలిగినవాఁడు రాజ్యమును హానిలేకుండఁ బాలింపఁగలఁడు."

“మితిమీఱకుండ విధేయులుగ నుండునటులఁ బ్రజలను బాలించుచు నీకుండు ధనములలెక్క సరిగ నుంచుకొనుము. ఋణాదులం గూర్చి పరులనెవ్వరిని నమ్మకుము. నీకు లాభనష్టములం గలిగించు కృతాకృతకార్యములం దెలిసికొనుము. నిందార్హులగు వారల నిందించుచు నీయనుగ్రహపాత్రులగు వారలపై దయ నుంచుము.”

“ఓ మహారాజా! నీవే స్వయముగ సత్కార్యములం జేయుటయందుఁ బ్రజలను శిక్షితులుగ నొనర్పవలెను. అటులఁ జేయకుండిన నీరాజ్యంబు దుష్టామాత్యులకు వశంబై నాశముం జెందును.

“అత్యధికరభసంబున నీవుగాని నీ సేవకులుగాని కార్యములం జేయరాదు. అతిత్వరితముగఁ గార్యములం జేయు మూఢుండు దుఃఖమును బొందు”

“అతికోపంబునకు లోఁబడకయుండవలెను. కోపశీలుండైన రాజు నాశనముం జెందు. అతిక్రోధంబువలన నావఱకు విఖ్యాతి నొందిన యభిజాతకుటుంబములు దుర్గతిం జెందుచున్నవి.”

“హానిగల్గునటులఁ బ్రజలను నీవసత్పథంబునఁ బ్రవర్తింపఁజేసిన, వారు కష్టసముద్రమున మునుంగుదురు. రాజమితభోగపరాయణుండై యుండిన సిరినిఁ గోల్పోయి నిందాభాజనుండగు.”

“సర్వపుణ్యకర్మాచరణదక్షుండవై యుండి, యతిప్రవృత్తి నెల్లపుడును వర్జించి భోగములనభిలషింపక పుణ్యంబు ననుసరించుచుండవలయును. పాపంబు దుఃఖంబును గలుగఁజేయును.”

“ప్రపంచమున గొప్పవారలలో నీపంచశక్తులును దఱచుగఁ గన్పడుచున్నవి. అందధమంబైనది దేహబలము. దీనికంటెఁ గొంచెము శ్రేష్ఠమైనది ధనశక్తి. ఇంతకంటె శ్రేష్ఠమైనది మంత్రశక్తి. దీనికంటెఁ గొంచెము శ్రేష్ఠమైనది జాతిశక్తి. అన్నిటిలో నుత్తమమైనది ప్రాజ్ఞతవలనఁ గలుగు బలము.”



“విద్యాధికుండైన నరుఁడు ప్రాజ్ఞుండై జయమును బొందు. అధికశ్రీమంతంబైన రాజ్యంబు బుద్ధిహీనుండగు నరునకు సమకూడినను నింకొకరు బలవంతముగా నద్దాని నాక్రమించును.”

“ఎంత యుత్తమకులసంభూతుండైనను రాజు పరిపాలన విధానమున మూఢుండై యుండెనేని యట్టివాని కాత్మరక్షణ కార్యంబైనను గష్టతమంబై యుండు.”

“అశ్రద్ధతోఁ గార్యముల నాచరించువారు వివేకవంతులు కానేరరు. అటులు గాకుండ నరుఁడు వివేకవంతులయొక్కయు ధార్మికులయొక్కయు నుపదేశములం బొందుచుండవలె. అట్టి యుపదేశంబులం బొందనివాఁడు మూఢుండై యుండును.”

“ఎవ్వాఁడు ప్రాతఃకాలంబుననే మేల్కాంచి వివిధవిధుల శ్రద్ధతో నాచరించునో యట్టివాఁడు నిశ్చయముగ జయముం గాంచును.”

“హానికరములగు కార్యములం జేయుచుండినను, నుత్సాహవర్జితుండై కార్యముల నాచరించుచుండినను నరుండల్పసుఖములనైనఁ బడయనేరఁడు.”

“ధర్మంబును యుక్తంబును నగు మార్గంబు నెవ్వాఁడు శ్రద్ధాళుండై యనుసరించునో యట్టివాఁడు తాఁ జేయు కార్యమునం దత్యధికప్రవీణత సంపాదించును.”

“ఆత్మీయంబగుదాని రక్షించుకొనుట విశిష్టలాభమును బొందుటవంటిది. పైనిజెప్పిన విషయములను లెస్సగ మనమున నిడుకొనుము. మూర్ఖుండసమ్యఙ్నిర్మిత గృహంబుమాడ్కి కూలఁబడి నాశనముం గలుగఁజేసికొనును.”

ఈరీతిగనే రాజధర్మములగూర్చి మహాహంస జాతకంబునను బ్రసంగింపఁబడెను. హంసరాజు సంయముఁడను బార్థివునిట్లు ప్రశ్నించెను.

"ఓ రాజా! అనామయుండవై సుఖముగ నున్నాఁడవా? నీ రాజ్యంబు సుఖభూయిష్ఠంబై యున్నదా? నీవు ధర్మముతో రాజ్యమును బాలించుచున్నావా?

"ఓ రాజా! నిష్కళంకులును, ననిందితులును నీకీర్తిసంపదలకై ప్రాణములనైన ధారవోసెడువారునునగు సత్తములు, నీకు మంత్రులై యున్నారా?

"సుజాతియు, సుభాషిణియు, రూపవతియు, యశస్వినియు, సంతానవతియునగు నీ భార్య నీ యాజ్ఞానువర్తినియై నీకోర్కెల నెరవేర్చుచుండునా?"

"నీ రాజ్యంబు పీడారహితంబై సుఖవంతంబై యుండ నీవు దాని నవిహితపాలనంబుఁ గావించుట లేదుగదా?"

"ఖలులను, నాతతాయులను, దుండగీడులను, రాజ్యబహిష్కృతులుగను, బుణ్యాచారముకలవారలను గౌరవపదాలంకృతులుగను నొనర్చి దుష్టమార్గంబుల విడనాడి సత్పథముల ననుసరించి రాజకార్యములం జేయుచున్నావా?"

"జీవితావధిని గుర్తెఱింగి యల్పబుద్ధులగు వారిని తెలిసికొని నివర్తించుచున్నాఁడవా? లేక యున్మత్తుండవై పరలోకభయమేమియు లేక సంచరించుచున్నాఁడవా?"

"దానంబును, ధర్మంబును, ననుతాపంబును, శీలంబును, మార్దవంబును, గాంతియు, దయయు, క్షమయు, భూతానుకంపయుఁ, గళంకరహితంబగు సద్వృత్తియు, నను దశరాజధర్మముల యందు దృఢముగ మనమును నిలిపి జీవితపరమావధిని లెస్సగ గుర్తెఱింగి జీవితాస్థిరతాజ్ఞానయుక్తుండనై జీవించుచున్నాఁడను," అని యానృపాలుఁడు పక్షిరాజమునకుఁ బ్రత్యుత్తర మొసంగెను.



ఈ దశగుణంబులును గౌటిల్యార్థశాస్త్రంబున రాజు కలిగియుండవలెనని యున్నది. దానంబును, సౌశీల్యంబును, ధర్మపాలనమును, నిష్పక్షపాతితయు నరపాలునకుండవలసిన గుణంబులుగఁ బరిగణింపఁబడుచున్నవి.

నరపాలురును నిట్టిగుణములు గలిగియుండుటకుఁ బ్రబలప్రయత్నములు సలుపుచుండెడివారని నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేకపోయినను నశోక చక్రవర్తిశాసనములను నా సార్వభౌమశ్రేష్ఠుని చరితమును మనము పరిశీలించి చూడఁగా నీబోధలు దేశమునఁ బ్రాబల్యమును జెందుచుండెడివని యూహింపవచ్చును. ఇట్టివిశిష్ట గుణయుక్తులగు సార్వభౌములలో నశోక చక్రవర్తి యగ్రగణ్యుండని దృఢముగఁ జెప్పనగును.

రాజులు ధర్మపారాయణులై యుండినఁ గాని రాజ్యము వృద్ధి నొందదనియుఁ బ్రజలు దుఃఖభాజనులై కష్టముల పాలగుదురనియు ననేకస్థలముల జాతకథలలోఁ జెప్పఁబడినది. రాజోవాద జాతకం బిందులకొక దృష్టాంతము.

బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించునపుడు బోధిసత్త్వుఁడొక బ్రాహ్మణ కుటుంబములో జనించెను. యుక్తవయస్కుండైన పిదప నాతఁడు కళలలోఁ బ్రావీణ్యముఁ జెంది సన్న్యసించి హిమాలయ పర్వతములలో నొకరమణీయంబగు ప్రదేశమునఁ గందమూలఫలాశనుండై జీవించుచుండెను. ఆకాలమున దేశము నేలు నరపాలుండు దన లోపమును దెలిసికొనయత్నించి వానిం జెప్పువాని నన్వేషించుచుఁ బర్యటించుచుండెను. గృహములలోఁగాని, గృహములబహిర్భాగములందుఁగాని, పట్టణములలోఁగాని, పట్టణబహిర్భాగములందుఁగాని తన లోపములనెంచి చెప్పువానిఁ గనుంగొనలేరక జనపదంబునఁ బ్రజ లేమనుకొనుచుందురో తెలియఁగోరి మాఱువేషమును ధరించి

దేశమునంతటిని దిరుగుచుండెను. తుదికి హిమాలయప్రాంతకాంతారములం జొచ్చి తిరిగితిరిగి బోధిసత్త్వుని పర్ణశాలంజేరి యాతనికి నమస్కరించి స్నేహభావంబున సల్లాపంబులాడి యొకప్రక్కను గూర్చుండి యుండె. ఆసమయంబున బోధిసత్త్వుఁడు వనములనుండి తెచ్చిన పక్వఫలములను భుజించుచుండెను. శర్కరవలె నయ్యవి మధురంబులై యుండెను. ఆసమయంబున వారిరువురకు నీరీతి సంభాషణము జరిగెను.

బోధిసత్త్వుఁడు:—"ఓ మహారాజా! పక్వంబగు ఫలమును భుజించి యుదకంబును ద్రాగుఁడు."

రాజు—ఓ పూజ్యుఁడా! ఎందుల కపక్వఫలంబు మధురంబై యున్నది?

బో—ఆర్యా! నరపాలుఁడిపుడు ధర్మంబునఁ బరిపాలనం బొనర్చుచున్నాఁడు అందువలన నిదిమధురంబై యున్నది.

రాజు—పూజ్యుఁడా! అధార్మికుండగు క్షితీశుఁడు పరిపాలనం బొనర్చుకాలములో నీఫలము మాధుర్యమును గోల్పోవునా?

బో—ఆర్యా! అధర్మశీలురగు నరపాలురు రాజ్యమునేలు కాలములోఁ దైలంబును, మధువును, గందమూలఫలంబులును మాధుర్యమును గోల్పోయి రుచిహీనములై యుండు. ఇంతియకాక రాజ్యమంతయు దుష్టంబై సిరిలేకయే యుండు. రాజులు ధర్మపరాయణులై పరిపాలనంబొనర్చినఁ గందమూలఫలాదులు రుచి గలిగియుండును; రాజ్యమును శ్రీయుక్తంబై యుండు. మఱియు వృషభంబు, భూమి యుద్ధకమయుంబై యుండినఁ దిన్ననైనమార్గము ననుసరింపక వంకవంకలుగ నడచుచుండును. అట్టి వంకల ననుసరించియే పశుగణంబంతయుఁ జనుచుండు. అట్లే యధర్మమార్గంబులం జనుచుండిన నరపా



లుఁడు ప్రజలనుగూడ నట్టిమార్గములందే నడపించి రాజ్యమున, ధర్మమును నశింపఁజేయును."

తెలపత్తజాతకంబునఁ దక్కశిలానగరపు రాజొకఁడు పిశాచము నొకదాని రూపలావణ్యాతిశయోపహతుఁడై పట్టమహిషిగ నొనర్చినకథగలదు. ఆదయ్యము రాజు తనకు వశుఁడైయున్నాఁడని గుర్తెఱింగి జనులపైఁ దనకు సర్వాధికారము నొసంగుమని ప్రార్థించెను. వారలకీక్రిందివిధముగ సంభాషణము జరిగెను.

"రాజు—ప్రియురాలా నారాజ్యంబున నుండు నందఱిపైని నాకు నిరంకుశాధికారములేదు. నేను వారి రారాజును గాను. నా యధికారము దానిధిక్కరించువారిపైని నేరములొనర్చువారిపైని జెల్లుచున్నది. కాన రాజ్యమంతటిపైని నీకు సర్వాధికారమొసంగఁ జాలను.

దయ్యము—ప్రభూ, నాకు రాష్ట్రముపైని గాని, పట్టణముపైనిగాని నీవు సర్వాధికారమొసంగనేరకున్నను రాజప్రాసాదమందు నివసించువారిపైనైన సర్వాధికారమొసంగుము. వారల నేను బాలించెదను."

కాని రాజు దుష్టకర్మల నాచరించువారలను మాత్రమే దండించుటకుఁ దగిన యధికారము కలిగియుండునని సువ్యక్తముగ నెచ్చటను జెప్పఁబడలేదు. రాజిష్టమువచ్చినరీతిని బనులను జేయునటుల ప్రజలను నిర్బంధించు నధికారము కలిగియుండునట్లును గాన్పింపదు. నిగ్రోధమిదజాతకంబున మాత్రము వారాణసీపరిపాలకుండగు బ్రహ్మదత్తుఁడు మృగయాలోలుండును మాంసప్రియుండునునై యనుదినంబును మాంసమును భక్షించుచుండెనని యున్నది. ప్రతిదినమున నాతఁడు జానపదులను బురజనులను వారివారి పనులను మాన్పి మృగయార్థమై తనతోఁగూడఁ గొంపోవుచుండెను. తమపనులయున్నిఁ

చెడిపోవుటచే జనులందఱు నేకీభవించి మృగముల నొకద్వారసమోపేతంబగు నారామంబునఁ బెట్టి ద్వారములను బంధించిరి. నరపాలురందఱును ధర్మపరాయణులై తమయధికారములను గుర్తెఱింగి వాని నతిక్రమింపక నడుచుచుండిరని మనమూహింపరాదు. పూర్వము వారణాసియందు మహాపింగళుం డను నామమునఁ బరఁగెడు రాజు దుష్టబుద్ధితోఁ దనకిచ్చవచ్చినటుల నధర్మమునఁ బరిపాలనం బొనర్చుచుండెను. అధికముగఁ గరముల గ్రహించియు, అయుక్తదండనముల విధించియు, జంఘాద్యవయవముల ఖండించియు, దొమ్మి, దోపిళ్లం జేయించియుఁ, జెఱకుఁగఱ్ఱను గానుగయందు పిప్పియొనర్చునటుల జనులను బాధపెట్టియు నిటుల ఘోరముగ వర్తిల్లుచుండెను. అతఁడు, దుష్టుండును, ధూర్తుండును, సాహసికుండునై యుండెను. ప్రజలయం దిసుమంతయు దయఁజూపఁడయ్యె. అతఁడక్షిపతితరజంబుభాతిని, జూపాస్థశర్కరరీతిని, బాదప్రవిష్టకంటకంబువలెను నందఱను గష్టపెట్టుచుండెను” పైని జెప్పఁబడిన దశరాజధర్మములకు మాఱుగ దుష్టవ్యాపారములం జేయు రాజులును బేర్కొనఁబడుచున్నారు. ఖంతివాదిజాతకంబున నొకరాజు సురాపానలోలుండును, గఠినహృదయుండునై యుండెననియున్నది. భల్లధమ్మపాలజాతకంబున నరపాలుఁ డంతిపురంబునకుం జని సప్తమాసవయస్కుండగు నిజపుత్రునితోఁ బట్టమహిషి యాడుకొనుచు లేచి నిలువనందులకుఁ గోపావేశముతో నటనుండి కొలువుకూటంబునకుం జని యురిదీయువానిరావించి పట్టమహిషి యెంతవిలపించినను సరకుగొనక బాలునిఁ దునియతునియలుగ ఖండింపించెనని యున్నది. చేతీయజాతకంబున భూపాలుఁ డధార్మికుండును నసత్యాభిలాషియునై ప్రజాకంటకుండాయెనని చెప్పంబడినది.

పదకుశలమాణవజాతకంబున నరపాలుఁడును నాతని పురోహితుఁడును నమూల్యాభరణములను దొంగిలించి యొకచోఁ దాఁచిరని



యున్నది. చోరులఁబట్టుకొనుటకై రాజుచే నియమింపఁబడిన బ్రాహ్మణకుమారుం డొక్కరుండు వానినిదీసి రాజునకిచ్చెను. రాజా యువకుని దొంగలెవరో చెప్పుమని యెంతనిర్బంధము చేసినను జెప్పక కథారూపముగ రాజును బురోహితుఁడును నాధనమును దస్కరించిరని మాత్రము సూచించెను. ఈసూచనల రాజు లెక్కసేయక బ్రాహ్మణునిఁ జోరులను బ్రకటింపవలెనని నిర్బంధించెను. అంత నా బ్రాహ్మణయువకుఁడు:

“ఇచట సమావేశమైన గృహపతులను నాగరులును సావధానచిత్తులరై వినుండు. ఉదకమైయుండవలసిన వస్తువగ్నియైనది. ఎయ్యది శుభస్థానమై యుండవలయునో యయ్యది యుపద్రవకారకంబై యున్నది. రాజును, నాతని పురోహితుండగు బ్రాహ్మణుఁడును దేశమును గొల్లగొట్టుచున్నారు. మీరక్షకునివలన మీకుపద్రవము లుద్భవించుచున్నవి. మీరు జాగరూకులై యుండుఁడు” అని చెప్పఁగా జనులు రాజును బురోహితుని వధించి యీబ్రాహ్మణుని రాజుగ నెన్నుకొనిరి.

ధర్మముల నతిక్రమించి వారికిఁ దోఁచినటుల చేయుచుండిన నరపాలురపై జనులు తిరుగుబాటుచేసి యట్టివారిని వధించియో లేక దేశమునుండి వెడలంగొట్టియో దమకష్టములం బాపుకొనుచుండెడివారు.

నిరంకుశాధికారముకలిగి యకుంఠితసామ్రాజ్యోపేతులై బలాన్వితులైన నరపాలురు ధర్మబద్ధులై సత్యపథంబు నతిక్రమింపక పాలనంబొనర్చుట యతికష్టము.

## ౭

### ప్రజాసభలును, సమితులును

బౌద్ధకాలములో గ్రామములు సునిర్మితములై భోజకులయధికారముక్రింద నున్నవై రాజకీయవ్యవహారములకు ముఖ్యావయవములైయుండెడివి. పూర్వము బ్రహ్మదత్తుఁడు తాను వారణాసిం బరిపాలించుచున్నపుడు రాజ్యప్రాంతగ్రామమున నొక యమాత్యునిఁ బ్రముఖునిగ నియమించెను. అతఁడు రాజునకుఁ బ్రియుండై యుండి తాను గ్రామమును రక్షకభటులతో విడిచి చనుసమయంబున నా గ్రామమును గొల్లగొట్టి యాదోఁపిడిలో లభించిన ధనములో సర్ధ భాగము తనకు వారొసంగునటులు గొంతమందిచోరులతో నేర్పాటు చేసికొని యొకనాఁటియుదయమున రాజకరధనమును బట్టుకొని రక్షకులతో వనమునకుంబోయెను. ఆచోరులానిర్ణయము ననుసరించి యమాత్యుఁడు వనమునకుం జనఁగనె గ్రామమునఁ బ్రవేశించి పశువులను జంపి భుజించి యమాత్యుండు సాయంసమయమునఁ దిరిగి గ్రామమునకు వచ్చునప్పటికి లోప్త్రింబుతోఁ బాఱిపోయిరి. బోని సత్తుఁ డాసమయమున వ్యాపారమునకై పర్యటించుచు నాగ్రామములో బసచేసియుండి సాయంసమయమున నాగ్రామభోజకుఁడు జరిగినదంతయుఁ దనకేమియుఁ దెలియనటుల సంచరించుటంగని యా గ్రామభోజకుండే యాదోఁపిడికిఁ గారకుండై యుండవలెనని నిశ్చయించుకొనెను. కొలఁదికాలమైనపిదప నాయమాత్యుఁడు ఖలుండధిరాజు తెలిసికొని వానినా పదవినుండి తొలఁగించి యింకొకని గ్రామభోజకునిఁగ నియమించెను. కులావకజాతకంబునందు గ్రామమానజముంగూర్చిన విషయములు గానవచ్చుచున్నవి. ఈజాతకములో దుర్మార్గుండగు గ్రామభోజకుని దాసునిఁగఁ జేసినపిదప నింకొకగ్రామభోజకుని నాపదవిలో నియమించినటులు గానరాదు. గ్రామభోజకులు రాజుచే నియమింపఁబడుచుండెడివారో లేక గ్రామస్థులచే నెన్నుకొనఁబడుచుండెడివారో తెలియరాకున్నది.

ఉభతోభత్త జాతకమువలన గ్రామభోజకులు రాజకరమును గ్రహించుటయేగాక గ్రామములో న్యాయాధికారులై గూడనుండెడి వారని స్పష్టముగనున్నది. వారణాసిని బ్రహ్మదత్తుఁడు పాలించు సమయమున బోధిసత్త్వుఁడు తరుదేవతయై జనించెను. ఆ కాలములో నొక గ్రామమున జాలికుండొకఁడుండెను. అతఁడు తన పుత్రునితోఁ గూడ నొకనాఁడు వలలంబట్టుకొని చేపలు విస్తారముగ దొరకు నొక జలాశయమునకుంబోయి యందుఁ గాలమును విసరెను. ఆ గాలము నీటిలో మునిగియుండిన యొక తరువిస్ఫోటంబునందుఁ దగులుకొనెను. ఆ వైవర్తుఁడు తన గాలమును బైటికిఁ దీయలేక “ఎంత పెద్ద చేపను బట్టితిని, నే బాలుని నింటికంపి గృహిణితో నిరుగు పొరుగు వారలతో వివాదమును బెట్టుకొనుమని చెప్పుమనియెదను. అట్లైన నీ చేఁపలోని భాగ మేరికి నీయనవసరముండదు” అని చింతించి భార్యతోఁ జెప్పవలసిన విషయములన్నియుఁ జెప్పి బాలునింటికిం బంపెను. గాలము త్రాడు తెగునను భయముతో వస్త్రముల నొడ్డుననుంచి నీటిలోనికిం బ్రవేశించి చేఁపకై వెదకుచుండ నా తరుశోఫంబు ముఖమునకుం దగులుకొని కన్నులకు బాధను గలుగఁ జేసెను. ఇంతలో నొడ్డుననున్న యా బట్టల నొక చోరుండెత్తికొనిపోయెను. అతఁడు గ్రుడ్డియై యత్యంతము బాధపెట్టుచున్న నేత్రములను జేతులతో మూసికొని యొడ్డుననున్న బట్టలకొఱకు వెదకంజొచ్చెను.

ఇంతలో నాతని భార్యయు భర్తచెప్పినటుల నాచరింపంబోయి చెవిసందున నొకతాటియాకు నిడికొని మూకుటనుండు మసితో నొక కంటిచుట్టును వ్రాసి కుక్కను దువ్వుచుఁ బొరుగిండ్లవారలతో మాటలాడుటకై బయలుదేరెను. పొరుగుననుండు నొకర్తుక యామె వికృతాకారముం జూచి «అయ్యో నీకుఁ బిచ్చియెత్తినదని" యనెను. అంతనా జాలికుని భార్య «నా కేమియుఁ బిచ్చియెత్తలేదు. అకారణముగ నన్ను దూషించుచున్నావు. రమ్ము గ్రామ భోజకునికడకు నన్ను దూషించినందులకు, నీ కాయనచే నెనిమిది సువర్ణంబుల ధన దండంబువిధింపించెద." అని ప్రత్యుత్తర మొసంగెను.

వీరిరువు రిటులు దూషించుకొనుచు గ్రామభోజకుని కడకుం జనిరి. ఆ గ్రామాధికారియు వారి వివాదకారణములం గూర్చి ప్రశ్నించి యాజాలికుని భార్యయే నేరమొనర్చినదని గుర్తెంగి యామె కెనిమిది కాహాపణంబుల [కార్షాపణ] ధనదండంబును విధించి యా ధనదండ మిచ్చువఱకామెను ద్రాళ్ళతోఁగట్టి కొట్టించెను.

గ్రామభోజకులు పరిపాలకులవలెఁ బ్రవర్తించుచుఁ బ్రజల కనేక విధములగు నుపకారము లొనర్చుచుండెడివారని తెలియనగును. వారుచేయు మార్పులొకప్పుడు ప్రజల కనిష్టములై యుండినవారే వానిని రద్దుపఱచుచుండెడివారు. కాశీదేశంబున నుండిన రెండు గ్రామములకుఁ బెద్దలు తమగ్రామములలో దుష్టాచారములనునశింపఁ జేయఁబూనిరి. అందులో నొక గ్రామభోజకుఁడు తన గ్రామములోఁ బ్రాణిహింస నిషేధించెను. అంత భూతములకు బలులిచ్చు సమయమువచ్చి నపుడు జనులందఱు గ్రామభోజకుని యొద్దకుఁబోయి బలియిచ్చుట కిది సమయమనియుఁ గానహరిణంబులు, సూకరంబులు మున్నగు జంతువుల వధించి భూతములకు బలియిచ్చుటకుఁ దమకు



ననుజ్ఞనొసంగవలెననియు బ్రార్థింప నా గ్రామభోజకుం డందులకు సమ్మతించెను.

రెండవ గ్రామభోజకుఁడు తన గ్రామములో సురాపానంబును నిషేధించెను. ఆ యూరివా రాతని కడకుంజని "ఆర్యా! అనాదిగా మేము చేయుచుండిన పానోత్సవంబు సంప్రాప్తమైనది. మే మేమిచేయవలయును" అని నివేదించిరి. ఆ గ్రామ భోజకుఁడు "పూర్వమునుండియు నీ యుత్సవ సమయమున నాచరించుచున్నటు లనే యాచరింపుఁడు" అనియెను.

జాతక కథలంబట్టియేగాక కౌటిలీ యార్థశాస్త్రంబువలనను గ్రామములు రాజ్య వ్యవహారములకు ముఖ్యావయవములై యుండెడివని నిశ్చయమగుచున్నది.

కౌటిలీయార్థశాస్త్రము మూఁడవ ప్రకరణములోఁ బదియవ యధ్యాయమున గ్రామస్థులను గ్రామభోజకులనుగూర్చి వ్రాయఁబడినది.

"గ్రామకార్యము నిమిత్తమై మఱియొక చోటికిఁబోవునట్టి గ్రామాధికారికి సహాయముగ గ్రామస్థులొక్కొక్క రొక్కొక్క మారు వెళ్ళుచుండవలెను. అట్లు వెళ్ళనివారు యోజనమున కొకటిన్నర పణము చొప్పున నిచ్చుకొనవలెను."

"చోరులు జారులు కానివారిని గ్రామమునుండి తొలగించు గ్రామాధికారి కిరువదినాలుగు పణముల దండము. అట్టి గ్రామమున కుత్తమ దండము."

"కృషికై గ్రామమునకు వచ్చి కృషిచేయనివానిపై విధింపఁబడు దండము గ్రామమును జెందవలెను. అట్టివారు వారివేతనమునకును వారికిచ్చిన భక్ష్యపేయములకును ద్విగుణముగ దండము

నిచ్చుకొనవలెను. యజ్ఞములయందుఁ బనులుఁజేయని వారికిఁ గూడనిదియేదండము."

"ఉత్సవ ప్రదర్శనములకొరకగు ఖర్చులలో నంశమియ్యని వాఁడును వాని జనమును, దదుత్సవమును జూడఁగూడదు. ప్రచ్ఛన్నముగ దానిని జూచినను నందఱకును హితమగు కర్మల కాటంక పఱచినను నంశద్విగుణదండము నిచ్చుకొనవలెను."

"అందఱకు హితమగు దాని నొకఁడు చెప్పినపుడు వాని యాజ్ఞానుసారముచేయవలెను. అట్లు చేయనపుడు ద్వాదశపణదండము. గ్రామస్థులు కలసి యట్టివానిని గొట్టినపుడు వానిలో నొక్కొకరికి నపరాధ ద్విగుణమగు దండము విధింపవలెను.''

"హాని కలుగఁజేసినవారిలో బ్రాహ్మణునకును బ్రాహ్మణులలో నధికుఁడగువానికిని నెక్కువదండమును విధింపవలెను. యజ్ఞములందుఁ దమతో నేకీభవింపని బ్రాహ్మణునికి హానిచేయక వానినుండి యంశమును మాత్రము పుచ్చుకొనవలెను. దేశజాతికులసంఘముల సంబంధించిన సమయానపాకర్మలవిషయమునఁ గూడ నిట్లే యని గ్రహించునది."

"మార్గములుకలియు ప్రదేశములయందు దేశహితములగు సేతువులఁగట్టెడివారికిని, గ్రామమునకు శోభను రక్షనుగలుగఁజేయువారికిని, రాజు హితప్రియములఁ జేయవలెను."

"సార్థకులు వారిపణ్యపరిణామమును గ్రామస్వామికిఁ దెలిపి గ్రామములో నొకచోట నుండవచ్చును. రాత్రియందు వారిపణ్యము దొంగలింపఁబడి నష్టమయినచో నది యితరగ్రామములకుఁ బంపఁబడెనని జాడలుకనఁబడనప్పుడు గ్రామస్వామి దాని నిచ్చుకొనవలెను. గ్రామమునకుమధ్య (త్రోవలో) నిట్లు నష్టమయినచో వివీతాధ్యక్షుఁ



డిచ్చుకొనవలెను. వివీతప్రదేశములు లేనిచోట నష్టమయినచోఁ జోరరజ్జుకుఁడిచ్చుకొనవలెను. చోరరజ్జుకుఁడు లేనిప్రదేశములలో నాగ్రామపుహద్దులలోఁ బణ్యము నష్టమాయెనో యాగ్రామమువారు దాని నిచ్చుకొనవలయును. హద్దుదాఁటిన సమీపముననష్టమాయెనేని యాచోటికి సమీపమందుండు నైదుగ్రామములవారు గాని పదిగ్రామములవారు కాని దాని నియ్యవలెను."

దీనింబట్టి యాపురాతనకాలములో గ్రామములు సుప్రతిష్ఠితములై యుండెడివని నిశ్చయమగుచున్నది. ప్రతిగ్రామమును గ్రామభోజకాధిష్ఠితంబై యుండెడిదనియును నాగ్రామభోజకుఁడు గ్రామసంబంధములైన వ్యవహారములంజేయుచు గ్రామస్థుల సాహాయ్యమును బొందుచుండెడివాఁడని స్పష్టమగుచున్నది. గ్రామస్థులతోఁ గూడి గ్రామభోజకుఁడు గ్రామస్థు నొక్కని గ్రామబహిష్కృతునిఁగ నొనర్చు శక్తికలవాఁడై యుండెడివాఁడని తెలియనగును. గ్రామస్థునెవ్వానినైన నకారణముగ బహిష్కరించినట్టి గ్రామస్థులును, గ్రామభోజకుఁడునుగూడ ధనదండమునకుఁ బాత్రులగుదు రనుటచే నట్టి బహిష్కారములు గ్రామభోజకుని యాధిపత్యముక్రింద గ్రామస్థుల సభలో నిర్ణయింపఁబడుచుండెడివని యూహింపనగును. మఱియు గ్రామస్థుని స్వాతంత్ర్యమును, వాని హక్కులును గ్రామసమాజమునకు నియమముగ లోఁబఱుపఁబడి యుండలేదనియును గ్రామ సమాజములు న్యాయయుక్తముగఁ బ్రవర్తించునటులఁ జేయు నధికారము రాజు కలిగియుండెననియు మన మూహింపవలెను. గ్రామమునకు సర్వీయ మూలధనం బుండెననియును నట్టి మూలధనము ధనదండముచే వృద్ధి నొందుచుండెడిదనియు నిశ్చయమగుచున్నది. గ్రామసమాజము ప్రతి గ్రామస్థునిచేతను నియమితకార్యములను జేయించు శక్తి గలిగియుండెడిది.

"ఎవ్వారు పథంబులపై జనసామాన్యమున కుపయుక్తమగు సేతుబంధాదుల నిర్మింతురో, యెవ్వారు గ్రామమునకు శోభనెగాక రక్షను గలుగఁజేయుదురో యట్టి వారలకు రాజు ప్రియ హితములం జేయవలెను."

* ఆకాలమున గ్రామము రాజకీయ వ్యవహారమునకు ముఖ్యావయవముగాఁ బరిగణింపఁబడుచుండెడిదని బ్రాహ్మణ ధర్మశాస్త్రాది గ్రంథములవలనను స్పష్టమగుచున్నది. మనుధర్మశాస్త్రమునందు —

శ్లో॥ గ్రామస్యాధిపతిం కుర్యాద్దశ గ్రామపతింతథా।
వింశతీశంశతేశంచ సహస్రాధిపతింతథా॥
గ్రామేదోషాన్ సముత్పన్నాన్ గ్రామికశ్శనకైః స్వయం।
శంసేద్గ్రామ దశేశాయ దశేశో వింశతేశనే॥ (7అ॥ 115-116)

మఱియు మానవధర్మశాస్త్రంబున రాజు గ్రామనియమములఁ దిరస్కరించు పురుషుని రాజ్యమునుండి వెడలంగొట్టవలయునని చెప్పఁబడినది.

శ్లో॥ యోగ్రామదేశ సంఘానాంకృత్వా సత్యేన సంవిదం।
విసంవదే న్నరోలోభాత్తం రాష్ట్రా ద్విప్రవాసయేత్॥
ఏతద్దండ విధిం కుర్యాద్ధార్మికః పృథివీపతిః।
గ్రామజాతి సమూహేషు సమయవ్యభిచారిణామ్॥ (మను 8-219, 221)

"ఏ గ్రామమునందు బ్రాహ్మణులు తమ శాస్త్ర విహితకర్మముల

* "అచటఁ రాజ్యములో గ్రామాధ్యక్షులను నియమింపవలెను. దశాధ్యక్షులను (దశగ్రామాధ్యక్షులను నియమింపవలెను.) శతాధ్యక్షులను (శతగ్రామాధ్యక్షుల నియమింపవలెను.) దేశాధ్యక్షులనుగూడ (నియమింపవలెను) గ్రామదోషములను గ్రామాధ్యక్షుఁడు పరిహరింపవలెను. అట్టి గ్రామాధ్యక్షుఁ డశక్తుండైన దశగ్రామాధ్యక్షునకు నివేదింపవలయును. ఆ దశాధ్యక్షుఁడును నశక్తుండైన శతాధ్యక్షునకు నివేదింపవలయును. ఆ శతాధ్యక్షుఁడును నశక్తుండైన దేశాధ్యక్షునకు నివేదింపవలయును. (విష్ణుస్మృతి 3 అ॥)"



నిరాకరించి వేద జ్ఞానము లేక యాచకులై సంచరించుచుందురో యట్టి గ్రామమును రాజు దండింపవలయును." (వసిష్ఠవచనము III 4)

1. "గోవులు మున్నగునవి నష్టమయినప్పుడుగాని, ద్రవ్యము లపహృతములగునప్పుడు గాని, పాదముద్రాన్వేషణ చతురులగు వారు పదముల యన్వేషణంబును నష్టమయిన ప్రదేశము మొదలుకొని చేయవలయును."

2. "అట్టి పదములు గ్రామమువఱకుఁ గాని, వ్రజమువఱకు గాని, వివిక్తప్రదేశమువఱకు గాని చనినచో నాయాప్రదేశముల నుండెడి నరులుగాని యట్టి ప్రదేశముల స్వాములుగాని యన్వేషించి యచటనుండి పాదముద్రలజాడ లింకను బైకిఁబోవుచుండునటులఁ గనఁబఱుపలేనిచో నష్టమునకు ముజరా యీయవలయును."

3. "పదములు [పాదచిహ్నములు] జనాంతికమందు విషమత్వమువలన బాగుగఁ దెలియకపోవు నపుడును, భగ్నమగు నపుడును నాసన్నతరమగు గ్రామముపైఁగాని వ్రజముపైఁగాని యానష్టము నారోపింపవలయును." [నారదస్మృతి XIV 22, 23, 24]

వేద కాలములో సభలును సమితులును సునిర్మితములై రాజాచార విరుద్ధముగఁ గాని, ధర్మవిరుద్ధముగఁ గాని సంచరింపకుండునటులఁ జేయుటకుఁ దగిన శక్తిగలవై యుండెడివని మన మూహింపవచ్చును. అథర్వ వేద V 19:—

(1 శ్లో॥ గవాదిషు ప్రణష్టేషు ద్రవ్యేష్వపహృతేషువా।
పదస్యాన్వేషణం కుర్యు । రామూలా త్తద్విదోజనాః॥
2 గ్రామేవ్రజేవివిక్తేవాయత్ర సన్నిపతేత్పదమ్।
వోఢవ్యంతద్భవేత్తేన నచేత్సోన్యత్రతన్నయేత్॥)
శ్లో॥ పదేప్రమూఢే భగ్నేనా। విషమత్వాజ్జనాంతికే॥
యస్త్వాసన్నతరో గ్రామః। వ్రజోవాతత్రపాతయేత్॥

I [1] “ఏ రాజు పృథుశక్తియుక్తుండనని యెంచి బ్రాహ్మణుని దిగమ్రింగనెంచునో, యెచట బ్రాహ్మణుఁడు బాధింపఁబడుచున్నాఁడో యట్టి రాజ్యము నశించును.

[2] అష్టపాదయుక్తంబై, చతురక్షిసంయుక్తంబై, చతుష్కర్ణోపేతంబై, చతుస్తాలోపేతంబై, ద్విముఖోపేతంబై, ద్విజిహ్వాసమోపేతంబై యయ్యది బ్రాహ్మణహింస గావించు రాజ్యమును బెకలించును.

[3] భగ్నంబగు నోడలోనికి నుదకము చొచ్చునటుల నయ్యది యట్టి రాజ్యములో నిశ్చయముగఁ బ్రవేశించును.

[4] మృతిఁజెందిన తరువాత నరుసిపై కట్టుకుడిని, నిశ్చయముగ నో బ్రాహ్మణ హింసకుండా! దేవతలు నీ యుపస్తారణమని నుడివిరి.

[5] ఓయీ! బ్రాహ్మణ హింసకుఁడా! బాధింపఁబడునపుడట్టివాని యాననమునఁ గారిన కన్నీరు నీ కుదక భాగమని దేవతలు నుడివిరి.

[6] శవమును స్నానముఁజేయించు నుదకము, గడ్డముఁ దడుపు నుదకము నీ కుదకభాగమని దేవతలు నిశ్చయించిరి.

[7] మిత్రావరుణుల వర్షము బ్రాహ్మణ హింసకునిపైఁ గురియదు. సమితియువానితో సుహృద్భావంబుననుండదు. తన యభీష్టము చొప్పున నంచరించునటులు మిత్రుని నొనర్పంజాలఁడు.”

II “ఓ, ఓషధీ [పాఠయనెడి యోషధి] ప్రతివాది, వాదియును నీయొక్క సేవకుఁడనగు నన్ను జయింపకుండనుండుఁగాక; నీవు సహనస్వభావముకలదానవునునై యున్నావు. వాదినగు నన్నుఁగూర్చి ప్రతికూల ప్రశ్నములం నడుగు ప్రతివాదులను బరాజితులనుగ నొనర్పుము. ప్రతివాదులను శుష్కకంఠులనుగ నొనర్పుము.”



“వైనతేయుఁడు నిన్నుఁ గనుఁగొనెను. వరాహము నిన్ను నాసికచేఁ ద్రవ్వియెత్తెను. వాదినగు నన్నుఁగూర్చి ప్రతికూల ప్రశ్నముల నడుగు ప్రతివాదులు పరాజితులుగ నొనర్పుము. ప్రతివాదులను శుష్కకంఠులుగ నొనర్పుము.”

“ఇంద్రుఁడు ని న్నసురులను హింసించుటకొఱకు దక్షిణ భుజమునందు ధరించెను. వాదినగు నన్నుఁగూర్చి ప్రతికూల ప్రశ్నముల నడుగు ప్రతివాదులను బరాజితులుగ నొనర్పుము. ప్రతివాదుల శుష్కకంఠులుగ నొనర్పుము.”

“ఇంద్రుఁ డసురులను జయించుటకొఱకు నీయోషధిని భక్షించెను. వాదినగు నన్నుఁ గూర్చి ప్రతికూల ప్రశ్నముల నడుగు ప్రతివాదులను బరాజితులుగ నొనర్పుము. ప్రతివాదుల శుష్కకంఠులుగ నొనర్పుము.”

“ఇంద్రుఁడు సాలావృకులను దీనిచేనెట్లు జయించెనో యట్లే నేను శత్రువులను జయించెదను. వాదినగు నన్నుఁ గూర్చి ప్రతికూల ప్రశ్నముల నడుగు ప్రతివాదులను బరాజితులుగ నొనర్పుము.”

“ఓ రుద్రుఁడా! కర్మకారుఁడవును, నీలశిఖండుఁడవును నగు నో రుద్రుఁడా, నాచే సేవింపఁబడు నోషధిని బ్రతివాదిని తిరస్కరణ సమర్థమైన దానినిగఁ జేయుము.” “ఓ యింద్రుఁడా! ఏ ప్రతివాది మమ్ములను యుక్తులచేఁ దిరస్కరించుచున్నాఁడో యట్టి వానియొక్క ప్రతికూల ప్రశ్నరూపమగు వాక్యమును నీవు నశింపఁజేయుము. నీయొక్క సామర్థ్య విశేషములచే మమ్ముల నధిక వచనములతోఁ గూడుకొనిన వారలఁజేయుము. వాదినగునన్నుఁ బ్రతివాదికంటె నుత్కృష్టునిగఁ జేయుము.”

III “ప్రజాపతిపుత్రికలైన సభయు, సమితియు నన్నైకమత్యముతో రక్షించుఁగాక. ఆతఁడు నన్నుఁబొంది బాగుగ నాచేఁబలి

కించుఁగాక. ఓపితలారా! సభలో సమావేశమైనవారలలో మనోహరములైన వాక్యములను జెప్పునటుల నన్ననుగ్రహింపుఁడు."

"ఓసభా నీపేరును మేమెఱుఁగుదుము. నీవు నరిష్టవు. నీకు సంబంధించిన సభాసదులు నాతో సమానవాక్యముకలవారగుదురుగాక."

"సభయందున్నటువంటివారల తేజస్సును విజ్ఞానమును నేను స్వీకరించుచున్నాను. ఓయింద్రుఁడా! ఈసభయొక్క భాగ్యముకల వానిఁగ నన్నుఁ జేయుము."

"సభాసదులారా! పరాగతములును, నిటునటు చంచలించుచున్నవియు నగు మీమనములను నాకభిముఖములైన వానినిగఁ జేయుచున్నాను. మీయొక్క మనస్సు నాయందు రమించుఁగాక."

IV "ఈతఁడు విశుల ననుసరించి చనెను. వానిననుసరించి సభయు, సమితియు, సేనయు, సురయుఁ జనెను."

V "ఎటులహోతయజ్ఞపశువులుంచఁబడిన గృహమునకుఁ జనునో, రాజెటులు సమితికిం జనునో యట్టులనే పవిత్రమగు సోమము కలశములోఁ బ్రవేశించి యశవియం దెనుపోతువలె నందుండును."

"నేను బలవంతుఁడను సర్వకార్యనిర్వహణదక్షుఁడగు బలముతో నిచటికి వచ్చినాఁడను. నేను మీయుద్దేశములయొక్కయు, దీర్పుయొక్కయు నధిపతినయ్యెద"

(ఋగ్వేదము X మండలము 166-4)

పై వాక్యములు రాజ్యము నపేక్షించుచుండి విఫలమనోరథుండైనవాఁడు బలాత్కారముగ రాజ్యము నాక్రమించెదనని చేయు తర్జనవాక్యములుగఁ దోఁచుచున్నవి. ఇందుసమితిని ద్రోసిపుచ్చెదమనునది మనము గుర్తింపవలయును.



పైనిరూపింపఁబడిన వచనములంబట్టి సభయు సమితియు బహుపురాతనకాలమునుండి యుండెడివని స్పష్టమగుచున్నది. బౌద్ధకాలము నాఁటికి ప్రజాసమితులును, సభలును క్షీణించినవి. కొంతవఱకు రాజులు రాజకీయవ్యవహారములను మహామంత్రుల సభలో మంత్రణంబుఁగావించి నిర్వర్తించుచుండెడివారు.

## ౮

### రాజపురోహితులు, బ్రాహ్మణులు.

నరపాలురధ్యయనయజనంబులం జేయుటకు సమర్థులైయున్నను బ్రాహ్మణపురోహితుని సాహాయ్యములేనపుడు వారలకు యజ్ఞంబులం జేయుటకధికారము లేదని బ్రాహ్మణవాఙ్మయమువలనఁ దెలియవచ్చుచున్నది.

బ్రాహ్మణపురోహితుండు లేకుండ రాజు యజ్ఞఁబొనర్చిన దేవతలు యజ్ఞభాగంబును బొందరు (ఐతరేయబ్రాహ్మణము VII 24). యజ్ఞాదులను జేయించుటకును, భావిసంభవములను దెలిసికొనుటకును, దుస్స్వప్నాదులవలనఁ గలుగుచేటులను దేవతారాధనమువలనఁ బోగొట్టుటకును, శకునములు సూచించువిషయములం దెలియఁజెప్పుచు దుశ్శకునములవలనఁ గలుగుకష్టములను దొలఁగించుటకును, శస్త్రాదులయొక్కయు నశ్వగజాదులయొక్కయు లక్షణములం జెప్పి మంత్రములచే నుపయోగార్థము పూతంబులుగ వానినొనర్చుటకును, భూతపిశాచాదులవలనఁ గలుగు నపాయములను మంత్రహోమాదికర్మములచే వారించుటకును నరపాలునకు బ్రాహ్మణపురోహితుఁడత్యావశ్యకుఁడై యుండెను. దేవతలను యజ్ఞములచే సంప్రీ

తులుగ నొనర్చి తేఁకి శత్రువిజయంబును, దీర్ఘాయువును, నత్యధిక వైభవంబులును గలుగఁజేయుటకు సమర్థుఁడు పురోహితుఁడై యుండుటచే రాజపురోహితులకుండు సంబంధమధికమైయుండెడిది. నరపాలుఁడు నిజశ్రేయోభిలాషియై యుండిన నవశ్యముగ నుత్తముండగు నొకబ్రాహ్మణుని బురోహితునిఁగ నియమించుకొని వానిసాహాయ్యముఁ బొందుచుండవలెనని బ్రాహ్మణసిద్ధాంతమువలన స్పష్టమగుచున్నది. కౌటిలీయుని యర్థశాస్త్రంబున నెట్టివాఁడు పురోహితుఁడై యుండఁదగినవాఁడో నిరూపింపఁబడినది.

“పురోహితముదితోదితకులశీలం షడంగే వేదే దైవేనిమిత్తే దండనీత్యాంచ
అభివినీతమాపదాం దైవమానుషీణాం
అథర్వభిరుపాయైశ్చ ప్రతికర్తారం కుర్వీత
తమాచార్యం శిష్యః పితరం పుత్రోభృత్యః స్వామినమివచానువర్తేత”

(1 పు 9 అం.)

“కులశీలసంపన్నతకు విఖ్యాతినొంది వేదములయందును షడంగములయందును బూర్వకర్మపరిపాకలక్షణదైవ ప్రతిపాదకమైన జ్యోతిశ్శాస్త్రమందును, శకునశాస్త్రమందును, దండనీతియందును, సుశిక్షితుండును, దైవమానుషకృతములగు నాపదలను నథర్వమంత్రప్రయోగములచేతను బోఁగొట్టఁగలిగినవాఁడును నగు పురోహితుని శిష్యుఁడాచార్యునిగతిఁ బుత్రుండు జనకునిరీతి, భృత్యుండు స్వామిని భాతి నరపాలుఁడనుసరించి చనవలెను.”

పురోహితుఁడు నరపాలునిచే నాచార్యుఁడుగఁ బరిగణింపఁబడుచుండెడివాఁడు.

పురోహితుఁడు తఱచుగ నరపాలునకు యౌవనమందు విద్యాశిక్షకుండై యుండెడివాఁడు. తిలముష్టిజాతకంబున రాజు తనకు యౌవనమందుఁ దక్షశిలానగరంబున విద్యలంగఱపిన యాచార్యునిఁ బురో



హితునిఁగ నియమించి యాతనిఁ బితృసమానునిఁగఁ జూచుచు నాతఁడు చెప్పినటుల సంచరించుచుండెనని చెప్పంబడినది. రాజులు రాజ్యాభిషిక్తులైనపిదప విద్యాభ్యాసమును గట్టిపెట్టియుండెడివా రని మనమూహింపరాదు. పరిపాలకులై రాజకీయవ్యవహారముల నిర్వర్తించుచు భూపాలురు లెస్సగ విద్యలను బురోహితునిదగ్గఱ నభ్యసించుచుండెడివా రని మనమూహింపవచ్చును.

(బారాణసి రాజపురోహితస్ససంతికేమంతే గణ్హాతి. III 28.)

కౌటలీయార్థశాస్త్రంబునఁ జెప్పంబడినటులు దఱచుగఁ బురోహితుఁడు నరపాలునికిఁ బితృసమానుండై మంత్రియై యుండెడివాఁడు. పౌరోహిత్యము కులక్రమాగతంబై యుండెడిదని స్పష్టము.

(సుసీమజాతకము II 47, చేతియజాతకము III 455.)

“ఏడుపురుషాంతరములనుండి హస్తిమంగళము మాకుటుంబములోఁ బారంపర్యముగ వచ్చుచున్నది” అని పురోహితుని భార్య విలపించెను. ఇటుల పౌరోహిత్యము కులక్రమాగతంబై యుండుటచేఁ బురోహితులు రాజవంశశ్రేయోభిలాషులై యేలికలమంచినే దమ మంచిగ యోచించుచుండెడివారు. ఈకారణమువలననే యేలికలును బురోహితులును నత్యంతస్నేహభావముతో నుండెడివారు.

(III సెయ్యజాతకము.)

రాజకుమారుఁడును బురోహితకుమారుఁడును నేకదినముననే జననముగాంచి యొకమాదిరి బట్టలనే ధరించుచు నొకచోటనే భోజనపానంబులం జేయుచు యుక్తవయస్కులై తక్షశిలానగరమునకుఁ గలిసియే విద్యాభ్యాసార్థమరిగి యచట విద్యలంగఱచిరి. తదనంతరమున రాజకుమారుఁడు ప రాజైనవెనుకను సైతము భోజనపానశయనంబుల నొకచోటనే చేయుచుఁ గలసి మెలసి యత్యధికస్నేహభావముతో నుండెడివారు. సుసీమజాతకంబునఁ జెప్పంబడినటుల రాజ

కుమారుఁడు రాజ్యాభిషిక్తుఁడైనపిదప నట్టి పురోహితకుమారుఁడును బురోహితుండై యుండెనని మనమూహింపనగును. బాల్యమునుండియు స్నేహభావముతోఁ బెరిగినయట్టివారు తరువాతఁగూడ స్నేహభావముతోడనే యుండెడివారనియు నట్టివారలలో రాజకుమారుఁడు రాజైనపిదప బాల్యమిత్రుండైన పురోహితుని స్నేహితునిఁగఁ బరిగణించుచుండెడివాఁడనియును దెలియనగును. అంధభూతజాతకములో రాజును బురోహితుఁడును నక్షులతో విలాసార్థము ద్యూతమునాడుచుండినటులు జెప్పఁబడెను. మఱియు నట్టి నరపాలురు పురోహితులకు ధనాదులనొసంగి వారిని శ్రీమంతులుగ నొనర్చుచుండెడివారు. రాజులు రథాద్యుపాయనంబుల నొసఁగియు (కురుధమ్మజాతకము) గ్రామంబుల దానంబుచేసియుఁ (నానచ్ఛందజాతకము) బురోహితులను సత్కరించుచుండెడివారు. ఇటులు పురోహితులు రాజువలనఁ గానుకలంబొంది సుఖులై యుండెడివారని మనమూహింపనగును. పురోహితులు భోగగ్రామములకుఁ గరములకై చనుచుండినటులు (రథలట్ఠిజాతక, హద్ధిపాలక జాతక III 105, IV 475) కథలలోఁ జెప్పంబడినది. రాజైశ్వర్యసంపన్నుఁడై యుండినపుడు పురోహితుఁ డాతనింగొలిచి సుఖముగ జీవించుచు రాజునకుఁ గష్టదినములు సంభవించినపు డాతని విడువక తానుగూడఁ గష్టములకులోనై యాతని ననుసరించుచుండెడివాఁడని తెలియనగును. రాజు రాజ్యమును గోల్పోయి దేశమునువిడిచి పాఱిపోవునపుడు రాణిని, సేవకుని, బురోహితుఁడు తనవెంటఁబెట్టుకొని చనుచుండుటయుఁగలదు, (పరంతపజాతకము. III 417). పదకుశలమానవజాతకములో రాజుతోఁ బురోహితుఁడును బ్రాణములఁ గోల్పోయెనని యున్నది.

పురోహితులు రాజునకు ధర్మానుశాసకులై యుండుటయేగాక ధనాధికారులును, న్యాయాధ్యక్షులునునై యున్నట్లు గానిపించుచు



న్నది. బంధనమోక్షజాతకంబునఁ బురోహితుఁడు వధ్యస్థానంబునకుఁ బ్రజలచేఁ గొంపోఁబడుచు నిటులు విలపించె: "నేను రాజునకు వివిధములగు నుపచారములం జేసితిని. ఎచట ధనసంచయంబులు దాఁచఁబడినవో యట్టి ప్రదేశంబులు నాకుఁ దెలియును. రాజధనములను నేనింతవఱకుఁ గాపాడుచున్నాను. నన్నాతనికడకుఁ గొంపోవుఁడు. అట్లు మీరు గావింపకుండిన బహుధనసంచయంబుల రాజు గోల్పోవును." కాచంవజాతకమునఁ బురోహితుఁడు పిశునుఁడును, దుష్టాచారుండునునై న్యాయస్థానంబు నధిష్ఠించి కూటవినిశ్చయములం జేయుచుండినట్లును, ధమ్మద్ధజజాతకంబునఁ బురోహితుఁడు సదాచారపరాయణుండై, పాపచేతస్కుండగు సేనాని ధనాశచేఁ గూటవినిశ్చయంబులొనర్చుచుండ సహింపనోపక వ్యవహారములను న్యాయయుక్తముగ నిశ్చయించుచు రాజుచేఁ బ్రాడ్వివాకుఁడుగ నియమింపఁబడెనని చెప్పఁబడినది.

నరపాలురు బలవంతులుకాక దుర్బలులై యుండినపుడు మేధావంతులై యుండు పురోహితులు రాజ్యవ్యవహారములలోఁ బాల్గొనుచుఁ బ్రబలాధికారములను సంపాదించుకొనుచుండెడివారు. ఇట్టి యధికారమాతనియాజనాదివృత్తులచే సంభవింపదని మనము నిశ్చయింపవచ్చును. నరపాలుఁడు దుర్బలుఁడై జ్ఞానహీనుండై యుండినపుడు బుద్ధిమంతులగు పురోహితులు రాజును వశీకరించుకొని యెక్కువగా ధనము నార్జించి ప్రబలమగు నధికారములను బొందుచుండెడివారని తెలియనగును. అట్టిసమయమునఁ బురోహితుఁ డధికారయుతుండై యుండినచోఁ దాను రాజున కర్థధర్మానుశాసకుండగుటచే రాజ్యవ్యవహారములం దానే నడుపుటకుఁ బ్రయత్నించుచుండును. పురోహితులైశ్వర్యకాములును, యశస్కాములునునై యనేకరాజుల పౌరోహిత్యము సంపాదింప యత్నించుచుండెడివారని తెలియ

నగును. ధోనశాఖజాతకములోఁ బింగియుండను పురోహితుఁడు యశస్కాముండై యీరీతిగ వితర్కించెను: "ఈరీతిగ నేను నరపాలుఁడు భరతఖండమునఁ గలరాజులనందఱను జయించునటులఁ జేసెద. ఆతఁడు భరతఖండమంతటికిని సమ్రాట్టైన నే నేక పురోహితుఁడనై యశము నొందెదను" శతపథబ్రాహ్మణంబున (II 4, 4, 5.) దేవభాగ శ్రౌతర్షుండనువాఁడు కురుసృంజయరాజులకుఁ బురోహితుండై యుండెనని జెప్పఁబడినది.

జాతకకథలలోఁ గొన్నిటియందుఁ బురోహితులు ధనకాంక్షం గలిగి దురాశాపరులై యుండినట్లు చెప్పఁబడినది. లోహకుంభిజాతకములో యజ్ఞారంభమున శిష్యులలో నగ్రగామి పురోహితుని కడకుఁ బోయి "ఓయాచార్యా! వేదములో నరవధ శుభావహము కాదని చెప్పఁబడియుండలేదా?" అని ప్రశ్నింపఁ బురోహితుఁడు "నీవు రాజధనముం దెమ్ము. భక్ష్యములు గలిగియుందుము. ఊరకొనుము" అని సమాధానము చెప్పెననియున్నది. మహాసుపినజాతకములోఁ బ్రాజ్ఞుండును ధార్మికుండును నగు విద్వాంసుఁడు జంతుహింస పాపజనకంబని విచారించుచుండఁగాఁ బురోహితుఁడు "ఓయీ! పుత్రకా! ఈరీతిని మనకు ధన మెక్కువగ లభించును. నీవు మాత్రము రాజధనమును రక్షించుటకు యత్నించునట్లు గాన్పించుచున్నావు" అని నుడువుచు వానిని మాటాడకుండునట్లు చేసెను. పురోహితులు, యజ్ఞములను, గ్రహశాంత్యాదికర్మముల మాత్రమే గాక వివిధములగు కర్మములం జేయించి ధనమార్జించుచుండెడివారు. హస్తిమంగళోత్సవము నిర్వర్తించిన పురోహితునకు, హస్త్యలంకారము లేగాక కోటి సువర్ణంబులును ముట్టుచుండెడివి, (సునీమజాతకము II 46). జాతకములలో ననేకస్థలములందుఁ బురోహితులు ధనలోలురని చెప్పఁబడినది. సిగాలకజాతకములో సృగాలము "బ్రాహ్మణులు ధనలోలురు"



అని నిందించెనని యున్నది. సుసీమజాతకములో బ్రాహ్మణులు భూపాలునియొద్దకుం జని పురోహితుండు మృతుఁడును నాతని పుత్రుం డల్పవర్షీయుం డగు బాలుఁడును నగుటచే హస్తిమంగళోత్సవ మాతఁడు చేయించుట కసమర్థుఁడనియును దామే యాయుత్సవము జేయించుట కర్హులనియును ధనకాంక్షచే రాజుతోఁ జెప్పి వానియాజ్ఞను బడసినందులకు నిందితులైరని చెప్పఁబడియున్నది. ధనకాంక్షచే బ్రాహ్మణు లెట్టి నీచకార్యములైనఁ జేయుదురనునిందను జెందుచుండెడివారని తెలియుచున్నది. అసిలక్షణములం జెప్పఁగలనని చెప్పి తనకు లంచమిచ్చినవాఁడు క్రయమునకై తెచ్చినకరవాలము సులక్షణయుక్తంబై యున్నదనియు, లంచమీయనివాఁడు క్రయమునకై తెచ్చినకత్తి దుర్లక్షణయుక్తంబై యున్నదనియుఁ జెప్పుచు ధనమార్జించుచుండెడివాఁడని అసిలక్షణజాతకమున (I 455) నొకబ్రాహ్మణుఁ డుపహసింపఁబడినట్లు చెప్పఁబడినది.

బ్రాహ్మణులు లజ్జారహిత స్వభావముకల వారని కొన్ని జాతక కథలలో నిదింపఁబడుచున్నారు. పూర్వము బ్రహ్మదత్తుఁడు వారణాసిని బరిపాలించు నపుడు జున్హకుమారుఁడు తక్కశిలానగరంబున విద్యల నభ్యసించుచుండె. ఆ కుమారుఁ డొకనాటి రాత్రి గురుగృహమును విడిచి తన వాసస్థానమునకుం జనుచుండ బ్రాహ్మణ విద్యార్థియొక్కఁడు భిక్షాటనముం గావించి నిజ గృహమున కేగుచుండెను. కటిక చీఁకటియగుటచే జున్హకుమారుఁడు బ్రాహ్మణ విద్యార్థిని గనలేక యాతనిం దాఁకఁగా నాతని హస్తమునను న్న భిక్షాపాత్ర క్రిందఁబడి వ్రక్కలాయెను. బ్రాహ్మణ కుమారుఁ డంతఁ గ్రిందఁబడి యేడువనారంభించెను. రాజ కుమారుఁడును గడుజాలినొంది వెనుకకుఁ దిరిగి బ్రాహ్మణ బాలకుని భూమిపైనుండి

లేవఁదీసెను. అంత నాతఁడు "ఓయీ! నా భిక్షా పాత్రమును విరుగఁగొట్టితివి. నాకాహారము నిమ్ము," అని వేడుకొనెను.

"బ్రాహ్మణుఁడా! నే నిపుఁడు ధనము నీఁ గొనంగనేరను. నేను కాశీ రాజునకుఁ బుత్రుఁడను, నా పేరు జున్హుఁడు, కావున నేను రాజ్యాభిషిక్తుఁడనైన వెనుక నన్ను ధనమునకై యర్థింపుము," అని యా రాజ కుమారుఁడు ప్రత్యుత్తర మొసంగెను.

పిదప నా రాజ కుమారుఁడు విద్యాభ్యాసము ముగించి యాచార్యు సెలవుం గైకొని వారాణసిం జేరి జనకునకుఁ దాను నేర్చిన దంతయుఁ దెలియఁబఱచె. ఆ రాజు తన మరణమునకుఁ బూర్వమే కుమారుఁడు తిరిగి వచ్చెనని సంతసించి యాతని రాజ్యాభిషిక్తునిఁగ జేసి రాజ్య భారమాతనియందిడెను. జున్హ నరపాలుఁడంత ధర్మ పరిపాలనం బొనర్చుచుండె. బ్రాహ్మణుఁ డీయుదంతమును విని తన భోజనార్థమాతనివలన ధనము సంపాదింప నుద్దేశించి వారణాసికిం బోయి యుత్సవసమయమున నలంకృతమైన పురమున రాజూరేగుచుండ నున్నతస్థలంబు నధిష్ఠించి "రాజునకు జయమగుగాక" అని కేక వేసెను. రాజాతనిం జూడక యే చనుచుండ బ్రాహ్మణుండు "ఓ నరపాలకా! నా వచనము లాలకింపుము. నే నొక యుద్దేశముతో నిటకు వచ్చితిని. పర్యటించుచుండు బ్రాహ్మణునిఁ ద్రోవలోఁ గలియునపుడు వానితో ముచ్చటించకుండఁబోఁగూడదని పెద్దలు చెప్పుదురు," అని యెలుగెత్తియఱచెను.

రాజా వచనములను విని మణిస్థాపితంబగు నంకుశంబుతో గజము నాఁపి యీ రీతిగఁ జెప్పెను: "ఓ బ్రాహ్మణుఁడా! నే వింటిని. నిలుచుండియున్నాఁడను. ఏ కార్యముకై యిటవచ్చితివో నన్నేమి యర్థించుచున్నావో చెప్పుము." అప్పుడు వారి కీరీతిగ సంభాషణము జరిగెను.



బ్రా—ధనవంతములగు రెండు గ్రామములను, నూఱుగురు దాసులను, నేడువందల గోవులను, బదివేల కంటె నెక్కువగు సువర్ణంబులను, సమవర్ణజలగు నిరువురు భార్యలను నాకొసంగుము.

రా—ఓయీ! నీవు ఘోరతపం బాచరించితివా? మంత్రబలోపేతుండవైయున్నావా? నీకేమైనా భూతపిశాచములు వశ్యములై యున్నవా? నాకేమైన నుపకార మొనర్చితివా? చెప్పుము.

బ్రా—నేనేమియు ఘోరతపం బాచరించియుండలేదు. మంత్రము లేవియు నాకుఁ దెలియవు. భూతపిశాచాదులేవియు నాకు వశ్యములై యుండలేదు. నీకు నేనేమియు నుపకార మొనర్చినటులు గూడ జ్ఞాపకములేదు. కాని యింతకుమున్ను మనము కలసికొని యుంటిమి, దాని మూలముననే యీ నారాక.

రా—నిన్ను మొదటి పర్యాయమే చూచితిని. నీ వెవ్వరివాఁడవో నాకుఁ దెలియదు. ఎచ్చోట నెపుడు మనము మున్ను గలిసికొంటిమో తెలియఁజెప్పుము.

బ్రా—గాంధార రాజుయొక్క రమ్యంబును ముఖ్యపట్టణమును నగు తక్కశిలానగరంబున మనమిరువురమును వసించుచుంటిమి. ఆ పట్టణమున నడిరేయి నొకసారి మనమిరువురము కలిసికొని సన్నేహావచనముల సంభాషించితిమి. అంతకుఁ బూర్వమునఁ గాని పరమునఁగాని యొకపర్యాయమును గలిసియుండలేదు.

వారిట్లు కొంతవఱకు సంభాషించిన వెనుక రాజాతని యభీష్టముందీర్చి సత్కరించెను. దుశ్చరితులును బాపకర్ములున్నగు బ్రాహ్మణు లెందరో జాతకకథలలోఁ గాన్పించుచున్నారు. సంభవజాతకములో నిట్లున్నది. కురు దేశపాలకుండైన ధనంజయకౌరవ్యుఁడు పురోహితుఁడైన సుచీరతుని ధర్మయజ్ఞముం గూర్చి దెలిసికొనిరమ్మని వారాణసీవాసుఁడగు బ్రాహ్మణ విదురుని కడకంపెను. విదురుని కడ కా బ్రాహ్మణుఁడు చని ధర్మయజ్ఞముగూర్చి ప్రశ్నింప నాతఁడు

తన పుత్రుఁడగు భద్రికారునివలనఁ దెలిసికొమ్మని చెప్పిపంపెను. సుచీరతుఁ డా భద్రకారునియొద్దకుంబోయి యజ్ఞముంగూర్చి ప్రశ్నింప నాతఁడు “ఓయీ ప్రియుఁడా! ఈ దినములలో నేను బరుని భార్యను వశీకరింప యత్నించుచున్నాను. కాన నా మనసు తత్సంబంధములైన యాలోచనలతో నిండియుండుటచే నీ ప్రశ్నమున కుత్తరమీయఁజాలను గాన నాసోదరుండైన సంజయుని నడిగి తెలిసికొనుము,” అని ప్రత్యుత్తరమొసఁగెను. అంత నా పురోహితుఁ డాసంజయుని సమీపించెను గాని యాబ్రాహ్మణ యువకుఁ డింకొకని భార్యను మోహించి యాపెతో విహరించుటకై యుదయమునను సాయంకాలమునను గంగానది నీది దాటుచుండుటచే నానదియందుఁదాను మునిఁగి చచ్చిపోవుదునను భయముతో నాతని మనసునిండియుండుటచే నాతఁడు తన కనీయసోదరు నడిగి తెలిసికొనుమని పంపెను.

ఈ కారణములచే శీలవంతులగు బ్రాహ్మణులుకూడ బౌద్ధులచే నిరసింపఁబడుచుండెడి వారని మన మూహింపరాదు. సద్బ్రాహ్మణులెల్లెడలఁ బూజింపఁబడుచుండెడివారు. బౌద్ధులు పూతచరితుఁడును, ధర్మాచరణపరాయణుండునునగు వానినే బ్రాహ్మణునిఁగం బరిగణించుచుండెడివారని తెలియనగును. ఉద్దాలకజాతకంబున నెట్టివాఁడు బ్రాహ్మణుఁడో నిరూపింపఁబడినది. అగ్నిపూజమున్నగునవి బ్రాహ్మణ ధర్మములని యుద్దాలకుఁడు చెప్పఁగాఁ బురోహితుఁడు సద్బ్రాహ్మణుని లక్షణముల వర్ణించెను. బౌద్ధులచేతఁ బరివ్రాజకులైన శ్రమణులును సద్బ్రాహ్మణులును సమానముగ గౌరవింపఁబడుచుండెడివారు. ధమ్మపథంబున సద్బ్రాహ్మణు లీరీతిగఁ గీర్తింపఁబడుచున్నారు:—“చర్మపట్టవరత్రశృంఖలంబులను ఛేదించి, యర్గళముల బంధించి ప్రబుద్ధుండైనవానినే బ్రాహ్మణుం డని చెప్పెదను” “నరశ్రేష్ఠుండై, యుత్తముండై, మునియై, గుణవంతుఁడై, సుఖదుఃఖతుల్యుండై, ప్రాజ్ఞుండై ప్రబుద్ధుండైనవానినే బ్రాహ్మణుండని చెప్పెదను” (ధమ్మపదము 26 అధ్యాయము॥ బ్రాహ్మణుఁడు)

# ౯

## అమాత్యులు

పూర్వకాలపు రాజ్యములలో భూపాలు రెట్టి యుద్యోగుల నియోగించి రాజకీయవ్యవహారముల నిర్వర్తించుకొనుచుండెడివారో కౌటిలీయార్థశాస్త్రంబువలనఁ దెలియవచ్చుచున్నది. నరపాలుఁడె రాజకీయవ్యవహారములఁ బరాపేక్షలేక చేయుట యసంభవము. నృపులెట్టి నిరంకుశాధికారము గల్గిన సమ్రాట్టులైనను వ్యవహారములయందుఁ బరుల యుపదేశములు లేకుండఁగఁ గార్యముల నిర్వర్తింపఁ గలుగనేరరనునది నిశ్చయము. కౌటిలీయార్థశాస్త్రంబునలన వేదకాలములలోఁ గాన్పించు పృథుశక్తియుక్తములగు సమితులును, సమాజములును మాత్రము క్రీస్తుజననమునకుఁ బూర్వపు నాలుగయిదు శతాబ్దములలో దేశమునుండి యంతరించినవని తెలియవచ్చుచున్నది. వేదకాలములలోఁ బ్రజాసమితులు రాజుయొక్క నిరంకుశాధికారమును గొంతవఱకుఁ దగ్గించి రాజును నియమబద్ధునిఁగ నొనర్చుచుండెడివని మనమూహింపవచ్చును. కాని బౌద్ధకాలములో బహుఫలవంతంబులగు భూముల నాక్రమించి యైశ్వర్యసంపదలతో నోలలాడుచు దేశక్షోభము లెట్టివియు లేక సుఖులై జీవించుచు జనులు పూర్వమునఁ దాము గలిగియుండిన యధికారములఁ గొంతవఱకు మఱచి జీవించుచుండినటులు మనకుఁ గాన్పించును. ప్రబలవిరోధులవలనఁ గలుగు భయము లేకుండుటచేఁ గృషిపాశుపాల్యవాణిజ్యాదులచేఁ బ్రజలు తమయర్థములను, రిక్థములను వృద్ధిపొందింపఁ బ్రయత్నించుచు రాజకీయ వ్యవహారములలోఁ బాల్గొనక సుఖజీవనముల నపే

క్షించుచుఁ దమకాలములఁ గడపుకొనఁ బ్రయత్నించుచుండెడి వారని మన మూహింపవచ్చును.

అర్థశాస్త్రమునఁ గౌటిల్యుఁ డింద్రియజయము నరపాలున కత్యావశ్యకమని నిర్ణయించి—

“సహాయసాధ్యం రాజత్వం । చక్రమేకం న వర్తతే
కుర్వీతసచివాం స్తస్మాత్ । తేషాంచశృణుయాన్మతమ్”

అని నుడివె.

రాజత్వంబు సహాయసాధ్యంబు. ఒక్క చక్రంబు తిరుగఁజాలదు. ఆకారణమువలన సచివుల రాజు నియోగింపవలెను. అమాత్యులు రాజులకు రాజకీయవిషయములలో నుపదేశముల నొసంగుచు రాజ్యతంత్రములలో రాజునకు సహాయభూతులై రాజనియోగముల భక్తిశ్రద్ధలతో నిర్వర్తించుచుఁ బ్రభునకు మేలుఁ గావించుచుందురు. అమాత్యుల నియోగించుట సులభము కాదు. అమాత్యసంపత్తిఁ గూర్చి ముచ్చటించుచు నమాత్యుల గుణముల నీరీతిగఁ గౌటిల్యుఁ డభివర్ణించెను.

“జానపదోభిజాతః స్వవగ్రహః కృతశిల్పశ్చ
క్షుష్మాన్ ప్రాజ్ఞో ధారయిష్ణుర్దక్షో వాగ్మీ
ప్రగల్భః ప్రతిపత్తిమానుత్సాహ ప్రభావయుక్తః
క్లేశసహః శుచిర్మైత్రో దృఢభక్తిః శీలబలా
రోగ్యసత్వసంయుక్తః స్తమ్భచాపల్యవర్జితః
సంప్రియో వైరాణామకర్తేత్యమాత్యసంపత్”

“స్వదేశీయుఁడును విశుద్ధాన్వయసంభవుఁడును, ప్రామాదికకార్యములనుండి వారింపఁజాలినవాఁడును, శిల్పములయందు శిక్షఁ బొందినవాఁడును, నర్థశాస్త్రము చక్షువుగఁ గల్గినవాఁడును సహజప్రతిభాయుక్తుఁడును, మఱపులేనివాఁడును, దక్షుండును, వాగ్మియుం



ప్రౌఢుండును, ప్రతికర్తృత్వప్రతివక్తృత్వసమర్థుండును, నుత్సాహప్రభావయుక్తుండును, జితశ్రముండును, శుచియు, మిత్రభావంబుతో మెలంగువాఁడును, దృఢభక్తియుక్తుండును, శీలవంతుండును, దేహశక్తియుక్తుండును, నారోగ్యవంతుండును, సత్త్వయుక్తుండును, నిర్గర్వుండును, స్థిరప్రకృతివంతుండును, సౌమ్యదర్శనుండును, వైరానుత్పాదకుండును, యమాత్యుండును, నై యమాత్యుఁ డుండవలయును. ఇట్టి గుణసంపన్నులగు సచివులు రాజునకును బ్రజలకును గూడ మేలుఁ గలుగఁజేయు సమర్థులై ప్రభువునకు నుపదేశము చేయఁగలిగియుందురు. ఇట్టి సచివులను నరపాలురు నిరాకరింపనేరరు.

కౌటిలీయార్థశాస్త్రంబున మంత్రియు, మహామాత్రులును, నమాత్యులును వేర్కొనఁబడుచున్నారు. మంత్రియనఁ బ్రధానమంత్రి. రాజునకుపయుక్తమగు నుపదేశముచేయ సమర్థుఁడు. మంత్రి యాంగ్లేయరాజ్యములోఁ బ్రధానమంత్రినిబోలియుండునని మన మూహింపవచ్చును. మహామాత్రులు తదితరమంత్రులతో సమానులగుదురు. అమాత్యులు రాజకీయవ్యవహారములం బొందుపఱచు నున్నతోద్యోగులు. వీరలు “సివిల్సెర్వెంట్సును” (Civil servants) పోలియుందురు. ఏడవయధ్యాయములో వేదకాలమునఁ బ్రజాసమితులును సభలును బృథుశక్తియుక్తములై నరపాలురను నయితము లోఁబఱచుకొనునంతటివై యుండెడివని నిరూపించితిమి. ఈసమాజములయొక్కయు, సమితులయొక్కయు నధికారములు మహామాత్రుల సభ కొంతవఱకుఁ గలిగియుండెడిదని మన మూహింపవచ్చును. కౌటిలీయార్థశాస్త్రములో నరపాలుఁడు సమ్రాట్టయ్యు రాజకీయవ్యవహారములం జేయునపుడు మహామాత్రులతో మంత్రణంబుఁ గావింపక యెట్టికార్యములఁ జేయఁగూడదని విధియింపఁబడినది.

కౌటిల్యుఁడు "సర్వవిషయములం గూర్చియుఁ బరవిషయములం గూర్చియుఁ గృత్యాకృత్యముల లెస్సగఁ బరిశీలింపవలయును. సర్వారంభములును మంత్రపూర్వకములు" అని వచించె.

నరపాలు రెట్టి కార్యములం దలపెట్టినను మంత్రులతో నాలోచించిచేయవలయునని పూర్వ న్యాయవేత్తల మతమని కౌటిలీయార్థశాస్త్రమువలన స్పష్టమగుచున్నది. ఈ మంత్రులలోఁ బ్రధానుఁడతిగౌరవార్హుఁడై యుండి నరపాలునకు దక్షిణహస్తమువలె నుండెడివాఁడని పై గ్రంథమునుబట్టి నిశ్చితమగుచున్నది.

జాతకకథలవలన నీయమాత్యులును విశేషాధికారోపేతులై యుండెడివారని తెలియవచ్చుచున్నది. పూర్వాధ్యాయములలో నరపాలుఁడు పుత్రహీనుండై మరణించిన నమాత్యులు రాజు నెన్నుకొను నాచారమును జూపించు జాతకకథలఁ గొన్నింటిని గనఁబఱచితిమి. ఘట జాతకములో భూపాలుఁ డొక్కరుఁడు సంసారబాధలను రాజ్యకష్టములను సహింపనోపక యమాత్యులకు రాజ్యము నొప్పఁజెప్పి పరివ్రాజకుండై యడవులకుం జనెనని చెప్పబడినది. ("రాజ్జమ్ అనుచ్చాచనమ్ నియ్యాదెత్వా" III 170). రాజవోద జాతకములో జనపదంబులఁ బర్యటించి జానపదులను బరీక్షింపఁగోరి రాజ్యభారమును మంత్రులపైఁబడవేసి రాజు మాఱువేషముతో నగరమును విడిచి చనెనని చెప్పంబడినది. నరపాలుఁడు శక్తివంతుండై, ప్రభావయుక్తుండై, మేధావియై, కార్యదక్షుండైయుండిన రాజ్యపరిపాలనము వానిచేతనె నడుపఁబడును. రాజు దుర్బలుండైయుండిన మంత్రులే రాజ్యమును బరిపాలించుచుందురు. నరపాలు రమాత్యుల కపక్రియ గావించుటయు జాతకకథలలోఁ గాన్పింపకపోదు. దరిముఖ జాతకములో రాజమాత్యుల స్థానాంతరముల విచారించెనని చెప్పంబడినది.



అమాత్యులలో నర్థధర్మానుశాసకామాత్యుఁడు ముఖ్యుఁడని జాతకకథలవలనఁ దెలియుచున్నది. తఱచుగ నీయమాత్యుఁడు బ్రాహ్మణవర్ణమును జెందినవాఁడె కావలయు. మనువును నిట్టివానినే యమాత్యముఖ్యునిఁగ నిరూపించెను. (VII 141)

శ్లో॥ అమాత్యముఖ్యం ధర్మజ్ఞం। ప్రాజ్ఞం దాంతం కులోద్గతం
స్థాపయేదాసనే తస్మిన్। ఖిన్నః కార్యేక్షణే నృణామ్ ॥

"రాజు తాను గార్యములను జూచుటయందు ఖిన్నుఁడై నప్పుడు మంచికులమందుఁ బుట్టినట్టియు ధర్మజ్ఞుఁడును బ్రాజ్ఞుఁడును జితేంద్రియుఁడునగునట్టియు మంత్రిశ్రేష్ఠుని ధర్మాసనమందు నియోగింపవలయును." ఇట్టి యమాత్యముఖ్యుండు సర్వార్థనిర్వాహకుండై యుండెడి వాఁడని జాతకకథలలోఁ జెప్పంబడినది, (సుహనుజాతకము) (II ,30, కలాయముష్టిజాతకము 74). ఈ యమాత్యుఁడు భూపాలుని ధర్మార్థ విషయములలో ననుశాసించుట తప్ప వేఱెట్టి రాజకీయ వ్యవహారములంజేయుచుండెడి వాఁడో తెలియరాకున్నది.

అమాత్యులలో నొక్కఁడుగనుఁ గొన్నిచోట్ల వారలలో ముఖ్యుఁడుగను, బరిగణింపఁబడి సర్వత్ర విశేషోద్యోగిగఁ బాటింపఁబడుచుండినవాఁడు సేనాపతియని జాతకకథలవలనఁ దెలియనగును. సేనాపతి రాజబంధువై యుండి క్షత్రియుఁడై యుండుట జాతకకథలలోఁ గాన్పింపకపోదు. (దేవధమ్మజాతకము. కామజాతకము) I 133. IV 168. ఈ యుద్యోగి యెట్టి యధికారములు గలిగి యుండి యేయే వ్యవహారములఁ జేయుచుండెడివాఁడో నిశ్చయముగనే జాతకకథలలోను నిరూపింపఁబడలేదు. యుద్ధసమయములలో నీతఁడు సేనలనడుపుచు దేశముల రక్షించుచుండెడివాఁడు. అట్టి సమయములయందు నరపాలుని తరువాత నీతఁడు సైనికోద్యోగులలో ముఖ్యుఁడైయుండు. ఇతరసమయములయందు నెట్టిరాజకీయ వ్యవహార

ములఁ జేయుచుండెడివాఁడో తెలియరాకున్నది. ఐన నాతఁడు న్యాయస్థానము నలంకరించి వ్యవహారములలోఁ బ్రాడ్వివాకునివలె ధర్మ నిశ్చయము గావించుచుండినటులు జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది, (II, 186). ధమ్మద్ధజ జాతకకథలో సేనాపతి న్యాయాధికారియై వ్యవహారముల ధర్మవినిశ్చయముఁ జేయునపుడు "లంచముఁ దిని" న్యాయవిరుద్ధముగఁ దీర్పులం జెప్పుచుండెడివాఁడని చెప్పఁబడినది. తెసకున జాతకంబులో మహాసేనాపతి పేర్కొనబడుచున్నాఁడు. ఈ యుద్యోగి యెట్టి వ్యవహారములం జేయుచుండెడివాఁడో తెలియరాదు. ఈ జాతకకథలో సేనాపతికి నమాత్యులు రాజ్యము నర్పించిన నాతఁడు రాజ్యమును నిరాకరించి ధర్మముల సువర్ణఫలకములపై లిఖియింపించి వనములకుం జనెనని చెప్పఁబడినది. బహుపురాతన కాలమునుండియు ధర్మములఫలకములపై వ్రాయించి ధర్మసందేహములు లేకుండఁజేయు నాచారముండెడిదని స్పష్టమగుచున్నది.

న్యాయస్థానముల నలంకరించుచుండెడి యుద్యోగులును బేర్కొనఁబడుచున్నారు. ఈ యుద్యోగులలో (వినిచ్ఛయామచ్చ) వినిశ్చయామాత్యుం డొక్కరుఁడు. ఈతఁడు ధర్మ విషయములలో ముఖ్యామాత్యుండై యుండనోపు. ఈతఁడు ధర్మవిషయములలోను, నీతి విషయములలోను రాజునకు నుపదేశములం గావించుచుండెడి వాఁడని కురుధమ్మ జాతకమువలనఁ దెలియవచ్చుచున్నది. మహాపరినిబ్బానసుత్తవ్యాఖ్యానములో (వినిచ్ఛయమహామత్త) వినిశ్చయ మహామాత్రులు న్యాయోద్యోగులలో నవరులనియు, వారి తీర్పుల ధర్మాధర్మముల నిశ్చయించువారు (వోహారిక) వ్యావహారికులనియుఁ జెప్పఁబడినది. వీరలీ కాలపు డిస్ట్రిక్టు మున్సిఫులవలెను, సబ్జడ్జీలవలెను



నా పూర్వకాలమున న్యాయాధికారులై యుండెడివారని మన మూహింపవచ్చును.

రాజామాత్యులుగఁ బేర్కొనబడిన వారలలో (రజ్జుగ్గాహక) రజ్జుగ్రాహ కామాత్యుఁ డొక్కరుఁడు. ఈయమాత్యుఁడు క్షేత్రములం గొలిచి రాజకరమును నిర్ణయించువాఁడు. క్షేత్రములఁగొలుచు నుద్యోగు లందఱపై నుండునున్నతాధికారియై యీతఁడుండనోపు. కురుధమ్మ జాతకములో నీయమాత్యుఁడె క్షేత్రములం గొలుచుచుండినటులు జెప్పంబడెను. కామజాతకములో (VI 169) మాత్ర మీ యుద్యోగిచేతిక్రిందనుండు తదితరోద్యోగులు క్షేత్రములం గొలుచుచుండెడి వారని చెప్పంబడినది. రజ్జుగ్గాహకుఁ డిప్పటి సర్వేయరు జనరలు (Surveyor general) తో సరిపోవును.

అమాత్యులలోఁ బైనిజెప్పంబడిన నలువురు మాత్రమే జాతకకథలలోఁ బేర్కొనబడుచున్నారు. అమాత్యులకంటెఁ దక్కువైనవారు మహామాత్రులు. వీరిలో దోణమాపక మహామత్తుఁడు ప్రముఖుఁడు. ఈతఁడు రాజకరమును గ్రహించునట్టి యున్నతోద్యోగి. రాజకర గ్రాహకులలో (Revenue officials) నీతఁడు ముఖ్యుఁడు. ఈ యుద్యోగి క్రింద స్వల్ప వేతనముల స్వీకరించుచు రాజకరముల గ్రహించునట్టి యల్పోద్యోగస్థులెందఱో యుండెడివారని మన మూహింపవలయును. ఆకాలమునఁ బంటలలో నేదియో యొకవంతును రాజభాగముగ నీ యుద్యోగులు గ్రహించుటచే 'దోణమాపక' అను నామమట్టి యుద్యోగికిఁ దగియుండు. ఈ యుద్యోగి రాజ భాగములను గ్రహించువాఁడు గాన మహామాత్రుఁడై, యధిక గౌరవోపేతుఁడై యుండెడివాఁడు, (కురుధమ్మజాతకము II. 378). సారథి రాజభోగ్గులలో నొకఁడు; "రాజభోగ్గ" అన రాజునొద్దనుండి వేతనమును గైకొని రాజుచేఁ బోషింపఁబడు నుద్యోగి. జాతకకథలలో (II 377

కురుధమ్మజాతకము) సారథి పేర్కొనఁబడి నప్పటికిని నే కారణము వలననో సంస్కృత గ్రంథములలోఁ బేర్కొనఁబడిన గౌరవముతోఁ బేర్కొనఁబడియుండలేదు. (III, 193) శీలవీమంశ జాతకములో హెరన్నికుఁడును (IV, 43, V 123) నిగ్రోధజాతకములోను తెసకున జాతకములోను భండాగారికుఁడును బేర్కొనఁబడుచున్నారు. హెరన్నికుఁడు ధనాగారముపై నియోగింపఁబడు నుద్యోగి. నిగ్రోధ జాతకములోఁ బొత్తికుఁడను కుట్టు పనివాని కొడుకు దన మిత్రులలో నొక్కరుఁడు రాజును, రెండవవాఁడు సేనాపతియుఁ, దాను భండాగారికుఁడును మఱునాఁ డగుదురని చెప్పెననియున్నది. ఆప్రకారము మఱు నాఁడాతని మిత్రుఁడు రాజై పొత్తికునకు సైన్యాధిపత్యమునొసంగెనుగాని యాతఁడాపదవిని నంగీకరింపక భండాగారిక పదవినే కోరెను. భాండాగారాధ్యక్షుని స్థానము సర్వ శ్రేణివిచారణార్హ్మమని (IV 43) నిగ్రోధ జాతకములోఁ జెప్పంబడినది. (సబ్బ సేణీవమ్ విచారణారహమ్ భండాగారికట్ఠానమ్). ఈ యుద్యోగులలో దౌవారికుఁడు (దోవారిక) నీచ స్థానము వాఁడని పేర్కొనఁబడలేదు. కురుధమ్మజాతకములో రాజభోగ్గుల క్రమములో వేశ్యలంతమునను వారికంటెఁ బైని దౌవారికులును బేర్కొనఁబడిరి. మహాపింగళజాతకములో నీక్రమము "అమాత్యబ్రాహ్మణ గృహపతి రథిక దౌవారికాదులు" (II 241) అను వరుసతోఁ బేర్కొనఁబడెను. మతంగజాతకములో నీదౌవారికులు రాజప్రాసాదములోనికిఁ దొంగిచూచు చండాలాదులను గఱ్ఱలతోఁ గొట్టుచుండినటులు చెప్పంబడినది. ఈదౌవారికులు స్వాములవలనఁ బొందెడికష్టములు మహాపింగళ జాతకములో నభివర్ణింపఁబడినవి. దౌవారికులు సాయంసమయమున మూఁడుపర్యాయముల్లు శంఖమును బూరించి ద్వారములు మూయుచుందురు. నగరగుట్టికుఁడు నిశాసమయమునఁ బురమునందుఁ జోరుల



నుండి జనులను రక్షించుచుండు నుద్యోగి. పురమునఁ జోరుండొక్కరుఁడు జనులకు బాధ కలుగఁజేయుచుండుటచే జనులు రాజునొద్దకుం జని తమ్మును జోరభయమునుండి రక్షింపుమని ప్రార్థించిరి. రాజు నగరగుట్టికుని రావించి యాచోరునింబట్టి వధియింపుమని యాజ్ఞాపించెను, (కణవేరజాతకము III 59). నగరగుట్టికునివంటి వాఁడు చోరఘాతకుఁడు. ఈతఁడు దండపాశకుఁడు. మనుధర్మశాస్త్రములో మరణదండనము విధియింపఁబడిన యపరాధులు చండాలురచే వధియింపఁబడవలయుననియుఁ, జండాలురవృత్తివధియించుటయనియుఁ జెప్పంబడినది. జాతకములలో మాత్ర మియ్యది చెప్పంబడలేదు. రాజుచేఁ బిలువంబడినపు డాతఁడు కుఠారంబును, గంటకావృతమైన రజ్జువును గ్రహించి పీతాంబరమును గట్టుకొని రక్తపుష్పములను శిరమున ధరియించి (ఖంతివాతిజాతకము III 41, III 179 చుల్లధమ్మపాల జాతకము) రాజసమక్షమునకుం జని వానికి నమస్కరించి యాతని యాజ్ఞఁ దెలియ వేఁడును.

రాజభోగ్గకులలోఁ గుంభకారులును, (రాజుపద్దాకనలకారుఁడు) వేణుఁడును, మాలాకారుఁడును బేర్కొనఁబడుచున్నారు, (V 290, 291, కుసజాతకము 292). మంగలులు రాజులకంగమర్దనం బొనర్చియు, క్షౌరముంజేసియు, శిరోజములఁ గత్తిరించియు రాజులకిష్టులై యుండి వారిదయకుఁ బాత్రులై ధనము నార్జించుచుండెడివారు. ఈ మంగలులు 'అక్షములను' ఫలకములపైఁ బేర్చుచుండెడివారని సిగాలజాతకములోఁ జెప్పంబడుటచే వీరలు రాజులకు రేయింబవళ్ళు సేవచేయుచుండెడివారని మనమూహింపవచ్చును.

కుశజాతకములో దాసులును, భృతిభుజులును బాచకులుగ నియమింపబడుచుండెడివారని చెప్పఁబడినది. భోజనప్రియుఁడగు రాజునకు సేవకులలోఁ బాచకుఁడు ముఖ్యుఁడైయుండు.

గాంధర్వవిద్యాకుశలులను, నాటకులను, నటులను, గాయకులను, హస్తిదమకులను, ధనుర్గ్రాహకులను రాజులు వేతనమొసంగి పోషించుచుండెడివారని జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది.

శంఖము నూఁదువారును, భేరులవాయించువారును రాజసేవకులైయుండి యనల్ప వేతనములను బొందుటచే నిట్టి పనులకయి తదితరులును బ్రయత్నములను సలుపుచు నట్టి ప్రయత్నములలోఁ గృతార్థులు కాకపోయినపు డట్టివారు ధనవంతులగు శ్రేష్ఠి కుమారుల సేవకులగుచుండెడివారు, (II 431 భద్రఘట జాతకము). రాజ సేవకులలో నఘకారకుండొక్కరుఁడు. గజములు, అశ్వములు, మణులు, సువర్ణము మున్నగువానిఁ బరీక్షించి వాని ధర నిర్ణయించుట యీ యుద్యోగి పని. కౌటిలీ యార్థశాస్త్రంబున నమాత్యులలో నీ దిగువ నుదాహరింపబడిన వారు పేర్కొనఁబడుచున్నారు.

1. సువర్ణాధ్యక్షుఁడు.
2. కోష్ఠాగారాధ్యక్షుఁడు.
3. పణ్యాధ్యక్షుఁడు.
4. కూప్యాధ్యక్షుఁడు.
5. ఆయుధాగారాధ్యక్షుఁడు.
6. పౌతవాధ్యక్షుఁడు.
7. శుల్కాధ్యక్షుఁడు.
8. సూత్రాధ్యక్షుఁడు.
9. సీతాధ్యక్షుఁడు.
10. సురాధ్యక్షుఁడు.
11. సూనాధ్యక్షుఁడు.
12. గణికాధ్యక్షుఁడు.
13. నావధ్యక్షుఁడు.
14. గోధ్యక్షుఁడు.
15. అశ్వాధ్యక్షుఁడు.
16. హస్త్యధ్యక్షుఁడు.
17. రథాధ్యక్షుఁడు.
18. పత్త్యధ్యక్షుఁడు.
19. ముద్రాధ్యక్షుఁడు.

ఈ రాజోద్యోగులం గూర్చి మ॥ రా॥ శ్రీ॥ వెంకటరంగయ్యగారు తమ కౌటిలీయార్థశాస్త్రాంధ్రపరివర్తనమందైన యుపోద్ఘాతములో నీరీతిగ వ్రాయుచున్నారు.



“సామాన్యముగ నమాత్యపదమును మంత్రిపదమునకుఁ బర్యాయపదముగ మనము వాడుచుందుము. కాని కౌటిల్యుని గ్రంథమందు దానికట్టి యర్థములేదు. ప్రతి రాజసేవకుఁడు నమాత్యుఁడనియే పిలువఁబడుచుండెను. ఈకాలమున మనము సర్కారు నుద్యోగస్థులను ‘సివిల్ సర్వెంట్సు’ (Civil servants, Civil service) అని చెప్పుచుందుము. అమాత్యులన నిదియే యర్థము. అమాత్యులలోఁ గొందఱు అధ్యక్షులుగను, గొందఱు సమాహర్త్రాది ప్రధానోద్యోగస్థులుగను దక్షిణవారు మంత్రులుగను నియమింపఁబడుచుండిరి. ఇదంతయు వారి వారిశక్తిసామర్థ్యములఁబట్టి జరుగుచుండెను. (14, 15, 17, 31 పుటలలో నీవిషయములు సూచింపఁబడియున్నవి.)

అమాత్యులందఱిలో మంత్రులు ప్రధానులై యుండిరి. వారితో నాలోచింపక రాజెట్టికార్యములను జేయువాఁడుకాఁడు (పు 27). కార్యసిద్ధికై వలయు నారంభోపాయము, పురుషద్రవ్య సంపత్తు, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారమును విషయములవారు విమర్శించుచుండిరి. (పు 29). ఇందువలననే యత్నసిద్ధిమంత్రాయత్తమని కౌటిల్యుఁడు చెప్పెను. (పు 368). సామాన్యముగ ముగ్గురు నలుగురకంటె నెక్కువమంత్రు లుండుటలేదు. (పు 29.) ఏదయిన విషయ మాలోచింపవలసినపుడు మంత్రు లందఱును సభ గూర్చి యనుకొనిన కార్యమునందలి సాధకబాధకములఁ జర్చించుట మామూలుగ నుండెను; చర్చవలన లాభము లేదని తోఁచినపుడు, ప్రభువు మంత్రులలో నొక్కొక్కరిని బ్రత్యేకముగఁ బిలిపించి వారియభిప్రాయములఁ దెలిసికొనువాఁడు (పు 29). ఈ విధముగ నేవిమో తీర్పు చేసికొని దానిని లేఖకునిచే శాసనాధికారప్రకరణమునఁ జెప్పఁబడిన రచనాదోషములు లేకుండ వ్రాయించి ప్రభువు తత్సంబంధులకుఁ బంపువాఁడు: ఇవియే రాజశాసనములు. మంత్రులు సాధారణముగ నెల్ల

పుడు ప్రభువు సమక్షమున నుందువారు; ఆకారణముచేతనే వారికి దుర్గమందుఁ బ్రత్యేకముగ బస లేర్పాటు గావింపబడియుండెడివి. (పు 56.)

మంత్రులుగాక పరిషత్తును మఱియొక ప్రత్యేక సభ యుండినట్లు తోఁచుచున్నది. ఇందులోని సభ్యుల సంఖ్య నియమితముకాదు. కార్యగౌరవమునుబట్టి సంఖ్య నిర్ణయింపఁబడుచుండును. యుద్ధసంబంధములగు కార్యములు చక్కఁబెట్టుటకు వలయు నదుపాయములఁ గల్పించుట దాని పనియై యుండెడిది. కావున దానిలోని సభ్యులు దేశాటనముఁ జేయుచుఁ బరగణాలలోని యుద్యోగస్థులు వారివారి కార్యములఁ జక్కఁగ నెరవేర్చుచున్నారో లేదో కనుఁగొనుచుఁ దాము చూచినట్టియు, వినినట్టియు విషయములఁ బ్రభువునకుఁ దెలియఁ జేయుచుండువారు. ఈకారణముచే నొక్కొకప్పుడు వారు ప్రభు సమక్షమున నుండుట తటస్థించునది కాదు. అప్పుడు వారితో నాలోచించుట యవసరమయిన యెడలఁ బత్రప్రేషణమూలమున వారి యభిప్రాయములను రాజు తెలిసికొనుచుండెను. (పు 30) కొన్ని విషయములందుఁ బ్రభువు మంత్రులను, మంత్రిపరిషత్సభ్యులను గూడఁ గలిపి సభ చేయువాఁడు. అప్పు డధికసంఖ్యాకు లెట్లు చెప్పెదరో యట్లు నడుచుకొనుట యాచారము. (పు 30) ఆలోచనకై యేర్పడిన సభల గుఱించి కౌటిల్యుఁ డింతకంటె విపులముగఁ జెప్పియుండలేదు.

మంత్రులందఱిలో నమాత్యుఁడు ప్రధానుఁడు. అమాత్య శబ్ద మేకవచనమందుఁ బ్రయోగింపఁబడినపుడు ప్రధానమంత్రియని దాని కర్థము. రాజ్యమందు రాజు తర్వాతి వాఁడే యమాత్యుఁడు ప్రభుత్వ విషయములన్నిటిలో నతఁడు రాజునకుఁ గుడిభుజము. రాజున కుపకారము కాని యపకారము గాని యొనర్చునంతటి



సామర్థ్య మతని కుండెడిది. ఇష్టముండిన యెడల రాజ్యమును గూడ నపహరింపఁగల యంతటి యవకాశ మాతని కుండెడిది. యుద్ధకాలమం దతని మూలమునఁ బ్రభువున కెంత హానియైనఁ జేకూర వచ్చును; కావున నట్టి సమయమందు రాజు తన దోషము నొప్పుకొనియైన నమాత్యుని శాంతి పఱుపఁ బ్రయత్నించుచుండెడివాఁడు. మహాపరాధము గావించినను బురోహితునికిని బ్రధానమంత్రికిని మరణదండము లేదు. అమాత్య పదవి యింతటి గౌరవముతోడను గూడికొనియుండిన దగుటచేతనే ప్రభువునుండి యతనిని వేఱు పఱిచిన యెడలఁ దమకుఁ దప్పక జయము లభించునని శత్రువులు నమ్ముచుండెడివారు. రాజ్యములోని గూఢపురుషు లందఱి పైని నమాత్యునికి నిరంకుశాధికారముండెడిది. (పు 360,19) పరిపాలనవిధానమందు గార్యాలోచనకంటెఁ గార్య నిర్వహణము ప్రధానతరమైనది. కౌటిల్యుని కాలమందలి రాజకార్యనిర్వాహకులలో (1) రాజ సమక్షమం దుండి రాజ్యమంతటి పైని నధికారమును వహించిన వారు కొందఱు, (Central Executive) (2) రాజ్యములోని యొక్కొక్క రాష్ట్రముపై నధికారము చెల్లించుచుండినవారు కొందఱు, (Provincial Executive) (3) రాష్ట్రములలోని గ్రామముల మీఁదను గ్రామ సముదాయములమీఁదను నధికారము వహించిన వారు మఱి కొందఱును, నుండెడివారు. ఇందు మొదటి తరగతిలో 1. మంత్రి, 2. పురోహితుఁడు, 3. సేనాపతి, 4. యువరాజు, 5. దౌవారికుఁడు, 6. అంతర్వంశికుఁడు, 7. ప్రశాస్త, 8. సమాహర్త, 9. సన్నిధాత, 10. ప్రదేష్ట, 11. నాయకుఁడు, 12. పౌరవ్యావహారికుఁడు, 13. కార్మాంతికుఁడు, 14. మంత్రిపరిషదధ్యక్షుఁడు, 15. దండపాలుఁడు, 16. దుర్గపాలుఁడు, 17. అంతపాలుఁడు, 18. ఆటవికుఁడునను పదునెనమండ్రుద్యోగస్థులు గలరు. వీరికిఁ బదునెనిమిది

తీర్థములనియుఁ గూడఁ జేరుకలదు. (పు 20) కాని వీరిలో నొక్కొక్కరెట్టి పనులను జేయుచుండెడివారో కౌటిల్యుఁడు పూర్తిగ వివరించినవాఁడు కాఁడు. కొందఱను గుఱించి మాత్ర మచ్చటచ్చటఁ గొంత వర్ణనమున్నది. తక్కిన వారి నామములను బట్టియే వారి కార్యములను నూహింపవచ్చును.

వీరందఱిలో సమాహర్త యుద్యోగము గొప్ప పూఁచీతోఁ గూడుకొనినదని చెప్పుటకుఁ దగియున్నది. సర్వారంభములు కోశపూర్వకములు (పు 67) కావున కోశసంగ్రహణ పరిశోధకుఁడగు సమాహర్త యధికమగు గౌరవాధికారములకుఁ బాత్రుఁడై యుండెడివాఁడు. ఆదాయశరీరమున కంగములగు 1. దుర్గ, 2. రాష్ట్ర, 3. ఖని, 4. సేతు, 5. వన, 6. వ్రజ, 7. వణిక్పథముల మంచి స్థితియం దుంచి, యాదాయవృద్ధి నొనర్చి వ్యయమును దగ్గించి విపర్యయముల నివారించుచు సముదయమును గావించుట యతనికి విధియై యుండెడిది. (పు 63) పై యేడుమార్గములనుండి రాజునకు రావలసిన యాదాయమును సుకరముగ వసూలుచేయుటకై యతఁడు జనపదములు నాలుగు భాగములుగ విభజించి యందొక్కొక్క భాగమున ననేక గ్రామ సముదాయములు చేరునట్లుగ నేర్పఱిచి వానిపైఁ దగు నుద్యోగస్థుల నియమించువాఁడు. వీరిలో గోపుఁడనువాఁ డైదుగాని పదిగాని గ్రామములపై నధికారము వహించి, గ్రామములకు సంబంధించిన లెక్కలనన్నిటిని దయారుచేసి పన్నులు వసూలు చేయుటయందు సమాహర్తకుఁ దోడ్పడువాఁడు. గోపునిపైని స్థానికుఁడను మండలాధికారియు, స్థానికులపైఁ బ్రదేష్టయను నధికారియునుండెడివారు. ప్రదేష్టలు సాధారణముగ నొక చోట నుండక, రాష్ట్రాటనము గావించుచు గోపులయొక్కయు స్థానికులయొక్కయుఁ బనులను విచారించుచుండువారు. (పు 144) వీరు గాక, గూఢపురుషు లనేకులు



జనపదమం దంతటఁ దిరుగుచు వివిధవిషయముల గుఱించి సమాహర్తకుఁ దెలుపుచుండువారు (పు 145).

యుద్ధము దుర్భిక్షము లోనగు నుపద్రవముల మూలమునఁ గోశము నష్టమొంది రాజు ధనమునకై శ్రమపడుచుండు నపుడు సమాహర్త స్వబుద్ధి నుపయోగించి నూతనోపాయములచేఁ గోశసంగ్రహణము చేయవలసియుండును. అతఁడు సమర్థుఁడేనా కాఁడా యని తెలిసికొనుట కప్పుడే యవకాశము. అట్టి సమయములం దతఁ డేదియో మిషవెట్టి యాచనమూలమునఁగాని మోసమునఁ గాని బెదరించుటచేఁ గాని ప్రజలనుండి ధనము రాఁబట్టువాఁడు, (పు 252. 4). కావుననే ప్రభువుయొక్క ప్రయత్నములు సఫలములగుటకు సమాహర్త కారణభూతుఁడై యుండును.

ఈ కాలమున మన దేశమందు రివిన్యూ వ్యవహారములఁ బరిష్కరించు మండలాధికారులు దండనాధికారమును (Magisterial power) గూడ వహించియుండుట సర్వసాధారణమైయున్నది. కౌటిల్యుని కాలమందుఁగూడ నిట్లే జరుగుచుండెను. ప్రజలతో సమాహర్తకున్నంతటి సంబంధము ప్రధానోద్యోగులలో మఱెవ్వరికిని లేకుండుటచే దేశములోని దుర్మార్గులుపెట్టు బాధలనుండి ప్రజలను రక్షించుట యతనికి విధిగనేర్పడియుండెను. ఇందులకై యతఁడు గూఢ చారుల ననేకుల రహస్యముగఁ బంపి గ్రామస్థులయొక్కయు నధ్యక్షులయొక్కయు శుచిత్వాశుచిత్వముల నెఱుంగుచు శంకితులగు న్యాయాధికారులను లంచగొండ్లగు నమాత్యులను గూటసాక్షులను గపటపు నాణెములఁ జేయువారిని రసదులను హింసించు తక్కినగూఢజీవులను దగువిధానముగ శిక్షించుచుండెడివాఁడు, (పు 217-19). అట్టివారందఱు దేశకంటకులై ప్రజలకును బ్రభుత్వమునకును నష్టము కలిగించుచుండువారగుటచే వారినిబట్టుకొని వారిదుష్కృత్యములఁ

ప్రచురపఱచుటయెంతయో యావశ్యకమగు కార్యము. ఇట్టి పనులను జాగరూకతతో నెరవేర్చుచు రాజుయొక్క సర్వజ్ఞత్వమును దేశమందంతట సమాహర్త ప్రకటించుచుండెడివాఁడు (పు 220).

ఇంతటి యధికారమును గలవాఁడగుటచే నొక్కొకప్పుడు సమాహర్త సహితము ప్రజలను బీడింపఁగలవాఁడై యుండును. దీనినే కౌటిల్యుఁ డీ విధముగఁ జెప్పియున్నాఁడు: «సమాహర్త స్వార్థమునే మొదట సంగ్రహించుకొని పిమ్మట రాజార్థముకొఱకుఁ బ్రయత్నించును. లేక రాజార్థమునకు వినాశము గలిగించును. మఱియుఁ బరధనమును దీసికొనుటలో స్వతంత్రుఁడై చరించును» (పు. 345).

## ౧౦

### గహాపతులు (గృహాపతులు)

బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రులలో బ్రాహ్మణ క్షత్త్రియులం గూర్చి జాతకకథలవలనఁ దెలియు విషయములు పూర్వాధ్యాయములలో నిరూపింపఁబడినవి. ఇచట వైశ్య వర్ణముం గూర్చి జాతకకథలలోనెట్టి విషయములు కాన్పించునో యయ్యవి సమకూర్పఁబడును.

బ్రాహ్మణ సిద్ధాంతము ననుసరించిన, మూఁడవ జాతివారలైన వైశ్యులకు, పశుపాల్యము, దానము, యజనము, వాణిజ్యము, కుసీదము, కృషియు, వృత్తులుగను ధర్మములుగను విధియింపఁబడినవి. పాళీవాఙ్మయమునందును మనము వెస్స (వైశ్య) పదమును వర్ణక్రమములోఁ గనుచున్నారము. ఐనను బ్రాహ్మణ సిద్ధాంతఖండసంబులందుగాని, బౌద్ధసిద్ధాంత నిరూపణంబులందుఁగాని జాతకకథలలో



సర్వసామాన్యముగ వర్ణక్రమనిరూపణమందు, వెస్సులకు మాఱుగ "గృహాపతులు, కుటుంబికులు" అనుపదములం గనుచున్నారము. ఈ గృహాపతులును, కుటుంబికులును, బ్రాహ్మణసిద్ధాంతస్థ వైశ్యులతోఁ గొంతవఱకు సరిపోవుచున్నారని మనము చెప్పవచ్చును. ఎట్టి నిబంధన లీ గృహాపతులను వర్ణస్థులుగఁ జేయుచుండెడివో కాన్పింపవు. క్షత్త్రియ బ్రాహ్మణ జాతులను జెందకయుండి యైశ్వర్య సంపన్నులై యుండు నార్య సంతతివారలందఱకు నీ గహాపతి శబ్దము ప్రయోగింపఁబడుచుండెడిదని మన మూహింపవచ్చును. ధనవిహీనులయ్యు గహాపతి పుత్రులు గహాపతులుగనే పరిగణింపఁబడుచుండెడివారు. (సౌమనస్సజాతకము, సుతనో జాతకము. IV. 446, III 325) గహాపతులు సత్కులీనులుగఁ బరిగణింపఁబడుచు వివాహ విషయములలో దమకంటె హీనులగువారలతో సంబంధములం జేయకయె యుండిరని మనమూహింపవచ్చును, (మణిచోర జాతకము. II 121). కుటుంబికులకును, గృహాపతులకును (గహాపతులకును) భేదమేమియు నున్నటులు గనిపింపదు. ఈ రెండుశబ్దములు నొకరీతి రాష్ట్రస్థులచేఁ బ్రయోగింపఁబడుచుండెడివి. నగరవాసులగు కుటుంబికులు వాణిజ్యమును జేయుచుండెడివారు. సాలకజాతకములో బోధిసత్త్వుఁడు కుటుంబిక కులములో జనించి ధాన్య విక్రయముచేసికొని జీవించుచుండెడివాఁడని చెప్పఁబడినది. సుచ్చజ జాతక పచ్చుప్పన్నవత్థులోఁ గుటుంబికుఁ డొక్కరుఁ డప్పులను రాబట్టుకొనుటకు భార్యతోఁగూడ జనపదమునకుం జనియెననియును, సతపత్త జాతకములో నొకకుటుంబికుఁడు గ్రామవాసి యొక్కనికి వేయి కహాపణముల నప్పిచ్చెననియుఁ జెప్పఁబడెను.

గహాపతులలో (గృహాపతులలో) ముఖ్యముగ మనము పరిశీలింపఁదగినవారలు సెట్ఠులు (శ్రేష్ఠులు). జాతకకథలలో నీ సెట్ఠులు

రాజసేవఁ జేయుచుండినటులు నిరూపింపఁబడుచున్నారు. అటులైనను వీరలను రాజభృత్యులుగఁ బరిగణించుటకు వీలులేదు. సెట్ఠులు రాజకీయోద్యోగులుగను, ననధికారులైన వణిజులుగను, గాన్పించుచున్నారు. "సెట్ఠులంతటను దమ వృత్తుల నవలంబించు వారలలో విశిష్ట గౌరవపదంబు నలంకరించుచున్న వణిజశ్రేష్ఠులుగఁ గాన్పించుచున్నారు. బహుకీర్తిమంతుఁడై, దానశీలుండై, బుద్ధ శిష్యుండైన "అనంతపిండికుఁడు" సెట్ఠులలో ముఖ్యుఁడుగఁ బాళీవాఙ్మయమునఁ బేర్కొనఁబడుచున్నాఁడు. చుల్లవగ్గములో (IV 4. 1.) నాతఁడు "రాజగహాన సెట్ఠి" యొక్క బావయని చెప్పబడెను. "రాజగహాన సెట్ఠి" అను వచనమువలన, నట్టివాఁడు రాజకీయోద్యోగియని తెలియవచ్చుచున్నది. ఈ సెట్ఠి, భూపాలునకును, వణిజులకును వివిధములగు నుపకారములు చేసెనని మహావగ్గములోఁ (VIII 1. 16) జెప్పఁబడినది. జాతకములలో సెట్ఠి, పరివారజనముం బోలె రాజు ననుసరించి చనుచున్నట్లు దెలుపఁబడుచున్నది. రాజస్వముల వినియోగమందును, సైనికులకును నమాత్యులకును వేతన మొసంగుటయందును యుద్ధములు మున్నగువానియందు ధనము వ్యయముచేయుటయందును, సర్వజనోపయోగములగు భవనముల నిర్మించుట మున్నగు విషయములలోను రాజు వాణిజ్యముతోఁ బరిచయముగలవాని యుపదేశముల నర్థించుచుండు. మఱియు వాణిజ్యమును జేయువారలు, దమ్ము క్షేమమును గాపాడుటకును, దమ్ము సంబంధించిన విధానములు తమ కిబ్బందుల గల్పింపకుండునటులఁ జేయుటకును, దమ ప్రతినిధిని రాజసమక్షమందు నిల్పఁగోరుచుందురు. రాజోద్యోగియైయుండుటచే రాజసదనమునకు దినమునకు మూఁడు పర్యాయములు చొప్పున నీతఁడు చనుచుండును. ఈ యుద్యోగము గలిగియుండుటచే నీతఁడు ప్రయాణమైపోవునపుడుగాని, తన యుద్యోగమును విడనాడు నపుడు



గాని, పరివ్రాజకుండగు నపుడుగాని రాజానుమతిని గైకొనుచుండెడి వాఁడు".

సెట్ఠియుద్యోగియై యెట్టి రాజకీయవ్యవహారములఁ జేయుచుండెడివాఁడో యెచ్చటను వివరింపఁబడలేదు. మనుధర్మశాస్త్రములో రాజు పణ్యములధరలంగూర్చి యేవిధమున సంచరింపవలయునో చెప్పఁబడినది.

శ్లో. ఆగమం నిర్గమం స్థానం తథావృద్ధిక్షయావుభౌ
విచార్య సర్వపణ్యానాం కారయేత్క్రయవిక్రయౌ.
పంచరాత్రే పంచరాత్రే పక్షేపక్షేథవాగతే
కుర్వీతచైషాంప్రత్యక్షమర్ఘసంస్థాపనంనృపః.
తులామానం ప్రతీమానం సర్వంచస్యాత్సులక్షితం
షట్సుషట్సుచమాసేషు పునరేవపరీక్షయేత్.

(మను 8 అ 401_402.403)

"ఏ సరకెంతదూరమునుండి వచ్చెనో యెంతదూరము వెళ్ళునో యెంతకాలము నిలువయుండునో యందులకగు వృద్ధి యెంతో యాసరకు రక్షించుకూలి మొదలయినవాని కెంతవ్యయమాయెనో యాసరకు తఱుగెంతో యను విషయములన్నియును విచారించి, కొనినవానికిని విక్రయించిన వానికిని నష్టములేకుండ ధర లేర్పఱచి క్రయవిక్రయములోనర్పింపవలెను. మఱియు సరకువచ్చుటయుఁ, జెల్లుటయు నియతముగా నుండదు గావున వానిఖరీదులు శీఘ్రముగా మాఱును. కావున నట్టివానికై దేసి దినములకొకమారును, స్థిరప్రాయములగు వానికిఁ బక్షమున కొకమారును వర్తకులలోఁ గుశలులగువాని యెదుటను ధరను రాజు బుద్ధిమంతులచే నేర్పాటుచేయింపవలెను. బంగారు మొదలగువానిని, దూఁచెడు త్రాసులు గుళ్ళ కొలపాత్రములు మున్నగువానిని నాఱునెలల కొకమారు సభ్యులచేఁ బరీక్షచేయింపవలెను."

ఇట్టి విషయములలో నరపాలుఁడు సెట్ఠిసాహాయ్యమును బొందుచు శ్రేణి, గణ, పూగాదివిషయకములగు నియమములలోఁగూడ నీతని సాహాయ్యమును బొందుచుండెడివాఁడని మన మూహింపవలయును. మఱియు నీసెట్ఠిస్థానము కులక్రమాగతంబై యుండెడిది. (ఖదిరంగారజాతకము I 231; III 475 అద్ధానజాతకము.) ఈపదవి వంశపారంపర్యముగా వచ్చుటచేతను, సెట్ఠులు ధనవంతు లగుటచేతను, జాతకకథలలో నచటనచట సెట్ఠులు రాజమిత్రులుగ నిరూపింపఁబడుచున్నారు. "యువరాజును, వారాణసీ సెట్ఠికుమారుఁడును బాల్యమునుండియు నాటలాడుకొనుచు నొక యాచార్యునివద్దనే విద్య నభ్యసించుచుండిరి. ఆయువరాజు పితృమరణానంతరమున రాజైనపిదప నాసెట్ఠి పుత్రుఁడును బూర్వమువలెను రాజునకు మిత్రుఁడై వానితోఁగలసి మెలసి తిరుగుచుఁ దండ్రికాలగతిని బొందినపిదపఁ దాను సెట్ఠియై దినమునకు మూఁడుపర్యాయములు రాజదర్శనముం జేయుచు రాజుతో రాత్రి యగువఱకును మాటలాడుచుండెను. ఒకనాఁడు సెట్ఠి రాజదర్శనముం జేయకుండుటచే "మన్మిత్రుఁడేఁడి?" అని రాజు ప్రశ్నించెను" అని 'అద్ధాన జాతకంబునఁ' జెప్పంబడినది.

సెట్ఠులు జాతకకథలలో ననేకస్థలములందు రాజకీయవ్యవహారములతో నేమియు సంబంధములేని బహుధనవంతులగు వణిజులవలె వర్ణింపఁబడుచున్నారని పూర్వమునఁ జెప్పితిమి. వారణాసియందు నొక సెట్ఠిపంచశతశకటములపై వస్తువుల సేకరించుకొని వ్యాపారము చేయుచుండినట్లు ఫల(I 270) జాతకమునందుఁ జెప్పంబడినది. మఱియు జానపథములందును సెట్ఠులు వసియించుచుండెడివా రనియును నిగ్రోధ (IV37)జాతకములోఁ జెప్పంబడినది. కానియీసెట్ఠులేమిచేయుచుండెడివారో చెప్పఁబడలేదు. ఈసెట్ఠులందఱును బహుధనయుక్తులని మాత్రము చెప్పంబడినది. సెట్ఠులు తఱచుగ నెనుబదికోట్ల ధనముగలవారలుగ జాతకకథలలోఁ జెప్పఁబడుచున్నారు. ఈసంఖ్యయట్టి సెట్ఠుల యొక్క బహుధనత్వమును సూచించుచున్నదే గాని వేఱేమియు సూచింపఁజాలదని మన మూహింపవలయును. విసయ్యాజాతకములో మాత్రము (III 129) శక్రుఁడు సెట్ఠిదాతృత్వముం జూచి కడు కుపితుఁడై యాసెట్ఠిధనము, ధాన్యము, తైలము, మధువు, జక్కెర, బానిసలును, భృతిభుజులు మున్నగు సమస్తసంపదలను నశింపఁజేసెనని చెప్పఁబడినది. ఈవివరణముంబట్టి సెట్ఠులధనము లెట్టివిగఁ బరిగణింపఁబడుచుండెడివో తెలియనగును. సెట్ఠులు వైవాహిక సంబంధములఁ జేయునపుడు బహుధనసంపన్ను లగుటచేఁ దమతో సమానులగు సెట్ఠులతోనె యట్టిసంబంధములం గలుగఁజేసికొనుచుండెడివారని మనము చెప్పవచ్చును. నిగ్రోధజాతకములో రాజగహపుసెట్ఠి తన కుమారునకు జానపదుఁడైన యొకసెట్ఠి కూఁతును భార్యగ నొనర్చెను. కటాహజాతకములో సెట్ఠియొకఁడింకొకసెట్ఠికి నీరీతి జాబు వ్రాసెను. "ఈయుత్తరమును నీకిచ్చువాఁడు నాసుతుఁడు. మనపిల్లలొండొరులకు వివాహము చేసికొనుట నాయభీష్టము."

బ్రాహ్మణక్షత్రియ యువకులవలె సెట్ఠికులస్థులగు యువకులును విద్యల నభ్యసించుచుండెడివారు. బ్రాహ్మణక్షత్రియ యువకులవలెనే సెట్ఠియువకులుకూడ శిల్పముల నభ్యసించుచుండెడివారని 'అద్ధాన జాతకములోను, నిగ్రోధజాతకము'లోను జెప్పంబడినది. సెట్ఠియువకులు బ్రాహ్మణబ్రహ్మచారులవలననే వేదాధ్యయనంబునుగూడఁ జేయుచుండెడివారని విద్వాంసులూహించుచున్నారు.

ఇంతవఱకు వణిజులంగూర్చి కొంతచర్చించితిమి. బహుపూర్వకాలములోను వణిజులు సంఘములుగ నేర్పడి శ్రేణుల నిర్మించుకొని శ్రేణులయధికారమునకు లోఁబడి తమవ్యాపారముల సాగించుకొను

చుండెడివారనునది నిశ్చయము. కృషీవలులయొక్కయు, వణిజులయొక్కయుఁ, బశుపాలురయొక్కయుఁ, గుసీదులయొక్కయు, భిన్న భిన్నధర్మముల ననుసరించి రాజు వారివారిని బాలింపవలయునని గౌతమధర్మసూత్రము నుడువుచున్నది. మనుధర్మశాస్త్రములో శ్రేణినియమములను నృపుఁడు పరీక్షించి కార్యముల నిర్ణయింపవలెనని నిరూపింపఁబడినది.

శ్లో॥ జాతిజానపదాన్ ధర్మాన్ శ్రేణిధర్మాంశ్చ ధర్మవిత్।
సమీక్ష్యకులధర్మాంశ్చ స్వధర్మం పరిపాలయేత్॥

(మను. 8 అ 41)

మను ధర్మశాస్త్రంబు నందలి వృద్ధి నియమములను, సముద్రవాణిజ్యము విషయమై తద్జ్ఞానయుక్తులగు వారలను నియమించుటను, నదులపైని భూమిపైని గావింపఁబడు వాణిజ్యపు వస్తువులపైఁ బన్నుల విధియించుటను మనము పరిశీలించినచో నాపురాతన కాలమందును వాణిజ్య మత్యధికముగ జరుగుచుండెననియు నయ్యది నియమబద్ధంబై కడు వృద్ధిం జెందియుండెననియు నూహింపవచ్చును.

వస్త్రలవణాది ద్రవ్యము లెంత మూల్యమునకుఁ గొనఁబడెనో, యిచ్చట నమ్మిన నెంత లాభించునో, యెంత దూరమునుండి తేఁబడెనో, యెంత సొమ్ము బత్తెకర్చులు మొదలగు వానికిఁ దగులుబడి యయ్యెనో, యరణ్యాది ప్రదేశములందుఁ జోరాదులవలన రక్షార్థమై యగు వ్యయమెంత యయ్యెనో, కొనకు లాభమెంత గల్గునో, చూచి వర్తకునివలనఁ బన్ను గ్రహింపవలెను. అవేక్షణాది కర్మములయందును, వాని వానివలన ఫలము నేరీతినొందునో తత్ప్రకారమును రాజు పరిశీలించి పన్నులనెల్లప్పుడు విధింపవలెను. జలగజంతు రక్తమును, గోవత్సము దుగ్ధమును, దుమ్మెద మకరందమును, నేలాగున స్వల్ప స్వల్పముగ స్వీకరించునో యట్టులే రాజు



రాష్ట్రమువలన మూలధనచ్ఛేదము గాకుండ నేటేట రాఁదగిన పన్నును రాఁబట్టవలెను.

“మూలముకంటె నధికము లగు పశుహిరణ్యములయందేఁ బదవపాలును రాజు పుచ్చుకొనవలెను. ధాన్యములో నాఱవపాలుగాని యెనిమిదవపాల్గాని రాజు పుచ్చుకొనవలెను. భూమియొక్కయుత్తమత్వాదిభేదములచేతను, గర్షకశ్రమ తారతమ్యముచేతను వష్ఠభాగాది వికల్పము నెన్నవలెను. శిలామయములు మున్నగువానిపైని వచ్చినలాభములో నాఱవభాగము పన్ను పుచ్చుకొనవలెను.”

“ధనము లేక రాజెంత క్షీణించినను శ్రోత్రియబ్రాహ్మణుని వలనఁ బన్నును బుచ్చుకొనఁగూడదు. రాజుయొక్క రాజ్యమందు శ్రోత్రియుఁ డాఁకలిచే నీరసింపఁగూడదు,” అని మనువు చెప్పియున్నాఁడు.

(మను. 7 అ. 127_133)

“ కూర మొదలగునవి యమ్ముకొని బ్రతికెడువారలకు సంవత్సరపుఁ బన్ను కొంచెముగ రాజు విధింపవలెను. కారువులచేతను (శిల్పిజనులకంటె నీచదధికులు) సూపకారాదులచేతను, లోహకారాదులచేతను, గావళ్ళు మోసికొని బ్రతికెడు శూద్రులచేతను నెలకొకరోజునఁ బనులను వెట్టిగాఁ జేయించుకొనవలెను.”

“ప్రజలయం దగుస్నేహముచేఁ బన్నులు మొదలగునవి పుచ్చుకొనక తనకును, నత్యాశచే నధికముగ సొమ్ము పుచ్చుకొని ప్రజలకును హాని రాజు తేఁగూడదు. ధనహానియగుటచేఁ దనకును, బ్రజలకు ధనహాని యగుటచే వారలకును బాధకలుగును. రాజు కార్యవిశేషమునుబట్టి కఠినుఁడును, మార్దవముకలవాఁడును గావలెనుగాని యేకరూపుఁడు కారాదు. ఈరీతిగల రాజెల్లరకభిమతుఁడగును,” అనియును మనువు చెప్పియున్నాఁడు. (మను. 7 అ. 137_140)

"రాజునకు ధాన్యాదులలో నెనిమిదవపాలు పన్ను చెప్పఁబడెను. అట్లయినను నాపదయందు నాలవపాలు పుచ్చుకొనియైన నధికమగు శక్తితోఁ బ్రజలను రక్షించిన నధికకరగ్రహపాపముతోఁ గూడుకొనకుండును. రాజునకు యుద్ధము స్వధర్మము. యుద్ధఫలము విజయమని యర్థము. ప్రజారక్షణము నుద్యుక్తుఁడై యెందువలన నైన భయముత్పన్నమయ్యెనేని యపుడు రాజు యుద్ధపరాఙ్ముఖుఁడు కారాదు. ఇట్లు శస్త్రములచే వైశ్యులను దస్యులవలన రక్షించి వారలవలన శాస్త్రీయమగు పన్ను నధికారపురుషులచే నాకర్షింపవలెను. ధాన్యసమూహమందు వైశ్యునివలన నష్టమాంశము శుల్కమాకర్షింపవలెను. ధాన్యములలో ద్వాదశభాగము శుల్కమని చెప్పఁబడెను. అష్టమాంశమాపదయందును, నత్యంతాపదయందుఁ జతుర్థాంశమును రాజు గ్రహింపవచ్చునని తెలియనగును. అందిరువదవభాగము గ్రాహ్యమనియుఁ గలదది యుక్తమే. బల్యాదులలోఁ గార్షాపణస్థానములకు వింశతితమమగు భాగమును గ్రహింపవలెను. అందును "పంచాశాద్భాగ ఆదేయో। రాజ్ఞాపశుహిరణ్యయోః" అనుటచే ననాపదయందుఁ బంచాశద్భాగము చెప్పఁబడెను. ఈవింశతితమభాగమాపదయందని చెప్పఁబడెను. శూద్రులనఁగా సూపకారాదులు. శిల్పులనఁగాఁ జెక్కడపుఁబనివారలు. ఇట్టివారలచేఁ బనులు వెట్టిగాఁ జేయించుకొనవలెను గాని వారినుండి పన్ను గ్రాహ్యము కాదు," అని మనవు చెప్పియున్నాఁడు.

(మను. 10 అ 188-120)

ఆకాలములో సముద్రవాణిజ్యము, భూమిపై వర్తకముకూడ విస్తారముగ జరుగుచుండెడివని జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది. ఎడారులలోనుండి చనుపలుపోవునపు డట్టి ప్రయాణము సముద్రప్రయాణముతోఁ బోల్పఁబడుచున్నది, (I 107). మఱియుఁ గర్ణధారుఁలెటుల నోడను నడుపుదురో యట్టులనే నక్షత్రములం జూచి చనుపలనువాని నాయకులు నడపుచుండెడివారని చెప్పఁబడినది. (III 267) ధమ్మద్ధజజాతకమువలన సముద్రమధ్యమున నుండునపుడు దిశాకాకము నొకదాని నుంచుకొని నావికులద్దానిచేఁ దీరమును దెలిసికొనుచుండెడివారని తెలియవచ్చుచున్నది. ఈజాతకములోనే, దిశాకాకముండినప్పటికిని నోడ వ్రక్కలయ్యెనని చెప్పంబడుటచే దిశాకాకములు సముద్రములో దూరముగఁ బోవునావలకంత యుపయోగముగ నుండకపోయినను దీరమున కనతిదూరంబుననె ప్రయాణమును గావించుపడవల కుపయోగముగనుండెడివని మనమూహింపవచ్చును. ఆకాలమున సముద్రములో నతిదూరముగఁబోయిన యోడలకు హానివాటిల్లుచుండెడి దని పండరజాతకమువలనఁ దెలియవచ్చుచున్నది, (V 75). "ఏనూఱుగురు వణిజులు సముద్రప్రయాణముం జేయుచు నేఁడవనాఁడు భూమిని గనకుండిరి. ఓడయు వ్రక్కలాయెను," (బవేరుజాతకము III 126) బవేరు పట్టణమును బవేరురాష్ట్రమును జాతకకథలలోఁ జెప్పఁబడుచుండుటచే నాపూర్వకాలములలో సైతము నధికముగ సముద్రవాణిజ్యము జరుగుచుండెడిదని మనమూహింపవచ్చును.

భరతఖండములో నౌకాయానమున కనువగు మహానదులుండుటచే నదీ వాణిజ్య మధికముగ జరుగుచుండెడిదని మనము చెప్పవచ్చును. చుల్లక సెట్ఠిజాతకములో నీ క్రింది రీతిని జెప్పఁబడెను, (I 126). "వారాణసీపట్టణమున కనతిదూరంబున నుండెడి యొకరేవును నొక యోడ, వర్తకసామగ్రితోఁ జేరెను. కులీనుఁడైన ధనహీనుడగు నొక యువకుఁ డధికవైభవముతో నారేవునకుం జని యానవర్తకులనుండి యరువుపై నా సామగ్రినంతటిని గ్రయముచేసి తన యంగుళీయకమును వారలకుఁ బ్రాతిభావ్యముగా నిచ్చెను.

ఆ నావదగ్గఱనే యొక శిబిరమునం దాతఁడు బసచేసి, యే వర్తకులు వచ్చినను తన యాజ్ఞలేక లోనికిరానీయవలదని చెప్పి సేవకుల నచట నుంచెను. ఆయోడ, రేవు చేరినదని విని నూఱుగురు వర్తకులు వారాణసినుండి యచటికివచ్చి వస్తువులఁగొనఁ బ్రయత్నింప నయ్యవి యింకొకవర్తకునిచేఁ గొనఁబడినవని యచటివారు చెప్పిరి. అపుడు వార లాయువకుని దర్శించి యాతనికి రెండు లక్షల ధనమునొసంగి యా వస్తువులంగొనిరి.''

పూర్వకాలమున భూమి మార్గమున వాణిజ్యమత్యధికముగ జరుగుచుండెడిదని మనము దృఢముగఁ జెప్పవచ్చును. ఆపన్నక జాతకములో వస్తువులనే నూఱు బండ్లపై సేకరించుకొని వర్తకులు బహు దూరము వాని విక్రయించుటకై చనుచుండెడివారని చెప్పఁబడినది. వారాణసినుండి యుజ్జయినివఱకును, విదేహ దేశమునుండి కాశ్మీర గాంధార దేశములవఱకును వణిజులు విక్రయించుటకై వస్తువులనుగొనిపోవుచుండెడివారని జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది. ఇట్టి దూర ప్రయాణములలోఁ జోరులవలన భయము మిక్కుటముగ నుండెను. సత్తిగుమ్మ జాతకములోఁ ద్రోవఁబోవు వణిజులం గొట్టి ధనము నార్జించుచుండెడి యేనూఱు చోరు లొక గ్రామములో వసియించుచుండిరని చెప్పంబడినది. యోధులు కొందఱు వర్తకులనుండి ధనముఁగైకొని చనుపలను జోరులనుండి రక్షించుచుండెడివారనుట నిశ్చయము.

దేశమున విస్తారముగ వాణిజ్యము జరుగుచుండిన కాలములో శ్రేణులు నిర్మితములై యుండెడివనుటలో వింతయేమియును లేదు. ఉరగ జాతకపు పచ్చుప్పన్నవత్థులో సిద్ధఱు శ్రేణిప్రముఖులకు వివాదము జరిగినదని చెప్పఁబడినది. నిగ్రోధజాతకములో రాజభాండాగారాధ్యక్షస్థానము సర్వ శ్రేణి విచారణార్హమని చెప్పఁబడినది. ధాన్యవణి



క్కులము, పణ్ణికకులము (శాకఫలవిక్రేతృకులము) అహిగుండిక జాతకములోను (III 198; I 312) కుద్దాలజాతకములోను పేర్కొనఁబడుటచేఁ గొన్ని వస్తువులతో వ్యాపారము చేయువారలలోనైనను తండ్రి ననుసరించి పుత్రులును నా వ్యాపారమును జేయుచుండెడివారని మనము నిశ్చయింపవచ్చును.

వణిజులలో శ్రేణి నిర్మాణము మిక్కుటముగ వృద్ధిఁజెందినట్లు గాన్పింపకపోయినను శిల్పులలో మాత్రము శ్రేణులు నిర్మితములైనట్లు గాన్పించుచున్నది. జనకుడవలంబించిన శిల్పమును బుత్రుఁ డవలంబించుటఁ దఱచుగఁ గాన్పించుచుండును. ఇట్లు పుత్రులు జనకు లభ్యసించు శిల్పముల నభ్యసించుచుండినచో నట్టి వారు, లాయాశిల్పములయందుఁ బ్రావీణ్యముం జెందుదురు. కమ్మరులు, కుమ్మరులు, శిలావేషకులు(బబ్బుజాతకము)మున్నగు వారలలోఁ బుత్రులు జనకుల వృత్తులనే యవలంబించియుండుట జాతకకథలలోఁ జెప్పంబడినది. ఒక్క వృత్తినే యవలంబించు వారలందఱు నొక్క గ్రామములోనే వసియించుటయు నీ కథలలోఁ గాన్పింపకపోదు. మహావద్దకి గ్రామమొకటి వేయిమంది కలపతో వ్యాపారముచేయు వారల కుటుంబములతోను, కమ్మరగామ మొక్కటి వేయిమంది కమ్మరుల కుటుంబములతోను నుండెనని (అవీనచిత్తజాతకము) (II 18; IV 159, 47) (సముద్దవణిజ జాతకము తక్కల జాతకము) జాతకములలో (III 281) పేర్కొనఁబడెను. ఆయా శిల్పముల నభ్యసించు వారలు వేఱువేఱు శ్రేణుల నిర్మించుకొని యాయా శ్రేణులకు 'జెట్ఠకులను' లేక 'పముఖులను' (జ్యేష్ఠకులు, ప్రముఖులు) నియమించుకొను వాడుక కాన్పించుచున్నది. ఈ ప్రముఖస్థానము వంశపారంపర్యమై జనకునుండి పుత్రునకుఁ గ్రమముగ వచ్చుచుండెననియు నీ కథలవలనఁ దెలియవచ్చుచున్నది. ఒకప్పు

డొక చోటనె యొక్క శిల్పమునె యభ్యసించువారలై రెండు శ్రేణుల నిర్మించుకొనుచుండెడివారని సముద్ద వణిజుజాతకమువలన నిశ్చయమగుచున్నది. ఒక గ్రామములో వేయి తక్షక కుటుంబములు వసియించుచుండెననియుఁ నందయిదువందల కుటుంబముల కొక ప్రముఖుండును, మిగిలిన యయిదువందల కుటుంబములకు మఱియొక ప్రముఖుఁడును నుండిరనియు, వారలొకానొక సమయమున నా పురమును విడిచియొక ద్వీపమునకుంజని యచటఁ గాపురముండిరనియుఁ జెప్పంబడినది.

వణిజులయొక్కగాని శిల్పులయొక్కగాని సంఘమునకు శ్రేణి యనిపేరు. ఇట్టి శ్రేణులసంఖ్య యనల్పమని తెలియనగును. మూగపక్షజాతకంబున రా జత్యంతవైభవముతోఁ బ్రయాణోన్ముఖుండై చాతుర్వర్ణ్యంబును నష్టాదశశ్రేణులను సర్వబలంబులను నొక్కచోటికె రావించెనని చెప్పఁబడినది. ఈయష్టాదశశ్రేణుల నిపుడు నిరూపించుట యసాధ్యంబైనను శిలాశాసనాదులంబట్టి కొన్నింటిని మనము తెలిసికొనఁగలము. ఇచట నట్టి కొన్ని శ్రేణుల యనుక్రమణికను బొందుపఱచుచున్నారము.

1. రథకారులు
2. లోహకారులు
3. చర్మకారులు
4. చిత్రకారులు
5. మాలాకారులు
6. పశుపాలురు
7. నావికులు
8. కులాలులు.
9. తంతువాయులు
10. వణిజులు
11. చనుపలను రక్షించు భటులు.
12. వైణులు
13. చోరులు
14. కుసీదులు
15. వ్యాధులు
16. రంజకులు



జాతకకథలవలన నింకొకటి తెలియవచ్చుచున్నది. వణిజుల శ్రేణులకును, శిల్పుల శ్రేణులకును భేదంబుండినట్లు జాతకకథలవలన స్పష్టమగుచున్నది. వణిజులలోఁ బారంపర్యముగ నొక్కొక్కజాతి వస్తువులతో వ్యాపారాదులు సల్పుచుండిన కులములు ముఖ్యాధిష్ఠితంబులైన శ్రేణులం గల్పించుకొను వాడుకయుండినను దఱచుగ నిట్టిశ్రేణులు సుస్థాపితములైనట్లు గాన్పింపదు. శిల్పుల శ్రేణులు మాత్రము సునిర్మితములై యుండెడివి. శ్రేణిప్రముఖు లున్నతరాజకీయోద్యోగములఁ జేయుచు నరపాలుర దయకుఁ బాత్రులై ధనసంపన్నులై యుండెడివారు.

ధర్మశాస్త్రములఁ బరికించిచూచినను శ్రేణులు సుస్థాపితములై యుండెడివని తెలియకమానదు. శిల్పుల వివాదములలో వారివారి శ్రేణిప్రముఖులతో విచారించియే, నరపాలుఁడు తీర్పునొసంగవలయునని గౌతమధర్మసూత్రము పదునొకండవ యధ్యాయము 21 సూత్రమువలన స్పష్టమగుచున్నది. ధర్మసూత్రముల కాలమునాఁటికి శ్రేణులు సునిర్మితములైయుండెడివనియు భిన్నభిన్నశిల్పముల నవలంబించువారలు వివిధములగు శ్రేణుల నిర్మించుకొని వారికిఁ దగిననియమముల వారే చేసికొనుచుండెడివారనియు నిశ్చయమగుచున్నది. బౌద్ధవైదికగ్రంథములనుండి, శ్రేణులు తమతమసంఘములను జెందినవారలపైఁ బ్రబలాధికారములు కలిగియుండెడివని తెలియవచ్చుచున్నది. వినయపిటకములో శ్రేణిస్థులకును వారి భార్యలకును వివాదములు జరిగినచో నట్టివివాదములను దీర్చు నధికారము శ్రేణి గలిగియుండెడిదనియును శ్రేణిస్థునిభార్య భిక్షుకియగుటకు నిశ్చయించికొన్నచో నట్టి యాపె శ్రేణి యనుమతిని బొందవలెననియును నిరూపింపఁబడినది.

శ్లో. జాతిజానపదాన్ ధర్మాన్। శ్రేణీధర్మాంశ్చ ధర్మవిత్
సమీక్ష్య కులధర్మాంశ్చ। స్వధర్మం ప్రతిపాదయేత్.

అను మనువచనంబువలన దేశములు శ్రేణులు తమతమ నియమములం గావించుకొనుచుండుననియు నట్టినియమములు జాత్యాది ధర్మములవలె రాజుచే గౌరవింపఁబడి శ్రేణిస్థుల వివాదములలో ననుసరింపఁబడవలెననియు నిశ్చయమగుచున్నది. మఱియు మానవధర్మశాస్త్రమున నెనిమిదవ యధ్యాయములో 219, 220 శ్లోకములలో నీరీతిగఁ జెప్పంబడినది.

శ్లో. యోగ్రామ దేశసంఘానాం। కృత్వాసత్యేన సంవిదం
విసంవదేన్నరోలోభా। త్తంరాష్ట్రాద్విప్రవాసయేత్॥
నిగృహ్యాదాపయేచ్చైవం। సమయవ్యభిచారిణం
చతుస్సువర్ణాన్ షణ్నిష్కాన్। శతమానంచ రాజతమ్॥

(మను 8. అ. 219. 220)

ఈరీతిగనే యాజ్ఞవల్క్యస్మృతియందుఁగూడ శ్రేణులఁగూర్చి యీక్రిందిరీతిని కొన్నినియమములు నిరూపింపఁబడినవి.

(యాజ్ఞవల్క్య సంహిత. అధ్యా. II)

"తన ధర్మమునకు విరోధింపనిదియు సామయికమును 'రాజకృతమును' అగు ధర్మము ప్రయత్నముచే రక్షింపఁబడఁదగినది. ఎవఁడు గణద్రవ్యమును హరించునో, యెవఁ డేర్పాటు నతిక్రమించునో వాని సర్వస్వమును హరించి రాష్ట్రమునుండి వెడలనడుపవలయును. సమూహహితమును జెప్పు వాని వాక్యప్రకార మందఱు నాచరింపవలయును. ఇందు విపరీతముగ నడుచువాని ప్రథమసాహసమునకు దండనము విధింపవలయును. రాజు సమూహకార్యమునందు వచ్చినవారిని దానమానాదిసత్కారములచేఁ బూజించి కార్యమైనతరువాత విడువవలయును. సమూహకార్యమునఁ బంపఁబడిన



వాఁడు తనకు లభించినదానిని సమూహమున కిచ్చివేయవలెను. వాఁడట్లు స్వయముగ నీయనిచోఁ బదునొకండు రెట్లిచ్చుకొనునట్లు రాజు చేయవలయును. ధర్మజ్ఞులు శుచిగలవారుగను, లోభములేనివారుగను, కార్యచింతకులుగను నుందురు. సమూహహితమును జెప్పువారి వాక్యప్రకారముగ నాచరింపవలయును.

శ్రేణినైగమపాషండులగణములకుఁ గూడ నిదియె విధి. వీని భేదమును రాజు రక్షింపవలయును. పూర్వవృత్తిని బరిపాలింపవలయును.

(యాజ్ఞవల్క్య II 187-1921)

విష్ణుస్మృతియందు "గణద్రవ్యాపహర్తావివాస్యః" అనియున్నది.

౧౧

పూర్వాధ్యాయములలో రాజభోగ్గులఁ గూర్చి వ్రాసియుంటిమి. ఈ రాజభోగ్గులు ప్రసిద్ధములగు నుద్యోగస్థానములలో నుండి రాజకీయవ్యవహారముల నిర్వర్తించుచుండెడివారు. నటులు, గాయకులు, హస్తిదమకులు, మున్నగువారలు రాజసేవకులయ్యుఁ బ్రసిద్ధములగు పదవులలో నుండి నట్లు పరిగణింపఁబడక రాజునకును, రాజకుటుంబమునకును సంతోషము గలుగఁజేయుచు రాజుచేఁ బోషింపఁబడుచుండెడివారు.

నటులెట్టి ప్రదర్శనములఁ గనఁబఱచుచుండెడివారో సురుచిజాతకములో నీ క్రింది రీతిని వర్ణింపఁబడినది. (IV 324) "ఆకాలమున నిపుణులగు నటు లిరువురు "మందకర్ణుఁడు, శ్వేతకర్ణుఁడు" అను నామములచేఁ బరఁగుచు రాజును నవ్వింపఁ బ్రయత్నించుచుండిరి. అందులో మందకర్ణుఁడు రాజప్రాసాదద్వారంబునొద్ద "అతులంబ" అను

ఘనవృక్షంబు నొకదానిని స్థాపించి యా "అతులంబ" వృక్షపుశాఖకు నొకత్రాటిని గట్టి యా త్రాటి బంతిని మీఁదుగ విసరి యా వృక్షముమీఁదికెగఁ బ్రాకఁ బ్రారంభించెను. వెస్సవనుకిని వృక్షముఁ "అతులంబ" అని చెప్పఁబడుచున్నది. వెస్సవనుని సేవకులాతనిని బంధించి తునియలు తునియలుగ నాతని దేహము ఛేదించి భూమిపైఁ బడవేసిరి. తదితరులగు నటులందఱాతునియలఁ గూడఁదీసి యుదకంబును వానిపైఁ జల్ల నెప్పటివలె నా నటుఁడు సజీవుండై పుష్పవసనంబు ధరియించి యాడసాగెను. శ్వేతకర్ణుఁడను రెండవ నటుఁడు చితిని బేర్చి నిప్పుపెట్టి యనుచరులతోఁ గూడ నాచితిని జొచ్చె. ఆచితి దగ్ధమై చల్లారిన పిదప నచటినుండిన నరులందఱు నుదకమును జల్లనా నటుఁ డనుచరులతోఁ గూడ బయటికివచ్చి పుష్పవసనము ధరియించి యాడసాగెను." మఱియు నా కాలములోఁ గూడ వాఁడియై పొడువైన కత్తుల మ్రింగువారుండెడి వారని దసణ్ణకజాతకంబు వలనఁ దెలియవచ్చుచున్నది. వాఁడియైనదియు ముప్పదిమూఁడడుగుల పొడువు గలిగినదియునగు కత్తి నొకఁడు మ్రింగెనని చెప్పఁబడినది. దుబ్బిచ జాతకములో లంఘన నటుల యద్భుతకర్మములు వర్ణింపఁబడుచున్నవి. ఒకదానివెనుక నింకొక బల్లెమును బాతి యీ నటులు నైపుణ్యముతో గెంతి దాఁటుచుండెడివారు.

దేశమునఁ దిరుగుచుఁ బాముల నాడించుచు జీవించెడి పాములవాండ్రును జాతక కథలలోఁ గాన్పించుచున్నారు. సాలక జాతకములో, నొక యహితుండికుఁడు మర్కటమున కొకదానికిఁ బాముకాటునకు విరుగుడు మందిచ్చి సర్పముతో నాడునట్లు చేయుచు ధనము నార్జించుకొనుచుండెడి వాఁడని చెప్పఁబడియున్నది (III 198). అహిగుండి జాతకములో నింకొక యహితుండికుఁ డెట్లు ధనము నార్జించి సుఖజీవనముఁ జేయుచుండెడి వాఁడో వర్ణింపఁబడినది.



దేశమున నిప్పటికిని "పీటి" పనులు చేయుసమయములందును, బాముల నాడించుసమయముల యందును దూర్యముల వాయించు నాచారము కాన్పించుచున్నది. ఇట్టి యాచారంబు నవీనంబు కాక బహుపూర్వకాలము నుండియు దేశము నందుండినట్లు జాతకకథల వలనఁ దెలియవచ్చు చున్నది. ఉత్సవసమయము లందు సర్వసాధారణముగఁ దూర్యములు మ్రోఁగుచుండును. వీణయు, భేరియు, శంఖమును, దఱచుగ నిట్టి సమయములందు వాయింపఁ బడుచుండెడివి. భేరీజాతకములో భేరీవాదకుఁడును శంఖధమకుఁడును నుత్సవసమయములలోఁ గడునైపుణ్యముతో నావాద్యముల వాయించి బహుధనము నార్జించిరని చెప్పంబడినది.

దేశమునఁ బర్యటించు నహితుండికులు మున్నగువా రెట్లు జీవించుచుండెడివారో కొంతవఱకుఁ దిత్తిరజాతకమువలనఁ దెలియనగును.

"ఆతఁడు వర్తకులయొద్ద భారవాహకుఁడుగ నుండి కళింగదేశము నంతను ద్రిమ్మరెను. ఆతఁడు వర్తకుఁడై కోలను హస్తమునఁ బూని శంకుపథంబుపైఁ బర్యటించుచుండెను.

ఆతఁడు నటులతోను, వ్యాధులతోను దేశమును బర్యటించినాఁడు.

"ఒకఁడు పక్షులం బట్టియు, ధాన్యంబును 'అల్హాక' మానంబుతోఁ గొల్చియుఁ, గుటిలులగు జూదకాండ్రతో నక్షములనాడియు ధర్మముల నిరాకరించియు, దండితులైనవారల రక్తమును స్రవింపకుండునట్లు చేసియు (బిచ్చమెత్తుకొనునపుడు) మిక్కిలి వేఁడియగు నాహారమును దాఁకి చేతులఁ గాల్చికొనియుఁ బ్రవర్తించెను."

ఆకాలమునాఁటికి నటులు, అహితుండికులు మున్నగువారలు సుబద్ధంబులగు వర్గములను జెందియుండిరని నిశ్చయించుట కష్టము.

ఐనను నట కులమును, భేరీవాదక కులమును జాతకకథలలోఁ గాన్పించుటఁ బట్టియు, హస్తిదమ కులలోను, లంఘనులలోను బుత్రులు జనకుల వృత్తులనే యనుసరించుచుండిరని (I 430) దుబ్బచజాతకములో జెప్పఁబడుటం బట్టియు, నా కాలమునాఁటికి వీరలలోఁ గూడ వర్గనిర్మాణము జరిగియుండెనని మన మూహింపవచ్చును. మానవ ధర్మశాస్త్రమునాఁడు నటుల వర్ణము సంకరవర్ణములలోఁ బేర్కొనఁబడుచుండెను.

ఒక వృత్తినే యవలంబించువారు వివిధములగు నుపశాఖలఁ జెందియున్నట్లు జాతకములలోఁ జెప్పఁబడిన విషయములఁ బట్టి తోఁచుచున్నది. ఆకారణముచేఁ జేఁపలఁ బట్టువారలలో జాలముల నుపయోగించువారు కేవత్తులనియును, (కైవర్తులనియును) దండము నుపయోగించి చేఁపలఁ బట్టువారు బాలిసుకులనియును జెప్పఁబడుచున్నారు. వ్యాధులలో మిగలుద్దకుఁడు (మృగలుబ్ధకుఁడు) సకునలుద్దకుఁడు (శకునలుబ్ధకుఁడు) వత్తకలుద్దకుఁడు (వార్తకలుబ్ధకుఁడు) గామవాసి యత్తకలుద్దకుఁడు (అనఁగా గ్రామములో వసియించుచు నిడుపైన తరువుల క్రింద మృగముల పాదచిహ్నములనుగని వలలు పన్ని మృగముల వేఁటాడువాఁడు) అను భేదములు గలవారు జాతకకథలలోఁ బేర్కొనఁబడుచున్నారు.

ఇంతవఱకు నెట్టివారు భృతిభుక్కులుగను, దాసులుగను నుండెడివారో చెప్పఁబడలేదు. ఇప్పటివలెనే పూర్వకాలములోను దరిద్రులై వాణిజ్యకర్షణాదులను జేసి జీవించుటకు శక్తిలేనివారలు భృతిభుక్కులగుచుండెడివారని మన మూహింపవలయును. సువణ్ణహంస జాతకములో నొక బ్రాహ్మణునియొక్క ముప్వురు పుత్రికలు ధనికుల కులములలో సేవఁ జేసి పొట్టఁ బోషించుకొనుచుండెడివారని చెప్పఁబడినది. నిరుపేదయగు గహపతి (గృహపతి) వేతనమునకై యొకని



యొద్ద సేవఁ జేసి కాలక్షేపము చేయుచుండెడివాఁడని సుతనుజాతకములోఁ జెప్పఁబడినది. యజమానులు దయాళురై యుండినచో వాని సేవకులు సుఖులై యుందురు. అటుగాక యజమానులు నిర్దయులై యవ్యవస్థితచిత్తులై యుండినచో వారి సేవకుల కష్టము లివ్వి యని చెప్పుటకు వీలుపడదు. 'పొట్టి పోతరాజు కొలువను'నది యాంధ్రదేశమున సుప్రసిద్ధమె. బౌద్ధధర్మమును మాత్రము గృహపతులెట్లు తమ సేవకులను దయతోఁ గాపాడవలెనో చెప్పఁబడినది. అట్లు మాత్రము గృహపతులు సంచరించినచో సేవకులు వారి యజమానుని విడువక భక్తిశ్రద్ధలతోఁ గొలుచుచుందురు. "భృతిభుక్కులు యజమానుల గృహములలో భోజనములం జేయుచుండెడివారు. సాయంకాలమయిన పిదపఁ దమ తమ గృహములకుం జనుచుండెడివారు" అని గంగమాల జాతకమువలనఁ దెలియవచ్చుచున్నది.

ఎట్టి హక్కులు లేక జీవించు దాసులలో సప్తవిధములైన వారలు మానవధర్మశాస్త్రములోఁ జెప్పఁబడుచున్నారు (VIII 415). యుద్ధరంగమునందుఁ బట్టుకోఁబడినవారు, ధ్వజాహృతులు, (2) భోజనాదులకై దాసులైనవారలు, భక్తదాసులు. (3) గృహమున జనించినవారు, గృహజులు. (4) కొనఁబడినవారు, క్రీతులు. (5) దానంబులుగ నొసంగఁబడినవారు, దత్త్రిములు. (6) పైతృకులు. (7) దండదాసులు. ఇట్టి దాసులు జాతకకథలలోఁ గూడఁ గాన్పించుచున్నారు. కులావక జాతకములో గ్రామభోజకుఁడు పాపాత్ముండై గ్రామస్థులకు హానిఁ గలుగఁజేయుటచేత రాజుచేఁ బట్టుకోఁబడి తన సర్వస్వమును బోఁగొట్టుకొని గ్రామస్థులకు దాసుఁడుగఁ జేయఁబడి దండింపఁబడినట్లు చెప్పఁబడినది (III 343). జాతకకథలో బ్రాహ్మణుఁ డొక్కరుఁడు 'ఏడువందల కహాపణములను' బానిసను గొనుటకై రాజునర్థించెనని

చెప్పంబడినది. కటాహకుండను దాసుఁడు సెట్టికుటుంబములో సెట్టి కుమారుఁడు పుట్టినదినముననే జననముఁ గాంచెనని చెప్పఁబడినది. చుల్లనారద జాతకములోఁ జోరు లొక గ్రామమును గొల్లగొట్టి ధనమునంతను హరించి గ్రామవాసులను దాసులనుగ నొనర్చిరని చెప్పఁబడినది.

యజమానులు క్రూరులైనచో దాసులకు నిహముననే నరకానుభవ మగును. యజమానులు దయార్ద్రహృదయులై యుండినచో దాసులు సుఖులై యుందురని వేఱె చెప్పనవసరము లేదు. ఉరగ జాతకమున నొక బ్రాహ్మణ కుటుంబములోని బ్రాహ్మణుఁడును, నాతని భార్యయుఁ, బుత్రుండును, బుత్రికయుఁ, గోడలును, దాసియు సుఖముగ నొండొరులఁ బ్రేమించుకొనుచు జీవించు చుండెడివారని చెప్పఁబడినది. మఱియు బ్రాహ్మణపుత్రుఁ డామెకు (దాసికి) నప్పుడప్పుడు బాధ కలుగఁజేసియుండునా యని యొక్కఁరుడు ప్రశ్నింప నామెయు "ఓయీ! అట్లు వచింపకుము. అట్టివాని నే నెన్నఁడును గనలేదు. శాంతుండై, యనుకంపాయుక్తుండై నా యజమానపుత్రుఁడు నన్నుఁ దన బిడ్డవలెఁ బ్రేమించుచుండెడివాఁడు" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఈరీతిగనే నానచ్ఛందజాతకమువలనఁ గూడ దాసీజన మత్యంతానుకంపతోఁ జూడఁబడుచుండెనని తెలియనగును. అందఱు యజమానులు నిట్టి దయతోఁ దమ దాసులను జూచుచుండెడివారని మాత్రము మన మూహింపరాదు. దాసులను దిండిపెట్టకయుఁ, గొట్టియు, బంధించియు బాధపెట్టుచుండెడి యజమానులును జాతక కథలలోఁ గాన్పింపకపోరు. కటాహకుం డను నొక శ్రేష్ఠిదాసుఁడు వ్రాఁతనేర్చుకొని చదువఁగల శక్తిగలవాఁడై భాండాగారాధ్యక్షుఁడై యుండి యీరీతిని జింతించెను:

"నన్నెల్లపుడు భాండాగారాధ్యక్షునిగఁ బని చేయనీయరు.



ఏదియో యొక దినమున నాయం దేదియో యొక్క లోపము నెంచి నన్నుఁ గొట్టి, బంధించి, వాఁతలు వేసి, దాసునకుఁదగు నాహారము నొసంగెదరు." ఇతర గృహములకు భృతికై పంపఁబడు దాసి యేనాఁడైనను ధనమును యజమానునకుఁ దెచ్చి యీయకుండిన నాదినమున నా దాసిని గట్టితోఁ గొట్టి యొకమూలకుఁ ద్రోసివేసెడివారని (I 402) నామసిద్ధిజాతకములోఁ జెప్పఁబడినది. కటాహజాతకములో దాసు లెట్టి కార్యములం జేయుచుండెడివారో వర్ణింపఁబడినది. దాసు లొకప్పుడు తమ యజమానులచే స్వాతంత్ర్య మొసంగఁబడుచుండెడివారు.

దాసులు చండాలాది నీచజాతులవారలకంటె నున్నతమగు పదవియం దుండెడివారని మన మూహింపవచ్చును. చండాలుర దురవస్థ మనుధర్మశాస్త్రమువలన స్పష్టమగుచున్నది.

"చండాలశ్వపాకులకు గ్రామమునకుఁ బైని నివాసము. వారలు పాత్రరహితులుగఁ జేయఁదగుదురు. ఏలోహపాత్రమందు వారు భుజింతురో యా లోహము కరఁగి మరల సంస్కరింపఁబడినను వ్యవహారమున కది యుపయోగింపదు. వీరలకు 'కుక్కలు గాడిదెలును' ధనముగాని వృషభాదులుగారాదు. శవములమీఁద బట్టలే వీరికి వస్త్రములు. భిన్నములైపోయిన కుండలందనఁగాఁ బెంకులలోఁ దినుట, యినుపకడియము లలంకారముగ ధరించుట, యెల్లప్పుడును దేశము లందుఁ దిరుగుట వీరికి నియతకృత్యములు." (X 51. 52)

"గ్రామాదుల సమీపమందుండెడి ప్రఖ్యాతములగు వృక్షములు, చైత్యములు" మున్నగువానిక్రిందను, శ్మశానవనపర్వత సమీపములందును వీరు ప్రకాశముగఁ దమకర్మములచే జీవించుచునుందురు." (X. 50)

"వీరియన్నము పరాధీనము. ప్రత్యక్షముగా ననఁగా స్వయ

ముగ వీరల కన్నమిడరాదు. ప్రేష్యులచే బెంకులలోఁబెట్టి యిప్పింపవలెను. రాత్రులందు గ్రామములందుఁగాని, పల్లెలందుఁగాని వీరు తిరుగరాదు" (X. 54)

"పగటియందుఁ గ్రయవిక్రయార్థమై రాజాజ్ఞచేఁ జిహ్నితులై గ్రామములందుఁ దిరుగవలెను. వీరు దిక్కులేని శవములను బైకిఁ దీసికొనిపోవలెనని శాస్త్రమర్యాద.'' (X. 55)

"వధార్హులను యథాశాస్త్రముగా రాజాజ్ఞచేఁ గొర్తదీయుట మొదలగువానిచేఁ జంపుటయు, వారి వస్త్రశయ్యాభరణాదికము పుచ్చుకొనుటయు వీరికివృత్తి." (X. 56)

జాతకకథలవలనను జండాలురిట్టి నైచ్యములోనె జీవించుచుండినట్లు స్పష్టమగుచున్నది. చండాలురు నగరబాహ్యప్రదేశములలోని చండాలగ్రామకములందు నితరుల సంపర్కమేమియు లేక జీవించుచుండెడివారు. చండాలురకుఁ బట్టణములలోఁగాని, గ్రామములలోఁగాని వాసంబులుండుటకు వీలులేదు. చండాలురు వేణునాదము మున్నగువానిని గావించి ధనమార్జించుచుండెడివారని జాతకములలోఁ జెప్పంబడినది. అట్టిసమయములందును వారు గ్రామద్వారబహిఃప్రదేశములనే వేణునాదము గావింపవలయునుగాని పురమును బ్రవేశింపఁగూడదు.

చండాల సంపర్కము పాతిత్యసంపాదకముగ నుత్తమకులజులచేఁ బరిగణింపఁబడుచుండెడిదని మనము పూర్వాధ్యాయములోఁ గనఁబఱచితిమి. చండాలునిపై వచ్చు గాలియైనను సోఁకిన బ్రాహ్మణు లశుచులగుదురను నమ్మకము వారలలో నుండెడిదని మనము పైనిఁజెప్పితిమి. చండాలుర నెంత హైన్యముతోఁ బ్రజలు చూచుచుండెడివారో యాక్రిరిద నుదాహరింపఁబడిన జాతకకథలవలన స్పష్టమగుచున్నది. ఒక సృగాల మాఁడుసింహము నొక దానిని వివాహ



హము చేసికొనెదనని చెప్ప నాసింహ మీరీతి వితర్కించుకొనెను. "ఈసృగాలము చతుష్పాజ్జంతువులలో నతి నీచముగను, జండాలసదృశముగను బరిగణింపఁబడుచున్నది. మేమన్ననో మృగరాజులము. నాతో నీసృగాలము బహునీచసంభాషణముఁ గావించినది. ఇట్టి వచనములను వినియే జీవించిన నేమి ఫలము? కనుక వాయుబంధనంబుఁ గావించి మృతిఁజెందెద."

మతంగజాతకములోఁ జండాలు రెట్టివేషమును ధరించుచుండెడివారో వర్ణింపబడినది. "లోపల నొక యెఱ్ఱగుడ్డను గట్టి దానిపై నొక మొలత్రాటిని గట్టి దానిపై మలినంబైన యొకవస్త్రమును ధరించి హస్తమున మృణ్మయపాత్రమును బూనుదురు." చండాలురభాష తదితరజనముల భాషకంటె వేఱుగనుండెడిదని చిత్తసంభూతజాతకమువలనఁ దెలియవచ్చుచున్నది.

ఇరువురు చండాలురు బ్రాహ్మణవేషమును ధరియించి తక్కశిలానగరమునకు వేదాధ్యయనము నిమిత్తము జనిరి. అందులో నొకఁడు దీపమువద్దఁ బ్రమాదవశంబున ముఖమును గాల్చుకొని యాబాధలోఁ జండాలభాష నుపయోగించుటచే నచటివారందఱు వానిఁ జండాలునిగాఁ దెలిసికొని వానిని శిక్షించిరి. శీలవిమంశజాతకకథావ్యాఖ్యానములోఁ జండాలురు శవములను మోయుచుండెడివారని చెప్పఁబడినది. పూర్వమునఁ జెప్పినట్లు జండాలురు వేణునాదము సలిపి ధనము నార్జించుచుండెడివారని జాతకకథలలోఁ జెప్పఁబడినది. ఈరెండుచోట్లఁ దప్ప మఱియెచ్చోటను జాతకకథలలోఁ జండాలుర వృత్తిఁగూర్చి యేమియుఁ జెప్పంబడలేదు.

చండాలురతోఁగూడఁ బుక్కసులు జాతకకథలలోఁ బేర్కొనఁబడుచున్నారు. ఈపుక్కసులు (పుల్కసులు) మనుధర్మశాస్త్రములో,

నిషాదునకు శూద్రస్త్రీయం దుద్భవించిన సంతానమైనట్లు నిరూపింపఁబడినది. శీలవిమంశకజాతకవ్యాఖ్యానమువలన వీరలు పుష్పములం గోసి జీవించుచుండెడివారని చెప్పంబడినది. మనుధర్మశాస్త్రములో "క్షత్తకు, నుగ్రునకును, బుల్కసునకును బిలములందుండెడి యుడుములు మున్నగువాని వధ, బంధనాదికము, ధిగ్వణులకు వాని నమ్ముకొనుట, గావుననేకారావరులచే వీరల కీవృత్తిచ్ఛేదము. వేణులకుఁ గాంస్యమురజాదివాద్యభాండవాదనము వృత్తి" (X 49) అని వీరల వృత్తి చెప్పంబడినది.

జాతకకథలలోఁ జెప్పఁబడు 'నెసాదులు' మనుధర్మశాస్త్రములోఁ జెప్పఁబడు నిషాదులతో సరిపోవుచున్నారు. నిషాదులు చేపలంబట్టి జీవింపవలయునని మనువుసిద్ధాంతము. చేఁపలనుబట్టి జీవించుటయు, మృగములనుబట్టి జీవించుటయు నతినీచవృత్తులుగ జాతకకథలలోను బరిగణింపఁబడుచున్నవి. రోహంతమిగజాతకములో రాజు వ్యాధునిఁ దనవృత్తిని వదలి కృషివలనను గాని, కుసీనమువలననుగాని, వాణిజ్యమువలననుగాని జీవింపవలెనని చెప్పెను (II 200). చూలనందియజాతకములో బ్రాహ్మణయువకుఁ డొక్కరుఁడు శిల్పము నవలంబించి జీవనోపాధిని సంపాదింపలేక తుదకు వ్యాధుఁడయ్యెనని చెప్పఁబడినది. అస్సలాయనసుత్తములో నిషాదులు, చండాలురు, వేణులు, రథకారులు, పుల్కసులు హీనజాతివారలుగఁ బేర్కొనఁబడుచున్నారు. వేణులును హీనజాతివారలుగఁ జూడఁబడుచుండెడివారని కుశజాతకమువలన స్పష్టమగుచున్నది. అందు రాజ్ఞికోడలిని మందలించుచు "నీవు వేణుకుల స్త్రీవో లేక చండాల స్త్రీవో? కానిచో మద్దవంశసంభూతురాలవైనచో నెటుల నీ భర్తను దాసుని పదవికిఁ దిగలాగఁగలవు?" అని పల్కెను. బుటల నల్లువారును, వేణుకారులును, హీనజాతులవారై నట్లు పరిగణింపఁబడుచుండెడివారు.



మన మింతవఱకును భారతఖండంబున రెండువేల యయిదు వందల సంవత్సరములకుఁ బూర్వమున వర్ణము లెట్టి చిహ్నములఁ గలిగియుండెడివో జాతకకథలలోని విషయములంబట్టి గనుగొంటిమి. బ్రాహ్మణ సిద్ధాంతములో వర్ణింపఁబడిన వర్ణవిషయములు చాల వఱకు జాతకకథలయందుఁ గనఁబడు విషయములతోఁ సరిపోవుచున్నవి. పశ్చిమదేశీయుల వ్రాఁతలను సవిమర్శముగఁ బఠియింపని ప్రాగ్దేశీయులుకూడ నస్పృశ్యతాదివిషయములు బ్రాహ్మణులచేఁ గల్పింపఁబడినవనియును, కఠినహృదయులగు బ్రాహ్మణులే యిట్టి దుష్ట సిద్ధాంతముల స్థాపించి చండాలాదుల హైన్యమునకుఁ గారకులైరనియును యోచించుచున్నారు. విశిష్టప్రబోధముఁ గలిగి, జేతలైన యార్యసంఘములవారు 'అల్పప్రబోధము' కలిగి పశుప్రాయులై జీవించుచుండిన యాదిమవాసులను దమలోఁ గలుపుకొనక యట్టివారెన్నటికిని దమలోఁ గలియకుండునట్లు తగిన యేర్పాటులం జేయుటలో వింత యేమియునులేదు. బ్రాహ్మణుల కర్కశదుష్కార్యంబుల కాఠిన్యమును ఖండించు పశ్చిమదేశీయులు తామును నట్టి యవకాశము కలిగినచోట నట్లె యాచరింపఁ బ్రయత్నించుచున్నారో లేదో దక్షిణాఫ్రికాఖండమునందలి భారతదేశీయుల దురవస్థను దెలిసినవారలకు విశదము కాఁగలదు. మనువు చండాలుర నెటుల పురపట్టణగ్రామబాహ్యప్రదేశముల నుంచుటకుఁ బ్రయత్నించుచు నియమములను గల్పించెనో యారీతినే దక్షిణాఫ్రికావాసులగు పశ్చిమదేశీయులు జాత్యభిమానావేశపరులై భారతీయులను నూతనచండాలుర వలెఁ బరిగణించుచు నట్టివారలు పురములలోను, బట్టణములలోను నన్నిభాగముల వసియింపఁగూడదనియు, వారలుండు తావులు తదితరుల వాసస్థానమునకు దూరమున నుండవలయుననియు నియమములఁ జేసిరి. బ్రాహ్మణులు శూద్రులధ్యయన యాజనపరిపాలనాదులఁ జేయఁ

గూడదని నియమించుటలో వారి స్వార్థపరత్వమును గనపఱచిరని పాశ్చాత్యుల నిందించుచున్నారు. కాని పాశ్చాత్యులే దక్షిణాఫ్రికాలో భారతీయులు కొన్ని యుద్యోగములఁ జేయఁగూడదని శాసనములను నెలకొల్పిరి. శూద్రులు సేవకవృత్తిని దప్ప వేఱువృత్తి నవలంబింపఁగూడదను నియమము దయాళురగు పశ్చిమదేశీయుల హృదయమునకు బాధఁ గలుగఁజేయుచున్నదిగదా! ఆ పాశ్చాత్యులే భారతీయులను భృతిభుక్కులుగ దక్షిణాఫ్రికాదేశమున నుంచుటకుఁ బ్రయత్నించుటలేదా? మనువు జీవించి యున్నందులకు శూద్రులపై సుంకముల విధింప బ్రయత్నింపలేదు.

రెండువేల సంవత్సరములైన పిదపఁ గ్రీస్తుమతము నవలంబించు పశ్చిమదేశీయులన్నో యట్టి పన్నుల విధియింపఁగల్గిరి. బ్రాహ్మణులు శూద్రసంపర్కమును సహించుచుండ కుండుటచే నిందాభాజనులగుచున్నారుగదా? ధూమశకటములలోని, మూఁడవతరగతి బండ్లలోఁ బశ్చిమదేశీయులకు వేఱుగ బండ్లుంచఁబడుటయర్హమా? దక్షిణాఫ్రికాఖండములోను ‘ఎమెరికా’ ఖండములోను ‘ఆసియా’ ఖండపువారలెట్టి నీచులుగఁ బరిగణింపఁబడుచున్నారో పత్రికలం జదువువారలకందఱకుఁ దెలియును. ఇప్పుడు “ఆసియా ఆఫ్రికా” అను ఖండముల వసియించు కృష్ణవర్ణులగు వారలను శ్వేతవర్ణులగు పాశ్చాత్యులు చూచుచున్న విధములన్నియు నొకచో నెత్తివ్రాసినచో నవి మనుస్మృతిల్లో వ్రాయఁబడిన శూద్రులను సంబంధించిన నిబంధనములను గాఠిన్యముచే మిక్కిలి గమించును.

ఇటుల వ్రాయుట పాశ్చాత్యుల నిరసించుటకుఁ గాదు; ఎచ్చటనైన నెవ్వరైన నట్లె యాచరింతురని చెప్పుటకు మాత్రమె. భారతఖండంబున వర్ణోద్భవంబునకును, దత్సంబంధములైన నియమములకును జాత్యభిమానమె కారణము.



జాత్యభిమానము కల్గిన బలవంతులైన మనుజుల సంఘము దుర్బలులగు వారల నోడించి యొక దేశములోనె వారలతో సంపర్కము కలిగించుకొనినచో వర్ణభేదములును, గఠినముగఁ గాన్పించు వర్ణాచారములును బుట్టకమానవు. నీచవృత్తులను జేయుచు శౌచాదులకు విదూరములగు నాచారముల నవలంబించు నాదిమవాసులను గని వారిని జండాల నిషాదవేణు లనఁబడు హీనజాతి వారలుగఁ బరిగణించిన ప్రాచీనార్యులు నిందాభాజనులుకారు. బ్రాహ్మణులు వర్ణములం గల్పింపలేదు. పూర్వాకాలమున నుండినఁ బరిస్థితులవలన వర్ణములు పుట్టినవి.



